సాహిత్య
మాసపత్రిక

డిసెంబరు - జనవరి
1984 – '85



# భారతి

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక




శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

డిసెంబరు 1984-జనవరి '85

సంపుటము : 61-62 | సంచిక : 12-1

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు



కళాప్రపూర్ణ, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు





కీ. శే. శివలెంక శంభుప్రసాద్ గారు

# స్వ విషయం




శ్రీమతి ఇందిరాగాంధీ విష్కృమణ తరువాత కాంగ్రెస్(ఐ)లో ఆమె కుమారునికి తప్ప ఇంకెవ్వరికి ప్రధానమంత్రి అయ్యే అవకాశము లేకపోయింది. జవహర్‌లాల్ నెహ్రూ అస్తమించినపుడు లాల్‌బహదూర్ శాస్త్రి ప్రధానమంత్రిగా ఎన్నిక అయ్యారు. లాల్‌బహదూర్ శాస్త్రి మరణం అనంతరం శ్రీమతి ఇందిరా గాంధీని ప్రధాన మంత్రిగా ఎన్నుకున్నారు కాంగ్రెస్‌వారు. రెండు సారులూ ఏదో ఒకవిధంగా పోటీ తరువాతనే ప్రధానమంత్రి పదవికి ఎంపిక జరిగింది.

శ్రీ రాజీవ్ గాంధీతో, ఆయన తోటి కాంగ్రెస్ (ఐ) వారు పోటీపడలేక పోయారంటే ఆ రాజకీయ పక్షంలో ఎటువంటి శూన్యం ఏర్పడిందో ఊహించవచ్చు. జవహర్‌లాల్ నెహ్రూతో బాటు వల్లభభాయి పటేల్, రాజేంద్రప్రసాద్, గోవింద వల్లభ పంత్, బి. జి. ఖేర్; చక్రవర్తి రాజగోపాలాచారి, మొరార్జీదేశాయ్, ప్రకాశం పంతులు, కామరాజు నాడార్, భోగరాజు పట్టాభి సీతారామయ్య వంటివారు ఎత్తుగా ఆలాగ కలిసి పనిచెయ్యగలిగేవారు. జవహర్‌లాల్ నెహ్రూ కాలంలోనే కాంగ్రెస్ పార్టీలో ఆయనకు ఎదురు మిగిలిపోతోందన్న ఆరోపణలు వినపడితే ఆయన కుమార్తె శ్రీమతి ఇందిరాగాంధీ కాలంలో కాంగ్రెస్‌లో ఆమెకు తప్ప ఇంకెవరికి చెప్పుకో దగిన స్థానం ఉండేది కాదు. విధేయులు తప్ప మిగిలిన వారందరూ కాంగ్రెస్(ఐ)కి దూరం అయిపోయారు.

శ్రీ రాజీవ్ గాంధీ తమ తల్లి అనుసరించిన మార్గాన్ని అనుసరించకుండా నలుగురినీ కూడగట్టుకొని ప్రభుత్వాన్ని నిర్వహించటానికి ప్రయత్నించ గలరని ఆశించాలి. భారతదేశంలో ప్రతిభ, సామర్థ్యం కలవారికి కొదువలేదు. వారి సహాయంతో కొత్త ప్రధానమంత్రి చెయ్యగలిగినది ఎంతయినా ఉంటుంది.

భారతి మొదటి సంచిక వెలువడి ఆరు దశాబ్దాలు దాటింది. భారతి మొదటినుంచీ కూడా తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా ఉండటానికి ప్రయత్నిస్తూ వస్తోంది. తెలుగువారు భారతీయులు. వారి సంస్కృతి భారతీయ సంస్కృతిలో ఒక భాగమే. సాంకేతిక విజ్ఞానం, దాని వినియోగం పెరిగినకొద్దీ మనుష్యుల మధ్య దూరాలు తగ్గి భూగోళం చిన్నదవుతోందంటూ ఉంటారు. భారతీయులు కూడా భూగోళవాసులే. భారత జాతీయోద్యమ నాయకుల దృష్టి సంకుచితమయినది కానేకాదు. ఆంధ్రులకి ఎప్పుడూ సంకుచితమయిన భావాలు లేవంటే అతిశయోక్తి కాదు. తెలుగువారు ప్రపంచంలో ఎక్కడ ఉన్నా అక్కడి వికాసానికి తోడ్పడేవారన్న పేరు తెచ్చుకున్నారు రాజకీయవాదుల చరిత్ర ఎలాగ ఉన్నప్పటికీ తెలుగువారి రాష్ట్రం యొక్క అభివృద్ధికి తెలుగువారి ప్రతిభ తోడ్పడినట్లుగా ఇంకేదీ తోడ్పడలేదు. తెలుగువారుగా, భారతీయులుగా భారతి అభివృద్ధికి రాసేవారూ, చదివేవారూ తోడ్పడినట్లుగా ఇంకెవరూ తోడ్పడలేరు !

# విషయానుక్రమణిక

## డిసెంబరు - జనవరి 1984-'85



ముఖచిత్రం :

ప్రధానమంత్రి శ్రీ రాజీవ్ గాంధీ

డా॥ ఎ. విజయ దత్తాత్రేయ శర్మ



# నెల్లూరు జిల్లా గ్రామనామములు ఒక పరిశీలన

ఈ జిల్లాకు ఉత్తరాన ప్రకాశం జిల్లా. తూర్పున బంగాళా ఖాతం, దక్షిణమున తమిళనాడు, చిత్తూరు జిల్లా, పడమట కడప జిల్లా సరిహద్దులుగా ఉన్నాయి. 1976 సం॥ ఆం॥ ప్ర॥ స్టాటిస్టికల్ ఆబ్‌స్ట్రాక్ట్ ననుసరించి ఈ జిల్లాలోని వివిధ తాలూకాల్లోగల గ్రామముల/పట్టణముల సంఖ్యావివరములు పట్టిక-1లో నున్నవి [1]

చారిత్రిక నేపథ్యము :

చరిత్ర పూర్వయుగమునకు చెందిన అవశేషములీజిల్లాలో లభించినవి, మౌర్య, శాతవాహన ఇక్ష్వాక, పల్లవ, పశ్చిమచాళుక్య, చోళ, తూర్పుచాళుక్య, తెలుగు (నెల్లూరు) చోడ, పాండ్య, కాకతీయ, రెడ్డి, గజపతి, విజయనగరాది రాజవంశముల పాలన ప్రాచీన. మధ్య యుగములలో సాగినది తరువాత కుతుబ్‌షాహి, ఆర్కాట్‌నవాబుల పాలన చెల్లినది అటుపిమ్మట ఫ్రెంచివారికి, వెనుకనే, ఆంగ్లేయులకు ఈ జిల్లా ప్రాంతం దఖలు పడినది ఆధునికయుగమున వెంకటగిరి. కాళహస్తి వంటి పెద్ద సంస్థానములు, ఉదయగిరి జాగిర్దారి రాపూరు, తాడిబోయిన, తురవారు, చిట్టేడు, జూపల్లి (సైదాపురం), గంగులు వారిచెరువుపల్లి, బుచ్చిరెడ్డిపాళెం వంటి పెద్ద-చిన్న పాలియగాండ్ర పాలనలో ఈ జిల్లాలోని వివిధ భాగములుండినవి.

## ప్రాచీన మధ్యయుగములనాటి పాలనావిభాగములు వాడుకలు :

అంగడమంతనాడు

13వ శతాబ్దినాటి శాసనములలో ప్రస్తావింపబడిన అంగడమంతనాడు. అంగడిపట్టనాడు, అంగపళండనాడు ఒక్కటైయుండవోపుననియు - నిది ఆత్మకూరు తాలూకాలో నంతర్భాగమై యుండవచ్చుననియు పరిశోధకాభిప్రాయము

ఒక్కట్టునాడు :

గూడూరు తాలూకా ప్రాంతముగా గుర్తించబడినది.

ప (పి) డనాడు :

నెల్లూరు, గూడూరు, సూళ్లూరుపేట తాలూకా ప్రాంత భూమిగానెన్నబడినది.

పట్టిక - 1

| క్రమసంఖ్య | తాలూకా | గ్రామముల సంఖ్య జనావాసం కలవి | లేనివి | పట్టణముల సంఖ్య | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1 | ఆత్మకూరు | 112 | 4 | — | 116 |
| 2 | గూడూరు | 136 | 16 | 1 | 153 |
| 3 | కావలి | 82 | 1 | 1 | 84 |
| 4 | కోవూరు | 87 | 2 | 1 | 90 |
| 5 | నెల్లూరు | 121 | 1 | 1 | 123 |
| 6 | రాపూరు | 108 | 7 | — | 115 |
| 7 | సూళ్ళూరుపేట | 154 | 5 | 2 | 161 |
| 8 | ఉదయగిరి | 117 | 1 | — | 118 |
| 9 | వెంకటగిరి | 133 | 12 | 1 | 146 |
| | జిల్లా మొత్తం | 1,050 | 49 | 7 | 1,1[illegible] |

పాకనాడు :

నెల్లూరు, వెంకటగిరి, ఉదయగిరి తాలూకాల ప్రాంత మధ్య భూమియని భావింపబడినది.

పోరితినాడు :

కావలి తాలూకా ప్రాంత భూమిగా నెంచబడినది.

మింగలనాడు :

గూడూరు తాలూకా ప్రాంత భూమిగా ఎన్నబడినది

ముండనాడు (రాష్ట్రము)

ముండ, మేల్మొండ అని రెండు భాగములగ విభజింపబడినట్లు గుర్తింపబడిన ఈ నాడులో మొదటి విభాగము కోవూరు తాలూకా, రెండవ విభాగము మొదటిదానికి పశ్చిమముగానున్న ఆత్మకూరు తాలూకాల ప్రాంతమైయుండునని నిశ్చయింపబడినది "శ్రీ సోమశేఖరశర్మగారు ముండరాష్ట్రమునకాపేరు ప్రాచీనకాలమున ముండులనుజాతివారి కావాసమైనందున, ఈ దేశవిభాగమున కాపేరు సిద్ధించి యుండెనని వ్రాసియున్నారు [2] న్యాయసేనుని ధర్మామృతములోని నొక గాథ ప్రకారము ఇక్ష్వాకులకు ముండియులని నామాంతరముండినట్లును, వారిప్రాంతము నేలినవారు కావుటచే ఆ ప్రాంతమునకాపేరు వారి మూలమున వచ్చియుండెననియు వేరొక అభిప్రాయము గలదు [3]

వెంగనాడు (వెంగరాష్ట్రము)

నెల్లూరు మండలములోని దక్షిణ తాలూకాల ప్రాంతభూమిగా గుర్తించబడినది.

సింగట్టినాడు ;

రాపూరు తాలూకా ప్రాంత భూమిగా గుర్తించబడినది

## రాజ్యములు

ఉదయగిరి రాజ్యము :

ఉదయగిరి, నెల్లూరు, కావలి, కోవూరు ఆత్మకూరు తాలూకా ప్రాంతములందు విస్తరించుకొనియుండినది

చంద్రగిరి రాజ్యము :

గూడూరు తాలూకా ప్రాంతము చంద్రగిరి రాజ్యాంతర్భాగమున నుండెడిది

## రాష్ట్రములు :

హిరణ్యరాష్ట్రము :

"సిరాష్ట్రము నెల్లూరు మండలములోని ఉత్తర, పశ్చిమ భాగములని పరిశోధకుల సిద్ధాంతము ... హిరణ్యరాష్ట్రమున కానామము హైరన్నాకులను తెగవారిప్రాంతమున నివసించి యుండుటచే గల్గియుండవచ్చునని యూహింపబడుచున్నది [4]" ఇక్ష్వాకుల సామంతులూ, సేనాధిపతులూ అయిన హిరణ్యకుల కానామమీప్రాంతమును వారేలుటచే వచ్చెనని ఒక అభిప్రాయంకాగా... "హిరణ్యరాష్ట్ర మొదలయినవి ఆయా కుటుంబాల పేర్లతోనో, వారి ఆధీనంలో వున్నవిగానో వుండేవి" అని వేరొక అభిప్రాయం [6]

## సీమలు/స్థలములు :

ఉదయగిరి సీమ :

16 శ॥ నాటి శాసనములనుబట్టి ఈ సీమ కావలి, ఆత్మకూరు తాలూకా ప్రాంతములందుకూడ విస్తరించుకొనియుండినది.

నెల్లూరు సీమ/వణితము

శ॥ సం॥ 1544 నాటి వెంకటపతిరాయల శాసనమునుబట్టి నెల్లూరు సీమలో నేటి ఆత్మకూరు తాలూకా ప్రాంతముకూడ అంతర్భాగమైయుండెడిది

రాపూరు సీమ

రాపూరు సీమ నేటి రాపూరు తాలూకా ప్రాంతముగా గుర్తించబడినది.

కొట్టములు :

బోయకొట్టములు లేక బోయ విహారదేశము అనునది ఉదయగిరి, ఆత్మకూరు తాలూకా ప్రాంత భూమిగా గుర్తించబడినది.

పై పాలనా విభాగములు ఆయా ప్రాంతములందలి ప్రధాన నగర నామాదులనుబట్టియు, పాలక జాతుల నామప్రభావ ప్రకారమునను ఏర్పడినవని తెలియుచున్నది. సరిహద్దులోనున్న అరవ భాషా ప్రభావముకూడ నీ ప్రాంతీయ విభాగ నామములపై ఎన్నదగిన రీతిలో నుండినది.

పట్టిక — 2

# శాసనములు - గ్రామనామములు

| క్రమ సంఖ్య | శాసనములలో గ్రామనామము | ప్రస్తుత గ్రామనామము | తాలూకా | ఆధారము — కాలము |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1 | పాణ్బూరు | పొంటూరు | నెల్లూరు | పల్లవసింహవర్మ పాణ్బూరు తామ్రశాసనము, క్రి. శ. 5-6 శ॥ భారతి ఆగస్ట్, 1982, పు 11,12. |
| 2 | నెల్లూరు | నెల్లూరు | ,, | నెల్లూరు శాసనాలు (గూడూరు) నెం 108, క్రి.శ. 1530-31. |
| 3 | కుఱుటూరు | కొరుటూరు | ,, | పైది (నెల్లూరు) నెం. 67 |
| 4 | కెందుకూర | గొల్లకందుకూరు | ,, | విష్ణుగోపుని ఉరవపల్లి శాసనము ఇం.ఏ. వాల్యూం 5 |
| 5 | కరుపూర | కనుపూరు | ,, | పైది. |
| 6 | ప్రభాకరపట్నం | ప్రభగిరిపట్నం | ,, | నెల్లూరు శాసనము (ఉదయగిరి), నెం.21 ప్రాచీనాంధ్రచారిత్రక భూగోళము, పు 34 |
| 7 | అతుకూరు | ఆత్మకూరు | ,, | ,, ,, |
| 8 | కొరటూరు | కొరటూరు | ,, | ,, ,, |
| 9 | కొడవలూరు | కొడవలూరు | ,, | ,, ,, |
| 10 | కృష్ణరాయపట్నం | కృష్ణాపట్నం | ,, | ,, ,, |
| 11 | సరియపల్లి | సర్వేపల్లి | ,, | ,, ,, |
| 12 | గండవరం | గండవరం | కోవూరు | ,, ,, |
| 13 | వవ్వేరు | వవ్వేరు | ,, | ,, ,, |
| 14 | దువూరు | దువ్వూరు | ,, | ,, ,, |
| 15 | నిడువట్టు | విడవలూరు | ,, | రెండవ సింహవర్మ బుచ్చిరెడ్డిపాలెము శాసనము |
| 16 | మావండికుండై | మేడికుంట | ,, | నెల్లూరు శాసనము (నెల్లూరు) నెం 6 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 265-66. |
| 17 | కంఠనారాయణపురము | గండవరం | ,, | పైది నెం 19 |
| 18 | తామరై మడువు | దామరమడుగు | ,, | పైది నెం 72 |
| 19 | వేలూరు | వేగూరు | ,, | పైది నెం 121. |
| 20 | బయిండిపాడు | పమిడిపాడు | ఆత్మకూరు | పైది (ఆత్మకూరు) నెం 55 శ॥సం॥ 1212 |
| 21 | బొమ్మవరం | బొమ్మవరం | ,, | పైది, నెం 20 సదాశివరాయలు కాలమునాటి శాసనము. |
| 22 | పెళ్లిడు | పెల్లేరు | ,, | పైది నెం 48 శ॥సం॥ 1544 |
| 23 | ఉరువపల్లి | ఉలపాళ్ళ | ,, | విష్ణుగోపుని ఉరువపల్లి శాసనము |
| 24 | దేయూరు | రేవూరు | ,, | నరసింహవర్మ తామ్రశాసనము |
| 25 | కొండమురువుడు | కొండమీదికొండూరు | ,, | విష్ణుగోపుని ఆరుపుపల్లి శాసనము. |
| 26 | జలదంకి | జలదంకి | కావలి | నెల్లూరుశాసనాలు (ఉదయగిరి) నెం 21. |
| 27 | కావలి | కావలి | ,, | పైది (కావలి), నెం 50. శ॥ సం॥ 1558. |
| 28 | పెనుబర్తి | పెనుబర్తి | రాపూరు | పైది (రాపూరు) నెం. 49. |
| 29 | పికిర | పికిర | వెంకటగిరి | సింహవర్మ పికిర శాసనము ఎ ఇం. 8 నెం. 159 |
| 30 | అనంతసాగరం | అనంతసాగరం | ఆత్మకూరు | నెల్లూరుశాసనము (ఆత్మకూరు) నెం. 32 క్రి॥ శ॥ 1409-10. |
| 31 | నేల్లటూరు | నెల్లటూరు | గూడూరు | నెల్లూరుశాసనము (గూడూరు) నెం. 107 శ॥సం. 1452. |
| 32 | గూడూరు | గూడూరు | ,, | యస్ ఐ ఐ. 10 నెం. 504 శ. 1235 |
| 33 | మామిడి | మోమిడి | ,, | పైది. |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 34 | కావలూరు | కావలూరు | గూడూరు | నెల్లూరు శాసనాలు (గూడూరు), నెం. 15 క్రీ॥శ॥ 1336-37 |
| 35 | వోయిందణపల్లి | పుచ్చలపల్లి | ” | పైది (నెల్లూరు) నెం 111 క్రీ శ. 1204-5 |
| 36 | వీఱ్కాడు | వాకాడు | ” | పైది నెం 67 |
| 37 | తండము | తడ | సూళ్ళూరుపేట | నెల్లూరి తామ్రశాసనాలు, నెం 3 క్రీ॥శ॥ 1429-30. |
| 38 | అంగంపాడు | అంగంపాడు | ” | పైది |
| 39 | మంగలంపాడు | మంగలంపాడు | ” | పైది నెం 6 క్రీ శ 1602-3 |
| 40 | ఇలుపూరు | ఇలుపూరు | ” | పైది |
| 41 | ఉగుమూడి | ఉగ్గుమూడి | ” | పైది |
| 42 | ఉచ్చూరు | ఉచ్చూరు | ” | పైది |
| 43 | మోదుగులపాల్యం | మోదుగులపాలేం | ” | పైది నెం 7 క్రి. శ 1647-48. |
| 44 | మహిమలూరు | మహిమలూరు | ఆత్మకూరు | నెల్లూరు శాసనాలు (ఆత్మకూరు) నెం 38. శ॥ 1139. |

## హిందూమత సంబంధములు :

ఉదా :

అలివేలుమంగాపురం ; (ఉ)

"ఉదయగిరి కొండపై శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయమూ, అచటి నుండి ఏడు మైళ్ళ దూరంలో అలివేలుమంగాపురము కలవు. ఈ విధముగా ఉదయగిరికి తిరుమలకును, అలివేలుమంగాపురమునకును, తిరుచానూరునకును పోలికలున్నవి" [7] వెంకటగిరి తాలూకాలో యున్న అలివేలుమంగాపురముకూడ దైవసంబంధితముగానే ఎంచవచ్చును

కోటితీర్థం : (ఆ)

ఇచటగల కోటీశ్వరస్వామి (శివుడు) ఆలయమునుబట్టి గ్రామనామమేర్పడినది [8]

కేశవరం (కా) :

కేశవపురమను సంస్కృత నామము గల ఈ గ్రామము 'కేశవు'ని పరంగా నేర్పడినదని ప్రతీతి. [9]

గౌరవరం (కా)

"గౌరీదేవి ఒక్కతే వెలసి ఉన్న గ్రామం కాబట్టి గౌరీపురమని పిలువసాగేరు అదే కాలక్రమేణా గౌరవరమయింది" [10] కాని ఈ గ్రామనామము "గవరపరమ"ని - గవరలు (కోమట్లు) అనేకుల పరంగా ఏర్పడినదని ఒక వివరణ [11] అలా ఉండగా, కావలి తాలూకాలోనే గల బిట్రగుంటలో ఉన్న ప్రాచీన శ్రీ వెంకటేశ్వరాలయమును పెద్ద ఎత్తున అభివృద్ధి చేసిన లాంగుల్ల గజపతి కుమారై గౌరమాంబ పేరునకూడ ఈ గ్రామము రూపెత్తుటకు అవకాశమున్నదనిపించును.

దేవరపాలెం (నె) :

ఇచటకు సమీపమున 300 మీ ఎత్తు గల కొండగుట్టపైనున్న వేదగిరి లక్ష్మీనరసింహస్వామి ఆలయమునుబట్టి ఈ గ్రామనామమేర్పడినట్లు తోచును

దువ్వూరు (కో) :

దువ్వూరునకు దూర్వాశపురియని సంస్కృతనామము గలదు.

పెనుబల్లి (కో) .

స్థల పురాణ ప్రకారము పూర్వము కస్యప ప్రజాపతి ఒక యజ్ఞాన్ని జొన్నవాడలో నిర్వహించి ఇక్కడ గొప్పబలి ఇచ్చాడని తెలుస్తోంది [13]

చెన్నూరు (గూ)

స్థానికముగా గల చెన్నకేశ్వరస్వామి ఆలయమునుబట్టి ఈ గ్రామనామమేర్పడినదని విశ్వాసం. [14]

మన్నారుసోలూరు (సూ) .

"ఇచట శ్రీ అలఘమన్నారుస్వామి ఆలయము ఆళ్వారుల సంకీర్తనములకు తావలమైనవాటిలో నొకటిగ నున్నది [15]

ములుమూడి (నె) .

మునులపూడి అను జనవ్యవహారమును, మునిపురమనే సంస్కృత నామమును గలసిన చోట స్థలపురాణ ప్రకారము "అశ్వద్ధామ" కొంత కాలము నివసించెనని ప్రతీతి [16]

మునులపూడి (కో)

పూర్వకాలమందు మునులిచ్చట తపమాచరించెడివారట [17]

రామతీర్థం (కో)

శ్రీరామచంద్రునకు సంబంధించిన తీర్థంగానే భావించబడిన ఈ గ్రామానికి గౌండ్లపాలెము లేక గుండాలమ్మపాలెము పేర్లుకూడ గలవు.[18]

శిద్దనకొండూరు (కా) :

సమీపమున గల కొండపై గల సిద్ధేశ్వరస్వామి ఆలయమును బట్టి గ్రామనామమేర్పడినది.[19]

సీతారామపురం (ఉ) :

సీతారాముల పరంగా పేర్పడినది

సోమశిల (ఆ)

ఇచట గల సోమేశ్వరస్వామి ఆలయము గొప్ప మత ప్రాము ఖ్యముగలదైయున్నది అందువల్లనే గ్రామనామమేర్పడినట్లు తోచును.

సూళ్ళూరుపేట (సూ)

ఇచట జరుగు 'సుళ్ల' అను ఉత్సవము వలన గ్రామనామ మేర్పడినదందురు

సోమసానిగుంట (వెం)

సర్వజ్ఞ కుమార యాచమనాయకుడు (1832-1892). "వారు 1863 లో చేసిన బృందావన యాత్రాసందర్భమున అచటనుండి కొనితెచ్చిన రాధాకృష్ణస్వామి వారి స్వర్ణపాదములను వెంకటగిరి నగరి పూజ మహలులోనుంచి, స్వామివారి పవిత్ర సన్నిధిలో బండితగోష్ఠి జరుగుటకై 'సోమసానిగుంట'యను గ్రామమునకు రాధాకృష్ణపురమని పేరిడి పండ్రెడు వృత్తులుచేసి కవిపండితులకు బహూకరించిరి"[22]

ఈ క్రింది గ్రామనామములను కూడ హిందూమత సంబంధిత మైనవిగా పరిగణించవచ్చును అమ్మవారిపేట, అమ్మపాలెం, అత్తల సిద్ధవరం, భైరవరం, దేవులపల్లి, కైలాసనాథపురం, నమః శివాయ పురం, శిద్ధవరం శిద్ధగుంట, సుబ్రహ్మణ్యం, తీర్థంపాడు, తిరుమల పూడి, విశ్వనాథపురం, (అన్ని వెం), అంబాపురం, బ్రహ్మదేవం, గుడిపల్లిపాడు (అన్ని నె) దేవుని ఇస్కాడిక, రంగనాథపురం (సూ), ఈశ్వరవాక, నెల్లూరు సంగమేశ్వరస్వామిఇస్కాడిక సిద్దవరంయోగేశ్వరుని పల్లి, (అన్ని గూ), దేవర వేమూరు, లింగపాలెం, లింగసముద్రం, నందివాయి (అన్ని వా) కోదండరామపురం, అంగాలపాడు, రామానుజపురం, సాంబశివపురం, ఉమామహేశ్వరపురం (అన్ని కా) బ్రహ్మేశ్వరం, గణేశ్వరపురం, జనార్దనపురం, నందిగుంట, నంది నందిపాడు, గుడినరవ, రామదేవుని పాడు, తిరుమలపురం (అన్ని

## బౌద్ధమత సంబంధములు:

బుధపాడు (ఆ)

మహిమలూరుకు దక్షిణంగాగల బుధపాడు అనే గ్రామ ఒకప్పుడి ప్రాంతానఉండిన బౌద్ధమత ప్రభావసూచిక మని ప్రాయం.[23]

బుధనాం(గూ), బుదవాడ(ఉ) బొజ్జనపల్లి(రా) వంటి గ్రామ ములు సైతం బౌద్ధమత ప్రభావ సంజనితములే అయి ఉండ వీలున్నది.

జైనమతసంబంధములు (·)

ఈ జిల్లాలోగల నెల్లూరు, కృష్ణాపట్నం, కాసుమ ర్తి (అన్ని నె) ఒకప్పుడు జైనస్థావరములు 'పాడు' నామాంత్యము గల గ్రామములను జైనమత సంబంధితములుగా నెంచవచ్చును అనుకొన్నచో అందుల కుదాహరణముగా ఈ క్రింది గ్రామనామము కనబడుచున్నవి.

అముదాలపాడు అమ్మపర్తిపాడు, కందలపాడు, కురిచెర్లపాడు మున్నవరప్పాడు, ముట్టెంపాడు, మైపాడు, ఒగరుపాడు, పల్లిపాడు పార్లపాడు, పుంజలూరుపాడు, విసవావిలేటిపాడు (అన్ని నె), అల్లం పాడు, చీమలపాడు, కందువల్లిపాడు, ముత్యాలపాడు, పెంటపాడు పోలిపాడు, (అన్ని గూ) అరిమనపాడు, ఆలూరిపాడు, చీకలేనిపాడు చెలికంపాడు, చిగురుపాడు, కలపాడు, కంధసలపాడు, కొత్తపల్లి పాడు, నాగులపాడు, పల్లిపాడు, పాతనలపాడు, ప్రావిపాడు, పాడు ఇస్కాడిక, తీర్థంపాడు, పీరగునప్పాడు (అన్ని వెం), గుర్తిపాడు, అంగంపాడు, మంగళంపాడు, మావిళ్ళపాడు, చెంబ బూరిపాడు, (అన్ని కా), అలగానిపాడు, అబూడపాడు, చెన్నూ ప్పాడు, తేగుంటపాడు, మానెగుంటపాడు, మర్రిపాడు, పతుకుపాడు తిరుపతిపాడు వేలుపాడు, (అన్ని కొ) ఆలంపాడు బొంగల అలుపాడు విలకప్పాడు, ఇర్లపాడు, కనియంపాడు, నాగరాజుపాడు, వందిపాడు నేరేడవాంపాడు, రామదేవులపాడు, రావిపాడు, తప్పిటిపాడు, దేవు పాడు, వారికుంటపాడు, వేంపాడు, (అన్ని ఉ) అయితనపాడు భీమవరప్పాడు, బోదగుడిపాడు, కృష్ణపాడు, అంగాలపాడు

మద్దూరిపాడు, మల్లవరప్పాడు, మానుబోలుపాడు, మారెళ్ళపాడు, సోమవరప్పాడు, తెల్లపాడ, (కా) గిలకపాడు, కొమ్మిపాడు, కొత్తూరుపాడు, మునగపాడు, పలిచెర్లపాడు, పెరుమాళ్ళపాడు (రా) బిల్లపాడు బాతులపల్లిపాడు, బొటకర్లపాడు, చందలూరుపాడు, గుంపర్లపాడు నాగులపాడు, కూనలమ్మపాడు (అన్ని ఆ) మొ॥

## రాజవంశ సంబంధములు (:)

### ఇక్ష్వాక (·)

ఈ జిల్లాలోని ప్రాచీన విభాగములైన 'ముండ' రాష్ట్రము 'హిరణ్య' రాష్ట్రము, ఇక్ష్వాకుల, వారి సామంత సేనాధిపతుల వంశనామ విశేషములచే నేర్పడియుండినవని ఇంత ముందుగానే సూచింపట జరిగినది.

### పల్లవ (:)

ఈ ప్రాంతమున పూర్వము సాగిన 'పల్లవ' పరిపాలనా సూచితముగ 'పల్లవోలు' (ఉ) గ్రామనామమేర్పడినట్లు తోచును

### తూర్పుచాళుక్య (:)

గుణగ విజయాదిత్యుని (848/849_891) పనుపున బోయ విహారదేశముల (ఉదయగిరి, ఆత్మకూరు తా॥ ప్రాంతము) జయించిన మహాసేనాని 'పండ్రంగ' తన పేర 'పండ్రంగం' అను గ్రామమును నెలకొల్పినట్లు గుర్తించబడినది [24] 'పండ్రంగం' 'పాండ్రంగి' గ్రామముల వరుసగా సూళ్ళూరుపేట, ఉదయగిరి తా॥లో ఉన్నవి.

పై పండ్రంగని వంశములోని వాడైన 'దుర్గరాజు' తూర్పు చాళుక్య రెండవ అమ్మరాజు (945-970) యొక్క మహాసామంతుడు కందుకూరు కేంద్రంగా దక్షిణాన సువర్ణముఖినుంచి, ఉత్తరాన గుండ్లకమ్మ వరకుగల రాజ్యాన్ని పాలించాడు. 'దుగరాజపట్నం'(గూ) ఈ దుర్గరాజుపేరుననే వెలసినదనిగుర్తింపబడినది [26] కాగా, "గోల్కొండ నవాబుల కాలంలో తూర్పుఇండియా కంపెనీవారు 1625లో గూడూరు తాలూకా దుగరాజపట్టణమున ఫ్యాక్టరీ నెలకొల్పుకొని వ్యాపారం ప్రారంభించారు ఆ రోజులలో ఆర్ముగమొదలియార్ అను పలుకుబడిగల వ్యక్తి ఆ ప్రాంతములో ఆంగ్లేయులకు సహాయపడుటచే ఈ రేవు పట్టణమునకు 'ఆర్ముగన్' అని పేరిడిరి అదియే క్రమముగా 'ఆర్మిగాన్' అని పరిణమించెను దుగరాజపట్నం ఇప్పటికీ నిలిచివున్నది [27] అని గల గమనింపు చారిత్రక సత్యముకాదని ఆంగ్లేయు లీప్రాంతమునకు వచ్చునరికే 'ఆర్మిగన్' అను పేరుకలదనియు, ఆంగ్లేయులకు ఆర్ముగ మొదలియార్‌కు సఖ్యతకొనసాగలేదనియు, వారాతనిని పదభ్రష్టునికూడ చేసిరనియు వేరొక పరిశోధకాభిప్రాయం[2]

### చోళ/నెల్లూరిచోళ ( )

మొదటి పరాంతకునికాలం (907 – 55) నాటికే ఈ జిల్లా ప్రాంతముపై చోళప్రభావము పడినది 10 శ॥ నుంచే ఈ ప్రాంతంలో అనేక తెలుగు చోళవంశములపాలన సాగినది వారిలో నెల్లూరి చోడులు ప్రసిద్ధులు చోడవరం(కా) పైవారి పాలనా ప్రభావ సూచితము నెల్లూరిచోడులలో 'సిద్ధి' 'తిక్క' నామధారులు అనేకులున్నారు. ఉదా నల్లసిద్ధి!, ఎఱ్ఱసిద్ధి, మనుమసిద్ధి1,నల్లసిద్ధి2,తమ్మిసిద్ధి, తిక్క1 మనుమసిద్ధి 2, తిక్క 2, తిక్కవరం (గూ॥ వెం) సిద్ధవరం (గూ॥ వెం ఉరా), 'సిద్దవరం' వెంకటేశపాలెం(కా), అత్తల 'సిద్దవరం' సిద్ధగుంట (వెం) గ్రామనామములుపై వారి పేరును దాల్చియుండును. 'గండగోపాల' అనుబిరుదు చాలమంది తెలుగుచోడ (నెల్లూరు) రాజులు వహించారు రెండవతిక్క (1278-1282) వారసుడు దునుమగండగోపాలుడు (1282 – 90) అతని తరువాత పాలకుడైన రాజగండగోపాలుడు (1290_1315) కాకతీయుల సార్వభౌమాధికారముపై తిరుగుబాటుచేశాడు మహామండలేశ్వర దేవనమురారిరాయగండగోపాల, రాహుత్తమనుమ గండగోపాల విజయగండగోపాల మొ॥ ప్రాంతీయపాలకులు ఈ జిల్లాలో లభించిన శాసనములలో కానవస్తారు గండవరం (కో), పెనుబర్తి గోపసముద్రం, మర్రిపల్లిగోపసముద్రం, చిన్నగోపవరం (అన్ని రా) పైగోపాలురులో నెవరి పేరైన దాల్చియుండ వచ్చును [29]

నెల్లూరి తెలుగుచోళులు క్రీ॥శ॥ 1120 ప్రాంతంలో తీరాంధ్రముపై పశ్చిమ చాళుక్యులు సాగించిన దండయాత్రా సంరంభంలో ఈ ప్రాంతాలకు వచ్చారు ఈ వంశంలో 'తెలుగువిద్య' కల్యాణి పశ్చిమ చాళుక్యపాలకులైన మొదటి, రెండవ సోమేశ్వరుల సామంతుడుకాగా, సోమసముద్రం(సూ), సోమవరప్పాడు(కా) సోమశిల(ఆ), సోమరాజుపల్లి (నె) గ్రామనామములకు పై సోమేశ్వరులకు నామ సారూప్యమున్నది.

### కాకతీయ (:)

రుద్రమదేవి (1262-89) ఈమండలంలో కొంతప్రాంతాన్ని ఆక్రమించుకుని నాగదేవరాజు (సుమారు 1271_75)ను తన ప్రతినిధిగా

నియమించినది ప్రతాపరుద్రునికాలం (1289-1323లో) రాజగండ గోపాలుని తిరుగుబాటు అణచివేయబడినది రుద్రకోట(కా), రుద్రవరం (గూ), నాగసముద్రం(కా) పై కాకతీయ సంబంధమున ఏర్పడి యుండును మనుమగండ గోపాలునికాలంలో నెల్లూరిమండలరాజకీయాలలోజోక్యం చేసుకొనిన కాయస్థఅంబదేవుని పేరునగాని, 'అంబ'యని జనసామాన్యంలో విస్తృతి కెక్కిన రుద్రాంబ పేరునగాని అంబాపురం (నె) వెలసియుండ వచ్చును. కాక, అదికేవలం దేవతాపరమైనదిగూడ కావచ్చును రుద్రవరం, రుద్రకోట గ్రామనామ చరిత్ర నిర్ణయసందర్భంలో ప్రతాపరుద్రగజపతి (1497-1519) రాజ్యంలో నెల్లూరిసీమ కూడ యుండినదనువిషయము విస్మరింపరానిది గౌరవరం (కా) లాంగుల్ల గజపతి కూమార్తె పేరున దాల్చియుండునేమోఅని ఇంతకు ముందుగానే గమనించుట జరిగినది

రెడ్డి (·)

రెడ్డిరాజ్యస్థాపకుడైన ప్రోలయవేమారెడ్డి సోదరుడైన మల్లారెడ్డి కందుకూరు రెడ్డిరాజ్యశాఖకు ఆద్యుడు ఈ శాఖలోమరి ఇరువురు 'మల్ల' నామాభిధానులున్నారు 'మల్లం'(సూ), 'మల్లవరప్పాడు' (కా) వీరిలోనెవరి పేరునైన దాల్చియుండవచ్చును కందుకూరిరెడ్డిప్రభు వర్గములో ఇరువురు 'మాచ' నామధేయులుకలరు 'మాచవరం' (వెం) వారిలో నెవరినామమునైనదాల్చి యుండును శ్రీగిరిరెడ్డి రెండవ కుమారుడు 'శివలింగ' లింగసముద్రం(రా), లింగంపాడు(సూ) గ్రామ నామకారకుడు కావచ్చును శ్రీగిరిరెడ్డికాలం (సుమారు 1398-1406) కాలంలో విజయనగర రాజులనెదిరించుటకు ఉదయగిరిపై సేనలను నడిపిన అన్నారెడ్డి పేర 'అన్నారెడ్డిపాలెం'(కో) ఏర్పడినదనిపించును కాని అదే తా॥లో నున్న బుచ్చిరెడ్డిపాళెం తొలిపాళియగాడు అన్నారెడ్డియే, పై గ్రామమునకు తనపేరిచ్చియుండుననుకొన వచ్చును

విజయనగర (·)

సంగమ వంశస్థాపకుడైన మొదటిహరిహర (1336-56) తన తూర్పురాజ్యమునకును ఉదయగిరిని ఒకకేంద్రంగాచేసి తన అనుజుడైన మొదటి కంపనను ప్రతినిధిగా నియమించాడు ఉదయగిరి తా॥లోనే కంపసముద్రం గ్రామమున్నది. మొదటి బుక్కరాయలు (1356-7 తనకుమారుడు భాస్కరభవదూరుని ఉదయగిరిప్రాంతపాలకునిగ ని మించాడు. 'దేవరాయ' అనునది సాధారణంగా విజయనగర రాజు నామద్వితీయావయంగా కానవస్తుంది. బుక్కాపురం (ఆ), భాస్క పురం (ఉ), దేవరాయపల్లి (ఆ), పైన వివరించిన సంబంధముల వల ఆపేర్లను గలిగియుండును, నరసాపురం, (నె), నరసింహపురం (ఉ గ్రామములు సాళువనరసింహ, తుళువనరసనాయక, వీరనరసింహులలో నెవరి మూలముగనైన ఆ పేర్లుతెచ్చుకున్నవా యనిపించును. నా మాంబాపురం (కో), కృష్ణదేవరాయల (1509-1529), తల్లిపేరున దాల్చినది కావచ్చును. అరవీటివంశపాలనా ప్రారంభకుడైన తిరుమ లుడు (1570) తనకుమారుడు శ్రీరంగను తెలగురాజ్య ప్రాంతా కారిగా నియమించాడు తిరుమలపురం (ఉ), తిరుమలపూడి (వెం) రంగసముద్రం(కా), రంగరాజసముద్రం(వెం), శ్రీరంగరాజపురం(కొ పైవారి ప్రభావమున రూపెత్తియుండును. రెండవ వెంకటపతిరాయ పక్షమువహించిన వెలుగోటి కస్తూరి రంగప్పకూడ పైవాటిలోని'రంగ నామాంకిత గ్రామనామ కారకుడు కావచ్చును.

అనంతసాగరం (ఆ)

"అనంతసాగరములోని మసీదు, గొప్పతటాకమును చూడత నవి ఈ చెరువునకు అనంతసాగరమనిపేరు కనుక ఈ గ్రామమునకు పేరు కలిగెను తిమ్మరుసు, సాయమ్మలపుత్రుడు రాయిసంకొండమరసు శ్రీకృష్ణదేవరాయల కాలములో నాటిశిలాశాసనము (క్రీ.శ 1522)వలన కొండమరసు తనతల్లితండ్రుల జ్ఞాపకార్థమై ఈ చెరువును త్రవ్వించెనని తెలియుచున్నది" [30]

ముత్యాలపాడు (గూ)

"శ్రీకృష్ణదేవరాయల కాలంలో ఇక్కడ ముత్యాలను రాసులుగా పోసి అమ్మేవారట అందువలన ఈ గ్రామాన్ని ముత్యాలగ్రామం అనే వారు కాలక్రమాన ముత్యాలరాసులు తగ్గిపోయి ఈ ఊరు పాడుపడింది అప్పటి నుండి దీనిని ముత్యాలపాడు అనిపిలుస్తారు [31]

(ఇంకా ఉంది)

# గద్దె

శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

నల్లరాతి నొకటి నాజూకుగా చెక్కి
గద్దెనిచ్చిచూడు గట్టితనము
ఉలికి పలుకకున్న ఊరేగులోకాన !
కంటి నలుసుర ! పులికంటి మాట !

మురికి నీరు కూడ ముత్యమై యొప్పారు
తామరాకు మీద తావు దొరక
బుద్ధి హీనుడైన బుధు డౌను గద్దె పై
కంటి నలుసుర ! పులికంటి మాట !!

చదువు సందెలొద్దు శాస్త్రజ్ఞానమువద్దు
మంచిచెడ్డ లరయు మనసు వద్దు
గద్దె యొకటిచాలు ఘనుడని పించగా
కంటి నలుసుర ! పులకంటి మాట !!

ఎట్టి వానినైన ఎక్కించు గద్దె పై
భజన పరుల నోటు భోజుడౌను !
కృష్ణరాయడౌను కృతులందు కొనుటకు.
కంటి నలుసుర ! పులికంటి మాట !!

అడ్డు దారి గద్దె నందు కొనుచునుండ
గడ్డు దారులేల గణన కెక్క ?
రేటుపెట్టి డాక్టరేటు లొ చందాన
కంటి నలుసుర ! పులికంటి మాట !!

లంచగొండులైన లాలూచి గాళ్ళైన
దోపిడీల బ్రతుకు దొంగలైన
ధర్మ ప్రభువు లైరి దర్పాన గద్దెపై
కంటి నలుసుర ! పులికంటి మాట !!



సుబ్బారావు & సుబ్బారావు

# విలియమ్ గోల్డింగ్: ఒక సమీక్ష

**1983** నోబెల్ బహుమతి గ్రహీత విలియం గోల్డింగ్ (జననము 1911) సుప్రసిద్ధ ఆంగ్లనవలాకారుడు చాలా సంవత్సరాల తర్వాత బ్రిటిష్ రచయితకు ఈ బహుమతి దక్కింది ఈ బహుమతి ఎవరికివ్వాలి అనే విషయంలో మొదటి భేదాభిప్రాయాలు వచ్చినట్లు తెలుస్తోంది ఏది ఏమైనా గోల్డింగ్ అభిమానులకు ఇది చాలా సంతోషకరమైన వార్త. నిజానికి ఇదివరకు నోబెల్ బహుమతులు తీసుకున్నవార కెవరికీ గోల్డింగ్ తీసిపోడు నవలారచనకు సంబంధించిన ప్రముఖ విషయాలలో ఆయనకు ఆయనే సాటి రచనా వైవిధ్యం అనండి, కథావ్యూహం అనండి తేక అల్లికలో చిక్కదనం అనండి, వీటికి అతీతమై అన్ని నవలల్లో ద్యోతితమైన ఒక సంకీర్ణ శక్తి అనండి, వీటన్నిటిని సమన్వయించి మానవనైజాన్ని, అతనిలోని అజ్ఞాత పాశవిక శక్తులను సమర్ధవంతంగా ఊహించి నవలా రూపంలో మనకు చూపినవాడు విలియమ్ గోల్డింగ్

నీతిపరమైన కట్టుకథల రచయిత అనీ, పరిహాస కథకుడు అనీ అన్యాపదేశ రచయిత అనీ, వైజ్ఞానిక నవలా రచయిత అనీ గోల్డింగ్‌ను వర్గీకరించడానికి పలువురు ప్రయత్నించేరు. అయితే గోల్డింగ్ ఒకానొక ఇంటర్వ్యూలో తన రచనలను నీతిపరమైన కట్టు కథలనడం కన్న పౌరాణికత గల కథలు అనడం సమంజసమని అన్నాడు ('మిథ్' ఒక వైపు విజ్ఞాన శాస్త్రానికి మరొకవైపు చరిత్రకు పరిపూరకంగా ఉండి విశ్వజనీనమైన మానవ స్వభావాన్ని విశదీకరిస్తుందని కొందరి రచయితల విశ్వాసము. అలౌకికమైన వాస్తవికతను పట్టి ఇచ్చేందుకై ఇలియట్, జేమ్స్‌జాయస్ వంటి ఆధునిక రచయితలు ప్రాచీన పౌరాణిక గాథల పంథాలో సమకాలీన జీవిత వృత్తాలను ఆవిష్కరించారు 'పురాపినవం పురాణం' అని మన ప్రాచీనులు వివరించిన అర్థం మనం ఈ సందర్భంలో జ్ఞప్తి చేసుకోవచ్చు.) గోల్డింగ్ నవలలో కాలము ప్రాంతము ఏదైనా వాటి నన్నింటినీ అధిగమించి మానవుని స్వరూప స్వభావాల చిత్రీకరణే వాటిలోని ప్రధానమైన ఇతి వృత్తము డార్విన్ యొక్క 'డిసెంట్ ఆఫ్ మాన్' సిద్ధాంతానికి గోల్డింగ్ యౌగికమైన అర్థాన్నే ప్రతిపాదిస్తూ, మానవుని పతనానికి సంబంధించిన బైబిల్‌లోని కథనాన్ని పునఃసృష్టి చేస్తూ, ఆ పతనాన్ని శాస్త్రీయ దృక్పథంతో విశ్లేషించి చూపుతాడు

గోల్డింగ్ మొదటి నవల 'లార్డ్ ఆఫ్ ది ఫ్లయిస్" (1954)చదవడానికి పిల్లల కథలా ఉంటుంది ప్రపంచం మారణ హోమంలో చిక్కుకున్నప్పుడు కొందరు పిల్లలను విమానంలో ఒక సురక్షిత ప్రాంతానికి తరలించడానికి ప్రయత్నం జరుగుతుంది కాని ఆ విమానం మీద కూడా దాడి జరిగినప్పుడు ఒక గొట్టం ద్వారా ఆ పిల్లలందరూ ఒక ద్వీపాన్ని చేరుకొని, అక్కడ చిక్కుకుని పోతారు ఆ ద్వీపం అపర నందనవనం అక్కడ వాళ్ళకు జీవించడానికి కావలసిన హంగులన్నీ ఉన్నాయి. పుష్కలంగా ఆహారము నీరు. గాలి, స్వేచ్ఛగా తిరగడానికి అనుకూలమైన తావులు అన్నీ ఉన్నాయి ఏదైనా అటువచ్చే ఓడకోసం వారు వేచి ఉండి, అక్కడ హాయిగా కాలక్షేపం చేయవచ్చు. కాని ఆ పిల్లలలో అతఃకలహాలు పుట్టుకొని వస్తాయి రెండు వర్గాలుగా చీలిపోతారు అపరనందనవనం లాంటి ద్వీపాన్ని ఘోరమైన నరకంలా మార్చి వేస్తారు దీనికంతా కారణం వాళ్ళలో తలయెత్తిన అధికారానికై పెనుగులాట అది చిలికి చిలికి గాలివానలా పరిణమిస్తుంది వారు పేర్చిన మంటల్లో ఒకడు కనబడకుండా పోతాడు ఇద్దరు చంపబడతారు. జాక్ అనే వాడొక వర్గానికి నాయకుడై, పిల్లలందర్నీ తన వైపుకు త్రిప్పుకొని, తన ప్రత్యర్థి అయిన రాల్ఫ్‌ని ఒంటరివానిగా చేస్తాడు వానిని వెంటాడి, చంపబోయే సమయానికి ఆ ద్వీపాన్ని ఒక ఓడ చేరుకుంటుంది ఆ ఓడలోని నావికాధికారి రాల్ఫ్‌ని రక్షించడమే కాక, పిల్లలందర్నీ తన ఓడలో తీసికొని వెడతాడు నిజం చెప్పాలంటే అది రక్షణ కాదు వాళ్లు ఎక్కడ నుంచి వచ్చారో అక్కడికే తీసికొని పోబడతారు. వారు వెళ్ళేచోటు ఇంతకన్న దారుణమైనది. అమాయకులు, కల్లాకపటం ఎరుగనివారు, అశం శుభం తెలియని వారని మనమనుకునే పిల్లలే ఇంతటి దారుణానికి తలబడితే, ఇంకి పెద్దలమాట ఏమని చెప్పాలి ?

"లార్డ్ ఆఫ్ ది ఫ్లయిస్" లేదా "మక్షికాధీశ్వరుడు" వాస్తవిక ఫక్కీలో వ్రాయబడిన నవల ఇది పిల్లల కథ అనిపించినా మరో దృష్టితో చూస్తే పెద్దల వ్యవస్థకి రూపాంతరీకరణ మానవుని లోని అజ్ఞాత పాశవిక ప్రవృత్తిని ఈ నవల అతి భయంకరంగా చిత్రీకరిస్తుంది మానవుని ఉత్తమునిగా రూపొందించడం సాధ్యమన్న విశ్వాసం ఒకానొకప్పుడు ఉందని, కాని ద్వితీయ ప్రపంచయుద్ధానంత

రం ఆవిశ్వాసం పూర్తిగా నశించిందని గోల్డింగ్ ఒక సందర్భంలో వ్యక్తపరుస్తాడు. మానవుడు సృష్టించిన ఉదార వాదం, సామ్యవాదం, మానవతావాదం, పెట్టుబడిదారీ విధానం వంటి సామాజిక వ్యవస్థలన్నీ తన్ను ప్రేరేపించి, తనకు తీవ్రమైన చోదక శక్తిలా పరిణమించిన అధికార వాంఛని తృప్తిపరచుకొనేందుకు మాత్రమేననీ, అందుకు చేసే ప్రయత్నాలలో మానవుడు ఎట్టి హింసాకాండకైనా పాల్పడుతాడనీ, ఆ ఈ నవల నిరూపిస్తుంది. మానవుడు ఆడమ్‌లా పునర్జన్మను పొందినా, స్వర్గతుల్యమైన ఈడెన్ ఉద్యానవనంలోనే పెరిగినా, అతని ప్రవర్తనా, చరిత్రా పునరావృత్తమవుతుందని ఈ కథ సూచిస్తుంది.

ఇరవయ్యో శతాబ్దపు మానవుడు గొప్ప నాగరికుడు. వైజ్ఞానికంగా ఎంతో ప్రగతిని సాధించాడు. కాని నైతిక, అధ్యాత్మిక దృష్టితో చూస్తే నేటి మానవుడు, చరిత్ర కందని రోజుల్లో జీవించిన అనాగరికుని కంటె ఉత్తముడా? అన్న విషయాన్ని గోల్డింగ్ తర్వాతి నవల "ది ఇన్ హెరిటర్స్ లేదా వారసులు" (1955) గూఢంగా చర్చిస్తుంది. ఒక నియాండర్తల్ కుటుంబం వారు ఆది మానవుల చేతిలో చిక్కుకొని చంపబడతారు. ఇక్కడ గోల్డింగ్ నియాండర్తల్ మనిషిని నేటి మానవుని వంశవృక్షములోని తొలి మానవుణ్ణి ఒకరి ప్రక్కనొకరి నుంచి వారి జీవిత విధానాలను నాటకీకరణం చేసి ఎవరు మెరుగో మనలనే ఊహించుకోమంటాడు. నియాండర్తల్ మనిషి అహం అన్న అభిజ్ఞలేని అమాయకుడు. అహం అన్న అభిజ్ఞమానవుని పతనానికి నాంది ప్రస్తావన అయింది. ఆ మనిషి తాను విశ్వంలో భాగాన్ననుకోడు. విశ్వానికి విభిన్నమైన వ్యక్తిత్వాన్ని కల్గి ఉన్నాననీ నమ్ముతూ, ఈ విశ్వాన్ని తన ఇచ్ఛానువర్తినిగా చేసుకోవాలని చూస్తాడు.

గోల్డింగ్ తర్వాతి నవల "పించర్ మార్టిన్" (1956) ఆధునిక మానవుని అహం ఎంత పెడదారిని పడుతుందో చూపుతుంది. మార్టిన్ ఒక నావికాధికారి. ఒకానొక యుద్ధంలో అతని నౌక మునిగిపోతుంది. అతడు ఎంతో కష్టంతో ఒక శిలనుచేరి, ఏడు రాత్రింబవళ్లు ప్రాణాలను నిలబెట్టు కోవడం కోసం పరిసర వాతావరణాది పరిస్థితులతో భీకరపోరాటాన్ని సల్పి, చివరికి ప్రళయ సదృశమైన పెనుతుపానులో చిక్కుకొని మరణిస్తాడు. కానీ ఈ నవల చివర ఒక చిత్రమైన మలుపు కనబడుతుంది. మార్టిన్ మృతదేహం ఒక ద్వీపానికి కొట్టుకొని వస్తుంది. అక్కడి రక్షక దళం సంభాషణను బట్టి మార్టిన్ సముద్రంలో పడిపోగానే మరణించాడనీ, తన సముద్రపు జోళ్ళను విప్పుకొనేందుకు కూడా వ్యవధిలేక మునిగిపోయాడనీ తెలుస్తుంది. మరి అతడా శిలను చేరి, వసతులు కల్పించుకొని ఏడురోజులు సల్పిన పోరాటానికి అర్థం ఏమిటి? మార్టిన్‌కి పించర్ అనేది అడ్డపేరు. నిజంగానే అతడు పించర్ దురాశ, అహంకారం అతనికి పెట్టినపేర్లు. బ్రతికినన్నాళ్లు తన ఇచ్ఛను తోటి వారిమీద రుద్దుతాడు. అతడు భౌతికంగా మృతి చెందిన తర్వాత కూడా అతని తత్త్వం మారదు. పాపశాళన చేయబడే వ్యవధిలో కూడా తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుందుకే కృత నిశ్చయుడై ఉంటాడు. అతని రక్కసతాల్మి, అకుంఠిత దీక్ష, ధైర్యము, ప్రొమీథియస్‌ను జ్ఞప్తికి తెచ్చే అతని సాహసోపేతమైన పోరాటం, మనలను ఆశ్చర్యచికితుల్ని చేస్తాయి. కానీ దీని కంతటికీ ప్రేరణ 'నేను-నాది' అన్న అహంకారం, తనొక ప్రపంచాన్ని సృష్టించుకొని అదే సత్యమన్న భ్రమకు లోనవుతాడు. భగవంతుడు ప్రపంచాన్ని సృష్టించడానికి ఏడురోజులుపట్టిందని బైబిల్‌లో ప్రవచించబడింది. ఆశిలపైమార్టిన్ ఏడురోజులసృష్టి, బైబిల్‌లో ప్రవచించ బడినదానికి ప్రతిధ్వని. చివర ఒక స్వాప్నికమైన స్థితిలో అతనికి దైవదర్శనం లభించగా, ఆ దైవాన్నుద్దేశించి "నిన్ను సృష్టించినవాణ్ణి నేనే!" అన్న మార్టిన్ మాటలు అతని అహంకారానికి పరాకాష్టకాగా, అదేసమయంలో అతని సృష్టి మాయమవుతుంది. మార్టిన్ ఒకజత ఎర్రటి పంజాగా మారుతాడు. పాపక్షాళనాసమర్థమైన స్థితినుంచి నరకానికి చేరుతాడు. తన మేధ, ఇచ్ఛ, మాత్రమే నిజమని నమ్ముతూ, తన విజ్ఞానంతో సృష్టికి ప్రతిసృష్టి చేయగలననుకొనే ఆధునిక మానవుని అహంకారం ఎలా వెఱ్ఱితలలు వేస్తుందో ఈ నవల చూపుతుంది.

శాస్త్ర విజ్ఞానం వల్ల తాను సాధించలేనిదేమీ లేదనే భావన, నీట్‌జ్‌షె, ప్రతిపాదించిన మానవాధిక్యతకై ఇచ్ఛాశక్తి సిద్ధాంతము ఒకవిధంగా మానవుని అహంకారాన్ని పెంచి, అతణ్ణి ఆధ్యాత్మిక చింతన నుంచి దూరంచేసింది. గోల్డింగ్ నవల 'స్వేచ్ఛాపతనం" (1959) అధిభౌతిక ఆధ్యాత్మిక లోకాలమధ్య చిక్కుకొన్న ఒక ఆధునిక కళాకారుని తపనను వ్యక్తీకరిస్తుంది. ఆడమ్‌లాగే సామీమౌంట్‌జాయ్ స్వేచ్ఛాయుతదశలో తనకు అప్పటికి ప్రస్తుతమని అనిపించిన ప్రపంచాన్ని ఎన్నుకోవడంతో స్వేచ్ఛను కోల్పోతాడు. దాంతో తన పతనాన్ని తనే కోరుకున్నట్లయింది. ఆధునిక రోదసీ యాత్రికునిలా ఆధ్యాత్మిక అధి భౌతికలోకాలమధ్య నిస్సహాయస్థితిలో ఉంటాడు.

ఈ రెండింటికి సేతువు నిర్మించటం సాధ్యమా? ఆత్మను, దేహాన్ని, సమన్వయపరచి అతిలౌకికమైన వాస్తవికతని సాధించలేమా? ఈ ప్రశ్నలు ప్రశ్నలుగానే ఉండిపోతాయి "స్వేచ్ఛాపతనం" లో. వీటికి జవాబుసూచనప్రాయంగా గోల్డింగ్ తర్వాతి నవల "ది స్పైయిర్" లేదా" "గోపురశిఖరం" (1964)లో కనబడుతుంది.

వర్జిన్‌మేరీ చర్చికి జోసిలిన్ అనేవాడు డీన్. చర్చిమీద శిఖరాన్నికట్టడానికి తనను భగవంతు డుద్దేశించాడని జోసిలిన్ విశ్వాసము. ఈ ఆదేశం తనకొక దర్శనంలో లభించిందని అంటాడు. చర్చి ఇక

ఏమాత్రపు అదనపు బరువును మోయలేదని తోటివారు, మేస్త్రీ రోజర్ మేసన్ చెప్పినా వినక జోసిలిన్ యీ గోపురశిఖర నిర్మాణానికి పూనుకుంటాడు. అతడెన్నో అవాంతరాలను ఎదుర్కొన వలసివస్తుంది. ఒకకార్మికుడు పైనుంచి క్రిందపడి చనిపోతాడు. రోజర్ మేసన్ చర్చిలో పనిచేసే ఒకని భార్యతో సంబంధం పెంచుకుంటాడు. జోసిలిన్‌కి ఈవిషయం తెలిసికూడ ఊరుకుంటాడు. పైగా, ఆమెమీది మమకారం వల్ల రోజర్ ఇంకెక్కడికీ వెళ్ళడనీ, అదీ మంచిదేననీ సరిపెట్టుకుంటాడు. ఆమె గర్భిణి అయి, ప్రసవవేదనలో ప్రాణాలనుకోల్పోతుంది. నిజానికి ఆమె అంటే జోసిలిన్‌కుకూడ అవ్యక్తమైన అభిమానం. లేక, అది వ్యామోహమా? అన్న శంకకు కూడా అవకాశం లేకపోలేదు. అసలు అతడు నిర్మింపదలచిన శిఖరమన్నది అతని అజ్ఞాతమనస్సున సుప్తంగా నున్న కామోద్రేకానికి చిహ్నమా? అతని ప్రవృత్తి అతనికే అర్థం కాకుండా ఉంటుంది. ఒకసారి ఆ గోపుర శిఖరం దేవుని నౌకలా మరోసారి శిలగామారిన బైబిల్‌లా కన్పిస్తుంది. ఇంకొకసారి ఆ శిఖరమే లింగాకారంగా దర్శనమిస్తుంది. మరోసారి వెల్లకిల పరున్న మానవునిలా కనబడుతూ, అతనిలోని లైంగిక ప్రవృత్తికి ప్రతీకగా కనబడుతుంది. అదే మరోసారి సచేతనమైనట్లు ప్రార్థించే మానవునికి ప్రతిబింబంగా కనబడుతూ, పవిత్ర భావన కల్గిస్తుంది. దాని పునాదిఅంతా నీరసమైంది, బుడబుడలాడే బురదమీద అదినిర్మింపబడింది. అయినా అది నిలబడే ఉంది. అది రక్తం మీద, పాపం మీద నిర్మింపబడింది. అయినా అది నిలిచేఉంది. స్థూలంగా పరిశీలించగా ఆ శిఖరమన్నది మానవవైజ్ఞానికి, మానవుని సాహసానికి ప్రతీకగా కనబడుతుంది. "స్వేచ్ఛా పతనం"లో శామీ, ఆత్మకు దేహాన్ని ఏదైనా సేతువును నిర్మించగలమా? అని అనుకుంటాడు. జోసిలిన్‌కు చివరి ఘడియల్లో కల్గిన దర్శనం దానికి సమాధానంగా గోచరిస్తుంది. జోసిలిన్‌కు గోపుర శిఖరమొక ఆపిల్ చెట్టులా కనబడుతుంది మంచీ-చెడూ, వెలుగూ-చీకటీ, ఐహికము- ఆముష్మికము - ఇవన్నీ కలిసి ఉండేదే జీవితం చెడులేక మంచిలేదు. చీకటిలోనుంచే మానవుడు వెలుగులోకి వస్తాడు.

అసలు చీకటి ఎక్కడోలేదు. మానవునిలోనే అంతర్గతంగా అజ్ఞాతంగా దాగిఉంది, తానేదో మంచిని చేయబోతున్నాననీ, వెలుగును వ్యాపింప చేస్తున్నాననీ, అనుకునే క్షణంలోనే ఒక్కుమ్మడిగా అతనిని తిమిరం ఆక్రమిస్తుంది. "రైటస్ ఆఫ్ పాసేజి" లేదా "సంస్కార కాండ" (1980) అన్న గోల్డింగ్ నవలలో పాదిరి కోలీ అనుభవం ఇలాంటిదే. కథ ఒక ఓడలో జరుగుతుంది. నావికులకు ఏదో మంచిని చేద్దామనుకుని, భగవంతుని ప్రతినిధిగ అది తన ధర్మమని కోలీ వాళ్ళ దగ్గరకు వెడతాడు. కాని వాళ్ళతోకలిసి తాగుతాడు, జుగుప్సాకరంగా ప్రవర్తిస్తాడు. అతడొక నావికునితో లైంగికమైన దుర్వృత్తికి లోనైనట్టు నవల చివరలో వెల్లడి అవుతుంది. కోలీ ప్రవర్తన తనకే జుగుప్సాకరంగా, బీభత్సప్రాయంగా కనబడుతుంది. అతనికది శిరచ్ఛేదన ప్రాయంగా ఉంటుంది. తానున్నగదిలోనుంచి వెలుపలకు రాకుండా, నిద్రాహారాలు మాని ఐచ్ఛికంగా ప్రాణాలను విడుస్తాడు. ఆలోచించగా, కోలీ ఓడలో ఒకహద్దుగాగీసిన తెల్లగీతనుదాటి, మామూలు నావికులున్న చోటుకిపోయి వారితో తలపడడం అతనిలోని తిమిరంతో అతడు తలపడడానికి ప్రతీకగా భాసిస్తుంది. తనమనస్సులోని లోలోపలిపొరలలో ముఖాముఖిగా గోచరించినదేదో అతణ్ణి భయకంపితుణ్ణి చేస్తుంది. పర్యవసానంగా అతడు తీవ్రమైన నిరాశలో మరణేచ్ఛకులోనై ప్రాణాలు విడుస్తాడు. అతడు నావికులను కలుసుకునేముందు ఆధ్యాత్మికపరమైన అనుభూతిని పొందినవాడిలా కనబడతాడు. కాని అది అతనిలో అజ్ఞాతంగా ఉన్న తమస్సుకు మేలిముసుగు మాత్రమేనేమోనని అనిపిస్తుంది.

మరి మనిషికి ఈ చీకటి నుండి విముక్తి లేదా? గోల్డింగ్ దీనికి సమాధానం సూచిస్తాడు. అసలు మానవునికి తనంతటివాడు సృష్టిలో లేడన్న అహంకారం ఉన్నంత వరకూ అతని కెప్పుడో ఒకప్పుడు కోలీలాగ, జోసిలిన్‌లాగ, మార్టిన్‌లాగ ఓటమి పతనం తప్పవు. కానీ ఆ ఓటమిలోనే - ఆ పతనంలోనే - అతనికి కనువిప్పు కల్గుతుంది. మార్టిన్‌కాక తక్కినవారి అనుభవాలు పాపపంక క్షాళన సమర్థ మవుతాయి. వాళ్ళకు తమ స్వస్వరూపాన్ని ఎరుకపరుస్తాయి. మనలోని చీకటిని మనం చూడగల్గడమే వెలుగులోకి రావడం వంటిది. "తిమిర దర్శనం" "డార్క్‌నెస్ విసిబల్" లేదా(1979)అన్న గోల్డింగ్ నవలలో మాటీ అనే బాలుడు ఒక చిత్రమైన పాత్ర. ప్రపంచ యుద్ధంలో లండన్ మీద బాంబులు పడినప్పుడు, మంటల్లో చుక్కుకున్న ఈ బాలుడు ఎలాగో రక్షింపబడతాడు. ఒక వైపు కాలిపోవడం వల్ల అతని మొగమెంతో వికృతంగా ఉంటుంది. అందువల్ల తోటివాళ్ళచేత తిరస్కరింపబడతాడు. తన ఒంటరితనంలో తనను తాను పరీక్షచేసి కొన్నప్పుడు తనలోని చెడును గుర్తించగల్గుతాడు. క్రమేపి ఆధ్యాత్మిక చింతన, సాధనద్వారా ఆ చెడును జయించి, తానొక సత్కార్యానికై ఉద్దేశింప బడినట్లు తన అంతర్వాణి చెప్పిన మాటలు విశ్వసించి, ఆ క్షణం కోసం ఎదురుచూస్తుంటాడు. చివరకు ఒక అగ్నిప్రమాదంలో చిక్కుకొని ఉన్న బాలుని రక్షించి ప్రాణాలను విడుస్తాడు. ఒకానొక వ్యాసంలో గోల్డింగ్ మానవుడు దైవ కారుణ్యము పట్ల విశ్వాసాన్ని పెంచుకోవాలి అంటాడు. ఈ నవలలో మాటీ ద్వారా ఆ సత్యాన్ని నాటకీకరించడానికి ప్రయత్నించినట్లు కనబడుతుంది. మానవుడు వైజ్ఞానిక పరంగా మహోన్నత శిఖరాలను అధిరోహించాడు. కానీ తన శక్తిసామర్థ్యాలకు గల హద్దులను తెలిసికొని, ఆధ్యాత్మికంగా పురోగమించిననాడే అతనికి ముక్తి, మోక్షము లభిస్తాయి అన్నది గోల్డింగ్ అభిప్రాయంగా చెప్పవచ్చు.

ఇంతవరకు గోల్డింగ్ నవలను ఒక అర్థవంతమైన దృక్కోణంలో పరిశీలించడం జరిగింది. కాని ఇంతటితో సరిపోదు. గోల్డింగ్ చాలా సంక్లిష్టమైన రచయిత. ఆధునికాంగ్ల నవలా సాహిత్యంలో కథకి ప్రాముఖ్యం చాలా తక్కువ. కథాంశం రేఖాప్రాయంగా ఉంటుంది. గోల్డింగ్ విషయంలో కూడా అంతే. ఇతివృత్తము, పాత్ర చిత్రణలను ఆధారంగా చేసుకొని గ్రాహమ్‌గ్రీన్ వంటి నవలా కారుణ్ణి చర్చించవచ్చు. కానీ గోల్డింగ్ విషయంలో అటువంటి విశ్లేషణ ఫలితాన్నివ్వదు. పైన చెప్పబడిన గోల్డింగ్ ఇతివృత్తాలు అతని దృక్పథాన్ని, అతని దర్శన స్వభావాన్ని మాత్రమే సూచిస్తాయి. కానీ ప్రతి పాఠకుడు ఈ రచనలను పూర్తిగా అర్థం చేసుకొని, ఆనందించాలంటే గోల్డింగ్ రచనకు ఆర్జిన తీరును నిశితంగా పరిశీలించ వలసి ఉంటుంది. అతని భావ చిత్రాలు, రూపకాలు, ప్రతీకలు పౌరాణికత గల అతని రచనలకు గాఢత్వాన్ని, గాంభీర్యాన్ని చేకూరుస్తాయి. అతని రచనలన్నీ అతని జీవితానుభవంతో ప్రేష్ఠ దన్నుకొని ఉన్నాయి. కొన్నాళ్ళ బడి పంతులుగా గడిపిన అనుభవము "మక్షికాధీశ్వరుడు" నవలద్వారా బాలుర మనస్తత్వాన్ని వాస్తవికంగా చిత్రీకరించేందుకు తోడ్పడింది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో నౌకాదళంలో లెఫ్టినెంట్‌గా అతడు చూసిన ఘోరకృత్యాలు, అమానుషచర్యలు మానవునిలో నున్న పాశవిక ప్రవృత్తి, బుద్ధి జాడ్యము, వక్రచిత్తము – వీటిని అన్వేషించేందుకు గోల్డింగ్‌ని ప్రేరేపించాయి. (క్రయిస్తవుల) తొలిపాపాన్ని గోల్డింగ్ విశ్వసిస్తాడు. మానవుడు పోగొట్టుకొన్న అమాయకత్వం స్వర్గచ్యుతి, నేరము, పాపము అన్నవి తన నవలకు పౌరాణికమైన భూమికగా పెట్టుకొని మానవుడు అనుభవించే ఆందోళనలను, ఉద్విగ్నతను, నిర్విరామంగా శోధించడమే గోల్డింగ్ ధ్యేయం. అందుకే అతని రచనలు మన యుగానికి ప్రస్తుతమై ఉండడమేకాక, విశ్వజనీనమైన ప్రయోజనాన్ని కూడ సాధించాయి.

# తడి అడుగులు

## శ్రీ ఏ. పి. చందన్ రావ్

చినుకులు
నేల రాలి
ముక్కలు ముక్కలై చిట్లి
చిత్రాలు కట్టడం !

గొంతులో పడిన
ఫలరసం
ఒంట్లో
రక్తం కావడం !

కిటికీలకు పూసిన
కొత్తరంగు
కళ్ళలో జారి
సాయంత్రాలై పరిమళించడం !

మట్టికీ విత్తనానికీ
సఖ్యం చేస్తూ
నీరు
తానింకి పోతూ
కొత్త మొలకను పైకెత్తడం !!

ఈ కన్నుల
పొడి నిద్రలో
సడిలేని పాదాల
తడి ముద్రల
దృశ్య సాదృశ్యాలెన్నో




ప్లాట్‌ఫామ్ కిటకిటలాడిపోతోంది - కాలుతున్న కడుపు కుతకుత లాడుతున్నట్లు. కేకలేస్తూ అటూ ఇటూ పరుగులుతీస్తున్న జనం- కడుపులో ఎలుకలు పరుగెడుతున్నట్టు

ఎవరికివారే ఈ మహానగరంలో!

ఎవరి గోడు వారిది ఎవర్నీ ఎవరూ పట్టించుకోరు. ఎందుకో అసలు మనుష్యుల్లా ప్రవర్తించరు ఉదయాన్నే కీ ఇస్తే రాత్రి పడు కొనేదాక ఆడే ఆటబొమ్మల్లా బ్రతుకుతూ ఉంటారు!

మోస్ట్ మెకానికల్ లైఫ్. ఈ చెయిన్‌లో ఎక్కడ కనిపిస్తాయి ఆదరణ, ఆప్యాయత, అభిమానమూను!

కాలంలో ఎంత మార్పు! మనిషిని మనిషిగా గుర్తించే రోజుల కూడ పోయాయి! అసలు మనిషిని మనిషి నమ్మడం లేదు కారణాల ఏమైతేనేం మానవత్వం అనే మాట నిఘంటువుల్లో మాత్రమే నిల్చు కొని ఉంది!

ఎంతసేపూ డబ్బు! డబ్బు! డబ్బు!

డబ్బే దైవమైపోయింది ఆ డబ్బుతో చదువును కొంటారు ఆ డబ్బుతో ఉద్యోగాన్ని కొంటారు అ డబ్బుకోసం వ్యక్తిత్వాన్ని "అమ్ముకొంటారు" (అందమైన భాషలో సంప్రదాయవాదినని చెప్పు కొంటూ కట్నమని, కానుకని, లాంఛనమని, ఏదో ముచ్చటని మొ

నికి డబ్బును లాగుతూ ఉంటాడు (ప్రతి మనిషీ! ఎక్కడో అసలు సిసలు మనిషి!)

ఆ డబ్బుకోసం మరో మనిషి ప్రాణంతో, ప్రాణంలాంటి మానంతో సయితం ఆటలాడుకొంటూ ఉంటారు.

వాట్యెకర్స్! నాట్ టు ది ఇండివిడ్యుయల్, బట్ టు ది నేషన్ ఇట్‌సెల్ఫ్!

దీనికి తగినట్లు పాపులేషన్ ఎక్స్‌ప్లోషన్!

అర్థంకాని టెన్షన్!

ఉద్యోగాలు దొరకక్క, తిండి దొరకక్క, చివరికి నిలబడేందుకు రెండడుగుల స్థలంకూడ దొరకక్క, అంగలారుస్తున్న ఎందరో పౌరులు - అట్లు ఉడికినట్లు ఉడికిపోతున్నారు

ఏ విప్లవాలు వస్తాయోనని భయం!

అయినా నెత్తి మీద హిమాలయపర్వతమంత జడత్వం, ఒంట్లో మూడు సముద్రాలంత సహనం పుణికిపుచ్చుకొన్న భారతీయుడు అంత త్వరగా ఎదురుతిరుగుతాడా అని చాలమందికి సందేహం! అది కొంత వరకు నిజం కూడ!!

ఆకలి! ఆకలి! ఆకలి!

దీన్ని భరించడం నావల్లకాదు, చనిపోవాలనిపిస్తుంది

ఎన్నిసార్లని మునిసిపల్ పంపునీళ్ళు త్రాగను, నిజంగానే చనిపోతాను [అ నీట్లో చేపలు, నీటిపాములు అధాటుగా తనిఖీకి వస్తుంటాయి, మస్కిటో లార్వేగురించి వేరే సర్వే జరిపించనక్కరలేదు!]

ఓ భారతదేశమా! నన్నెందుకు కన్నావ్!

పాపం! అదేం చేస్తుంది నన్ను కన్నది అది కాదుకదా! అసలు, అసలు ఎవర్ననీ ఏం లాభం! నా కర్మ, నా శ్రాద్ధం, నా పిండాకూడు ... ... ...

"బాబూ!" అన్న సుపరిచితమైన పిలుపు.

అమృతధార కురిపిస్తున్న కంఠధ్వని, సందేహంలేదు రాధాకృష్ణగారే! మా మాష్టారు!

"ఏంటి! ఇక్కడున్నావ్! ఊరికెళ్తున్నావా లేకమీవారెవరైనా వస్తున్నారా?" - అదే స్టయిల్ కళ్ళజోడు సర్దుకొని, కండువా సరిచేసుకొని

ఏం చెప్పను! ఆకలికి తట్టుకోలేక ఇటుగా వచ్చానని చెప్పనా?

"ఏంచేస్తున్నావ్ బాబూ? ఇప్పుడ్నివ్వు!" సూట్‌కేస్ దగ్గరగా జరుపుకొంటూ అడిగారు.

"యమ్మే అయిపోయిందండి, టయిప్ రైటింగు హైయ్యర యింది, షార్ట్‌హ్యాండ్, లోయరైంది పాపులేషన్ స్టడీస్‌లో, ఎడల్టు ఎడ్యుకేషన్‌లో డిప్లొమాలున్నాయి అయినా ... అయినా ఉద్యోగం రాలేదు మాష్టారు! వస్తుందన్న ఆశకూడలేదు సార్" - ఎంత వద్దనుకొన్నా దుఃఖం వచ్చేసింది

బ్రాహ్మణుని వృత్తి భిక్షాటనేనా?

ఆయన నవ్వాడు

"చూడు బాబు! గుండె ధైర్యం, ఆత్మబలం చాలముఖ్యం సహనమనేది ఉంది చూచావు అది అత్యంత ముఖ్యం ఈ మూడు నీ సొంతం చేసుకున్నావో దైవానుగ్రహం తప్పకుండా నీకు కలుగుతుంది. అధైర్యపడక ధీటుగా సాగిపో ధైర్యంగా తలెత్తు. పదిమందిలో గర్వంగా నిలబడు" - వెన్నుతట్టి సినిమా డైలాగులు చెప్పాడా మాష్టారు!

"ఆకలై చచ్చిపోతూ ఉంటే గుండె, ఆత్మ, దేవుడు నాన్‌సెన్స్! కాలేకడుపుకు పిడికెడు కూడు కావాలి! అది ముఖ్యం. మిగతాదంతా పైత్యం" - బయటికి అనే ఓపిక లేక నాలో నేనే అనుకొన్నాను

"ఏంటి బాబూ! డల్‌గా ఉన్నావు ఒంట్లో బాగుండలేదా?" మాష్టారి పరామర్శ

"బాగానే ఉంది, ఏదో తలనొప్పి అంతే!" - అసహనం

"కాఫీ త్రాగొద్దాం దా!" -మాష్టారు బలవంతంగా క్యాంటీన్‌కు పిలుచుకొని వెళ్ళారు రెండు నెస్ కాఫీలకు ఆర్డరిచ్చారు. కాఫీ త్రాగుతున్నాను కాని ఎలా త్రాగుతున్నానో నాకే తెలియడం లేదు ఒళ్ళంతా తూలిపోతోంది.

బిల్ ఇచ్చేటప్పుడు మాష్టారి పర్సువంక చూచాను. కట్ట జిగేలు మన్నాయి అన్నీ వందరూపాయలనోట్లే.

మత్తు వదిలినట్లైంది

ఆకలి! ఆకలి! డబ్బు కావాలి! డబ్బు కావాలి!

అంతా అస్తవ్యస్తంగా ఉంది

ట్రయిన్ కదలడానికి సిద్ధంగా ఉంది. మాష్టార్ని సీట్ దగ్గరికి పిల్చుకొని వెళ్ళాను

"నీకేమీ బెంగపెట్టుకోవద్దు. ఉద్యోగం తప్పకుండా వస్తుంది సరేనా !" – నాకు ధైర్యం చెప్పారు

ఇక చాలన్నట్లు నాలోని ఇంజన్ కేకేసింది.

ట్రెయిన్ బయలు దేరింది. "వస్తానండీ మాష్టారూ !"– అంటూ టాటా చెప్పాను.

రైలు వెళ్ళిపోయింది స్టేషన్ బైటపడ్డాను ఉరకల పరుగుల మీద న్యూ కృష్ణా కేఫ్‌లోకి దూరాను ఫుల్ మీల్స్ విత్ కర్డ్ కడుపు నిండా తిని మాష్టారుగారి పర్స్ తీసి బిల్ పే చేసి కిళ్లీ నములు కొంటూ పార్క్‌వైపుకు నడిచాను

పర్సులో ఎంతుందో లెక్క పెట్టాను కచ్చితంగా ఏడొందలా ఇరవై ఆరురూపాయల పదిహేను పైసలు

ఆనందంతో మనసు గంతులేసింది

అసహ్యంతో అంతరాత్మ ఎదురు తిరిగింది

నోరు నొక్కబోయాను లాభం లేకపోయింది.

"మాష్టారి పర్సు కొట్టేస్తావా ? సిగ్గు లేదూ !"

ఆకలి ! ఏం చేయను

నీకు చదువు చెప్పాడే !" –

నిజమే ! మరి ఆకలి ! ! డబ్బుకావాలి ! !

"ప్రపంచంలో ప్రతి ఒక్కడికీ ఆకలుంది వాళ్లూ నీలాగే దొంగతనం చేస్తున్నారా ?" –

మరి నాకు ఉద్యోగంలేదు.

"అందరికీ ఉద్యోగాలు దొరుకుతున్నాయా ?"–

వారికి డబ్బులుండవచ్చు

"డబ్బు ఎంతమందికుంది! ? అద్దో ! ఆ బిక్కచిక్కిన వృద్ధుడివద్ద డబ్బుందా ?" –

లేకేం ఉంటుంది

"సరే ! ఆ రిక్షావాని దగ్గర !"

ఏమో ! నాకు తెలీదు

"ఆ వృద్ధుడు చదువురాని వాళ్ళకు జాబులు రాసి పెడు తున్నాడు ఈ రిక్షావాడు కష్టపడి సంపాదిస్తున్నాడు. కట్టెలు కొట్టే వాడు, మూటలు మోసేవాడు,బూట్ పాలిష్ చేసేవాడు, పాలసీసాలు పంచేవాడు, పేపర్ వేసేవాడు, ఇస్త్రీ చేసేవాడు – వీరందరూ ఎలా? ఎలా బ్రతుకుతున్నారు ? మాట్లాడవేం ?" –

...... ...

"నీవు చదువు కొన్నావు ఉద్యోగం రాలేదు. పోతేపోనీ క పడలేవూ ? చెమటోడ్చి సంపాదించలేవూ ? " –

... ......

"సత్యహరిశ్చంద్రుని కథ చదివావా ? శ్రీరామచంద్రుని క విన్నావా ? మహాత్మాగాంధీ తెలుసా ? కార్ల్ మార్క్స్ తెలుసా?

తెలుసు వాళ్ళేకాదు సుభాష్ చంద్రబోస్ తెలుసు భగత్‌సిం తెలుసు అల్లూరి సీతారామరాజు తెలుసు అజాద్ చంద్రశేఖర్ కూ తెలుసు

"తెలిస్తే ఈ పనెందుకు చేసావ్ ?" –

వాళ్లకీ ఆకలై ఉంటే, అన్నం లేకుండా మాడిఉంటే ...

"షటప్ ! వాళ్లు ఆకలిని జయించిన వాళ్లురా ! వాళ్ళను కిం పరుస్తావా ? అష్టరాల్ ! ఆకలిని చంపుకోలేని వాడివి నిన్ను నీవే చంపుకొంటావ్ ? ఆకలి ప్రపంచమంతా ఉంది అందుకని ప్రప చాన్నే దగా చేస్తావా ? నో. యూ మస్ట్‌నాట్ డూ యిట్ !"

మరి బ్రతకడమెలా ?

"మంచి ఉద్యోగం దొరికే వరకు కాయకష్టం చెయ్ నీ కడు నీవు నింపుకో అంతే కాని ఇలా నీచంగా మాత్రం బ్రతుక్కు. దేశ పరువుని మంట గలపకు"

.........ఆ పర్సులో అడ్రసుంది నీవు ఖర్చు పెట్టి మొత్తం కలిపి ...ఎలా అంటావా ? రిక్షా త్రొక్కు, మూటలెత్తు · ఎలాగైనాసరే మాష్టర్‌గారికి పంపించెయ్. క్షమాపణఅడుగు" –

... ... ... ...

"మాట్లాడవేం?"

... ... ... ...

"ఎందుకని మాట్లాడవు?"

సిగ్గుగా ఉంది.

"వెధవపని చేసినప్పుడు సిగ్గులేదుకాని, చేసిన తప్పును తెలుసు కొని, మళ్ళీ చేయకూడదని నిర్ణయించుకొనేటప్పుడు సిగ్గువేస్తోందా?"

... ... ... ...

"నే చెప్పినట్లు చేస్తావా ? చెయ్యవా ?"

... ... ... ...

"నీకు చదువు చెప్పిన మాష్టర్రా" –

... ... ... ...

"నీకు తానాజీని గురించి, శివాజీని గురించి, బ్రిటిష్‌సామ్రాజ్య ంశను గురించి, క్విట్ ఇండియా ఉద్యమాన్ని గురించి, డార్విన దాన్ని గురించి, రజుల్ గణితాన్ని గురించి, పికాసో కళ గురించి ్యాగో రచనలను గురించి తెలియచెప్పిన మాష్టర్రా!"

కాని ... కాని ... ఆకలి గురించి చెప్పలేదే ? డబ్బు అవస న్ని గురించి నోరు విప్పలేదే !

"పిచ్చివాడా ! ఆకలి, దప్పిక, కామం అనేవి ఒకరు నేర్పేవి దురా ! ప్రకృతే నీకు నేర్పుతుంది. వీటిని ధర్మానికి భంగం కలుగ ండా అనుభవించాలి. ఇక డబ్బు విలువ అంటావా? అది నీకుగా నీవే తెలుసుకోవాలి అంతేకాని వేటికి లొంగిపోయి పశువులు కారాదు. చెప్పు నీవు పశువ్వా ? " – ఊహుం ! కాదు ! కానేకాదు !

"అయితే చెప్పు ! నే చెప్పింది చేస్తావా ? చెయ్యవా ? "

చేస్తాను !

వారం రోజుల తరువాత మాష్టారు ఉత్తరం రాశారు

"బాబూ ! నీవు పర్సుతీసావని నా కప్పుడే తెలుసు. ఆకలి బాధ ఎలాంటిదో ఇంకా బాగా తెలుసు. అయితే ఆకలికన్నా అభి మానం ముఖ్యమని నీకు తెలియాలనే ఊరుకొన్నాను. నీ ధర్మం నిన్ను రక్షిస్తుంది ప్రస్తుతానికింతే ! " – అని వుంది అందులో

# ప్రబంధాలు

## శ్రీ వజ్ఝల కాళిదాసు

సంకల్పం సంఘర్షణ
మ్మేళనం సృష్టి రహస్యాలు !

ద్యుత్తరంగాలు విశృంఖలంగా
జృంభించి ఘర్షణ పడితే
లువడుతుంది
లుగులు చిమ్మే మెరుపూ
వలం క్రక్కే
శనిపాతము !

న్న చిన్న చినుకుల సమ్మేళనమే
రు వాకలుగా సెలయేరులుగా
ప్రవాహములుగా మహానదులుగా
పరుగులు వారును
పయోధి జేరును !!

ఒక ఎదలో ఒదిగి ఒదిగి
మదిలో నెమ్మదిగా ఎదిగి ఎదిగి
మెదిలి మెదిలి కదను త్రొక్కుతూ
విజయోత్సాహంతో
వెడలే సంకల్పంలో
ప్రభవిస్తాయి
పదబంధాలు ప్రబంధాలు !!!

# భారత దేశంలో సంకీర్ణ ప్రభుత్వాలు

రాజకీయ సంస్కృతికి గట్టి పునాదులు లేని సమాజంలో పార్లమెంటరీ ప్రజాస్వామిక ప్రభుత్వం సిద్ధంగా ఉండటం కష్టం. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక అసమానతలు ఎక్కువగా ఉన్న దేశంయొక్క ప్రభుత్వపు అస్థిరత్వం పార్లమెంటరీ ప్రజాస్వామ్య విలువలపై ప్రజల్లో విశ్వాసరాహిత్యానికి దారి తీసే ప్రమాదం ఉంది ప్రభుత్వ అస్థిరత్వానికి ఒక ముఖ్య కారణం మిశ్రమ లేక సంకీర్ణ మంత్రివర్గాలు పార్లమెంటరీ వ్యవస్థ అమలులో ఉన్న దేశాల్లో మంత్రివర్గాలే ప్రధాన కార్యనిర్వాహకులు గాన, మంత్రివర్గాల నడవడిమీద జాతీయ లక్ష్యాల సాధన ఆధారపడి ఉంటుంది మంత్రివర్గాల నిర్మాణం, నడవడి కార్యసాధకంగా ఉంటే జాతీయాంగీకృత లక్ష్యాల సాధన సులువు అవుతుంది మంత్రివర్గ నిర్మాణంలో, నడవడిలో అస్థిరత్వం, అయోమయం, అస్పష్టత గందరగోళంఏర్పడితే, దేశమంతటా సమన్వయదృష్టి, నిర్ణయాత్మకదృక్పథం ఆదర్శభావం లోపిస్తాయి.

భిన్న అభివృద్ధి స్థాయిలు, పాలనా పద్ధతులు రాజకీయ అనుభవాలు గల సమాఖ్య రాజ్యాల్లో, ఒకే రాజకీయ పార్టీ కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ ఎక్కువ కాలం అధికారంలో ఉండటం కొన్ని విచిత్ర పరిస్థితులకు దారితీయవచ్చు ప్రజల్లో అధిక సంఖ్యాకులు అంగీకరించిన రాజకీయ, సాంఘిక, ఆర్థిక లక్ష్యాలను ఆచరించటంలో పాలక పార్టీ విఫలమైతే, ఆ వైఫల్యం ప్రతిపక్షాలకు బలాన్ని చేకూర్చవచ్చు. పాలక పక్షాన్ని అధికారంలోనుంచి దించి తాము ఆ స్థానంలోకి రావాలని ప్రయత్నించటం ఇతర పార్టీలకు అసహజం కాజాలదు. ప్రతిపక్షాలకు ఒక్కొక్కటే ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసే బలం లేనప్పుడు రెండు లేక అంతకంటె ఎక్కువ పార్టీలు కలిసి సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పరచటానికి అవకాశం ఏర్పడుతుంది ఈ పరిస్థితి మన దేశంలో కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ కొన్నిసార్లు ఏర్పడింది సంకీర్ణ రాజకీయాలు, ప్రభుత్వాలు దేశ రాజకీయ వ్యవస్థ పరిణామంలో అంతర్భాగంగా అయింది

## సంకీర్ణ రాజకీయాల ప్రారంభం :

మన దేశానికి సంకీర్ణ రాజకీయాలు కొత్త కాదు. స్వాతంత్ర్యానికి పూర్వం స్వాతంత్ర్య సాధనోద్యమానికి నాయకత్వం వహించిన కాంగ్రెస్ పార్టీ ఒక రకంగా సంకీర్ణ రాజకీయాలకు ప్రతిబింబ విభిన్న అభిప్రాయాలు, మనస్తత్వాలుగల సభ్యులెందరో కాంగ్రెస్ స్వాతంత్ర్యం వచ్చేవరకూ కలసికట్టుగా పనిచేసారు కాంగ్రెస్‌పార్టీ నిర్ణయీకరణ విభిన్న గ్రూపులు, ముఠాలమధ్య రాజీ ఆధారం జరిగేది అంటే కాంగ్రెస్ పార్టీ ఉద్యమం ఒక రకంగా సంకీర్ణరాజ యోద్యమం స్వాతంత్ర్యం తరువాత స్వరాజ్యోద్యమానికి నా కత్వం వహించిన కాంగ్రెస్ పార్టీ కేంద్రంలోనూ, రాష్ట్రాలలోన పాలక పక్షంగా మారింది అధికార పక్షంగా మారిన తర్వాతమా విభిన్న దృక్పథాలు, ఆశయాలు, ప్రవర్తనాధోరణులు గల వ్యక్తుల గ్రూపులు కాంగ్రెస్‌లో కొనసాగారు సంకీర్ణ వ్యవస్థగా ఉండట కాంగ్రెస్ పార్టీకి బలం, ప్రత్యేకత విభిన్న గ్రూపుల మధ్య రా ఆధారంగా ఎక్కువ కాలం పార్టీ కొనసాగలేక మధ్య మధ్య చీలిక ఏర్పడ్డాయి స్వాతంత్ర్యం తరువాత కాంగ్రెస్ సోషలిస్టులుగా ఉన్న వారు కాంగ్రెసును విడిచి సోషలిస్టు పార్టీని స్థాపించారు కాంగ్రె పార్టీలోకూడా అంతర్గత వైరుధ్యాలు, వైషమ్యాలు పెరిగి దేశప్రగ సాధనకు కావలసిన కొత్త కొత్త పథకాలను రూపొందించి నిర్వహిం లేకపోవటం ప్రారంభమయింది కాంగ్రెస్‌లో ప్రగతిశీలక శక్తు ప్రతాపశక్తుల మధ్య ఘర్షణ ప్రారంభమయింది ఈ పరిస్థితి ప్రజల్ల కాంగ్రెస్ వ్యతిరేకతాభావాన్ని పెంపొందించి క్రమేపీ గట్టిపడిన కాంగ్రె వ్యతిరేకతాభావం కాంగ్రెసేతర పార్టీలకు బలాన్ని చేకూర్చి 196 సాధారణ ఎన్నికల తరువాత పెక్కురాష్ట్రాల్లో కాంగ్రెసేతర ప్రభ త్వాలు, సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పడటానికి దోహదంచేసింది. పైగా రా మనోహర్‌లోహియా ప్రచారంచేసిన "కాంగ్రెసేతర సిద్ధాంతం" ప్రతి పక్షాలు సంకీర్ణ ప్రభుత్వాలను ఏర్పాటు చేయటానికి దోహదంచేసింది

## 1967 తర్వాత

1967 తర్వాత మొత్తం రాష్ట్ర శాసన సభల స్థానాల కాంగ్రెస్ పార్టీ సగం కూడా సంపాదించుకోలేకపోయింది 344 స్థానాల్లో 1694 స్థానాలనుమాత్రం గెలుచుకొంది ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్, బెంగాల్, ఒరిస్సా, మద్రాస్, కేరళ, పంజాబ రాష్ట్రాల్లో కాంగ్రెస్ మెజారిటీ కోల్పోయింది 7 రాష్ట్రాల్లో కాంగ్రెసే

తర సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి కాంగ్రెసేతర పార్టీలు సమైక్యంగా లేక చీలి ఉండటంవల్ల విస్తరిత అంతర్ పార్టీ సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి మద్రాసు రాష్ట్రంలో ఏక పార్టీ ప్రభుత్వం, ఒరిస్సాలో ద్విపార్టీ ప్రభుత్వం ఏర్పడ్డాయి 1967 ఎన్నికల తరువాత ఏర్పడ్డ సంకీర్ణ ప్రభుత్వాల రూపం, తరువాత ఆ రూపం ఎలా మారింది పట్టిక-1 లో వర్ణించటం జరిగింది. సంకీర్ణ ప్రభుత్వాల స్థిరత్వం పట్టిక-2 లో చూపబడింది.

## సంకీర్ణ ప్రభుత్వాల స్వరూపం

సంకీర్ణ ప్రభుత్వాల స్వరూపాన్ని సూత్ర సిద్ధాంత పరంగా విశ్లేషించటం కష్టం సంకీర్ణ ప్రభుత్వాలు నిర్దుష్టసూత్రాలమీద ఏర్పడక పోవటం దానికి కారణం స్థూలంగా సంకీర్ణ ప్రభుత్వాలను రెండు ప్రధాన అంశాల ఆధారంగా వర్గీకరించవచ్చు మొదటి అంశం - సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిన పార్టీల సంఖ్య రెండవ అంశం- సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటుకు ప్రాతిపదిక ఎప్పుడు ఏర్పడింది; ఎన్నికలకు ముందా, తర్వాతా, అంటే పార్టీల మధ్య పొత్తు ఎన్నికలకు పూర్వమా లేక తర్వాతనా, ఒరిస్సాలో దాదాపు నాలుగు సంవత్సరాల పాటు కొనసాగిన సంకీర్ణ ప్రభుత్వం స్వతంత్ర పార్టీ, జన కాంగ్రెస్‌ల కలయిక ఈ కలయిక ఎన్నికలకు పూర్వం జరిగిందే పశ్చిమ బెంగాల్‌లో ఏర్పడ్డ సంకీర్ణ ప్రభుత్వం 14 పార్టీల కలయిక ఇది ఎన్నికల తరువాత కలయిక

రాజనీతి శాస్త్రజ్ఞులు కొందరు సంకీర్ణ ప్రభుత్వాల స్వరూపాలను కొన్ని ఉప అంశాల ఆధారంగా వర్గీకరించారు ఒక ఉప అంశం ఏ రకమయిన సంకీర్ణ ప్రభుత్వాల ఏర్పాటుకు దారి తీస్తుందో వర్ణించారు సంకీర్ణ ప్రభుత్వాలన్నీ పార్టీల కలయికలే గాన, ప్రభుత్వాల వర్గీకరణకు పార్టీ ప్రధాన అంశం (కీ వేరియబ్‌ల్) ఈ ప్రధాన అంశంతోపాటు తత్సంబంధమయిన కొన్ని ఉప అంశాలుంటాయి. ఉప అంశాలలో ఒక్కొక్కటిగాని సంకీర్ణ ప్రభుత్వాలకి ఆధారంగా ఉంటాయి పట్టిక-3 లో కొన్ని ఉప అంశాలు వాటి ఆధారిత సంకీర్ణ ప్రభుత్వ రకాలు వివరించబడ్డాయి పట్టిక-3 లోని వర్గీకరణ ఒకే ఒక ఉప అంశం ఆధారిత వర్గీకరణ (సింగిల్ సబ్-వెరియబ్‌ల్ బేస్‌డ్ క్లాసిఫికేషన్) మాత్రమే ఎక్కువ ఉప అంశాల కలయికతో మంచి వర్గీకరణను రూపొందించవచ్చు పట్టిక-3 లోని వర్గీకరణ ఆచరణ ఆధారంగా చేసిన వర్గీకరణేగాని, శాస్త్రీయంగా రూపొందించిన వర్గీకరణకాదు సంకీర్ణ ప్రభుత్వాల రూపం స్పష్టంగా లేనందున శాస్త్రీయమైన, ఖచ్చితమైన వర్గీకరణ కష్టం

## సంకీర్ణ ప్రభుత్వాల పనితీరు

సంకీర్ణ ప్రభుత్వాలు భాగస్వామ్య పార్టీలు ఆమోదించిన కనిష్ఠ కార్యక్రమం మీద పని చేశాయి పశ్చిమ బెంగాల్ మంత్రి వర్గానికి 10 అంశాల కార్యక్రమం, ఒరిస్సా మంత్రి వర్గానికి 21 అంశాల కార్యక్రమం, ఉత్తర ప్రదేశ్ మంత్రి వర్గానికి 29 అంశాల కార్యక్రమం లక్ష్యాలుగా ఉండేవి సంకీర్ణ ప్రభుత్వాలు మామూలు మంత్రివర్గాలు (అంటే ఒకే పార్టీ ప్రభుత్వం) పనిచేసే విధంగా పనిచేసేవి కావు. బెంగాల్, బీహార్, ఉత్తరప్రదేశ్, కేరళ రాష్ట్రాల్లో మంత్రివర్గాల నిర్ణయాల్లు రెండు దశల్లో జరిగాయి మొదటి దశల్లో సంకీర్ణ మంత్రి మండలి భాగస్వామ్య పార్టీల ప్రతినిధులతో కూడిన సమన్వయ సంఘంలో విషయాలు చర్చించబడి అందరికీ ఆమోదయోగ్యమైన నిర్ణయాలు తీసుకోబడేవి రెండవ దశలో సమన్వయ సంఘంలో తీసుకొన్న నిర్ణయాలను మంత్రివర్గం లాంఛన ప్రాయంగా అంగీకరించేది. సమన్వయ సంఘం ప్రధాన విధాన నిర్ణయ సంస్థగా పనిచేసేది పెక్కుసార్లు సమన్వయ సంఘాల్లో చర్చలు సాఫీగా జరిగేవి కావు తరచు పరస్పర వ్యతిరేకాభిప్రాయాలు వ్యక్తమై అందరికీ ఆమోదయోగ్యమైన నిర్ణయాలు తీసుకోబడటం కష్టమయ్యేది పరస్పర నిందారోపణలతో కాలం గడిచేది పశ్చిమ బెంగాల్‌లో భూముల పంపిణీ, శాంతి భద్రతల రక్షణ, పోలీసు పాత్ర మీద తీవ్రమయిన విభేదాలు సమన్వయ సంఘం చర్చల్లో పొడసూపి ఆటుతర్వాత అవి మంత్రివర్గం సమావేశాల్లో ప్రతిబింబించేయి పార్టీల మధ్య అంతర్గత విభేదాలు, వైరుధ్యాలు ఒక్కసారి తీవ్రతరమై మంత్రివర్గ విచ్ఛిన్నతకు దారితీసాయి

ఒరిస్సాలో మంత్రి వర్గాల పనితీరు వేరొక రకంగా ఉండేది. మంత్రివర్గ సమావేశాలకు ముందే ఇష్టాగోష్టులలో మంత్రివర్గ సమావేశాలలో తీసుకోబోయే నిర్ణయాలను మంత్రివర్గ సభ్యులు ముందే చర్చించేవారు. ఇక్కడ అంగీకరించబడ్డ విషయాలు మంత్రివర్గ సమావేశంలో లాంఛన ప్రాయంగా ఆమోదించబడేవి ఒరిస్సాలోని సంకీర్ణ మంత్రివర్గం రెండు పార్టీల కలయిక కావటంవల్ల నిర్ణయీకరణ బహు పార్టీల కలయికలలోకన్న సులువైనది

## కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వం

కేంద్రంలో మొదటిసారిగా 1977లో ఆరవ లోక్‌సభ ఎన్నికల తరువాత ఏర్పడిన జనతా ప్రభుత్వం పరోక్ష సంకీర్ణ మంత్రివర్గమే సంస్థాకాంగ్రెస్, భారతీయ లోక్‌దళ్, జనసంఘ్, సోషలిస్టు పార్టీలు, స్వతంత్రులయిన కాంగ్రెస్ వాదులు, మరికొందరు చర్చలు, సంప్రదింపుల ద్వారా సాధించిన ఏకాభిప్రాయ ప్రాతిపదికగా జనతా పార్టీ ఏర్పడింది ఆ తరువాత ప్రజాస్వామ్య కాంగ్రెస్ జనతాలో చేరింది.

కొత్త పార్టీలో విలీనమయిన ప్రతి భాగస్వామ్య పార్టీ తన సొంత విధానాలలో కొన్నింటిని వదులుకొని కొన్ని కొత్త విధానాలను స్వీకరించింది. బహుపార్టీల కలయికతో ఏర్పడిన జనతా ప్రభుత్వం 28 మాసాల కన్నా ఎక్కువ కాలం అధికారాన్ని చెలాయించలేకపోయింది. భాగస్వాముల మధ్య విభేదాలు, కలహాలు తలెత్తాయి. భాగస్వామ్య పక్షాలు అధికార కాంక్షతోను, రాజకీయ అసహనవాదంతోను వ్యవహరించాయి. జనతా పార్టీ అనుభవాల్ని జనతా ప్రభుత్వంలో పరిశ్రమల శాఖ మంత్రిగా పనిచేసిన జార్జి ఫెర్నాండెజ్ ఒక చోట చక్కగా ఇలా వర్ణించారు. "సైద్ధాంతికంగా పరస్పర విరుద్ధమైన గ్రూపులు ఉండటం వల్ల సంఘటితంగా ఉండలేకపోయాం... 1977 మార్చి నాటి విలువలకూ, వాతావరణానికి తగినట్టుగా జనతా వ్యవహరించలేదు. ఎన్నికల ప్రణాళికలోను, విధానాలకు సంబంధించిన ఇతర తీర్మానాలలోను ప్రకటించిన సాంఘిక, ఆర్థిక కార్యక్రమాన్ని అమలు పరచలేదు ... ప్రజలకు ఇచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చుకోవడానికి అకుంఠిత దీక్షతో పనిచేయవలసిన పార్టీ, ప్రభుత్వం దేశ సమస్యలకు సంబంధంలేని సంక్షోభాలని తెచ్చిపెట్టుకుంది..." జనతా పార్టీ చీలిక తర్వాత సెక్యులర్ జనతా పార్టీ ఏర్పరచిన సంకీర్ణ ప్రభుత్వం 24 రోజులకన్నా ఎక్కువ మనలేదు. భాగస్వాములమధ్య విభేదాలు, కలహాలు అనుకొన్నంత కంటేముందుగానే తలెత్తడంవల్ల సెక్యులర్ జనతా ప్రభుత్వం అతి స్వల్పకాలంలో పయనమయినది.

కేంద్రంలోను, రాష్ట్రాలలోను ఏర్పడి కొంతకాలం కొనసాగిన సంకీర్ణ ప్రభుత్వాలు కొన్ని గుణపాఠాలు నేర్పుతున్నాయి. సంకీర్ణ ప్రభుత్వాల వలన ప్రభుత్వం నడవడిలో పొంతనారాహిత్యం, విధానాల్లో స్పష్టతారాహిత్యం ఎంతగా ఉంటుందో తెలుసుకోగలిగాం. ఏక పార్టీ ఆధిక్య వ్యవస్థ స్థానే బహు పార్టీ వ్యవస్థ ఏర్పడితే రాగల మార్పులను ఊహించడానికి కొంత అవకాశం కల్గుతుంది. దేశ రాజకీయ పరిమాణంలో సంభవించే పరిస్థితుల స్వభావాన్ని అంచనా వేయటానికి వీలవుతుంది. దేశంలో ఏకలక్ష్యాలు, సమాన ఆదర్శాలు గల రాజకీయ వర్గాలు భాగస్వామ్య ప్రాతిపదికపై పునరైక్యమయినప్పుడు సంకీర్ణ ప్రభుత్వాల పనితీరు ఫలితాలు ఇప్పటికంటె మెరుగు కావచ్చును.

## సంకీర్ణ ప్రభుత్వాల కాలంలో తలెత్తిన కొన్ని ప్రత్యేక సమస్యలు

1 సాధారణ పరిస్థితుల్లో రాష్ట్రమంత్రి మండలి ముఖ్యమంత్రి నేతృత్వం పై నడుస్తుంది. సంకీర్ణ ప్రభుత్వాలున్న రాష్ట్రాల్లో ముఖ్యమంత్రి పెక్కు సందర్భాలలో నిజమైన ముఖ్యమంత్రిగా వ్యవహరించటానికి వీలుండేదికాదు. ఇతర మంత్రులవలె వ్యవహరించవలసి వచ్చేది. ఇతరులకు మార్గదర్శకుడుగా ఉండలేకపోయేవాడు. భాగస్వా పార్టీల నిర్ణయం ప్రకారం నడచుకోవలసి వచ్చేది. మంత్రుల నియ కంలో తొలగింపులో, శాఖలకేటాయింపులో గవర్నరుకు ప్రభుత్వ పేరాలను నివేదించటంలో స్వతంత్రం, ఆధిక్యత ఉండేవికావు.

2 పూర్వం లేనంతగా గవర్నర్ పాత్ర విమర్శకు అయింది. శాసన సభలో విభిన్న పార్టీల బలాబలాలను తేల్చవల సందర్భాల్లో గవర్నర్‌చర్య తీవ్రమయిన విమర్శలకు గురయ్యేది. ఉన్నా లేకపోయినా తమ పార్టీలకు ప్రభుత్వాన్ని ఏర్పరచగల ఉందని పార్టీలన్నీ అనటంతో గవర్నరుకు వాస్తవ పరిస్థితిని తెల కోవటం కష్టమయ్యేది. శాసన సభనురద్దుచేసే సందర్భాలలో కూ గవర్నర్ చాలా విమర్శలకు గురయ్యేవాడు.

3) కేంద్రం, రాష్ట్రాల మధ్య పెక్కువిషయాలలో అభిప్ర భేదాలు చెలరేగాయి. కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం రాష్ట్ర లోని కాంగ్రెసేతర ప్రభుత్వాలను చిన్న చూపు చూస్తున్నద విమర్శ ఉండేది. సంకీర్ణ ప్రభుత్వాలున్న రాష్ట్రాలలో శాం భద్రతలు క్షీణిస్తున్నాయని కేంద్రం రాష్ట్రాలను హెచ్చరిస్తుండే రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలు కావాలని కాంగ్రెసేతర సంకీ ప్రభుత్వాలు పదే పదే ఆందోళన సాగించాయి. రాజ్యాంగాని సవరించి రాష్ట్రాలకు ఇతోధిక అధికారాలు ఆర్థిక వనరులు కల్గించాల కాంగ్రెసేతర పార్టీలు కోరాయి. కొన్ని సంకీర్ణ ప్రభుత్వాలు పత మయిన తర్వాత రాష్ట్రపతి పాలన ప్రవేశపెట్టిన సందర్భాలలో కూ కేంద్రప్రభుత్వం చర్య పాక్షికమైనదని విమర్శించబడింది.

4) సంకీర్ణప్రభుత్వం కొనసాగినకొన్ని రాష్ట్రాలలో ప్రాంతీయ తత్వం బాగా పెరిగింది. కేరళలో కాంగ్రెస్ – ముస్లిం లీగ్ కలయి మద్రాసులో కాంగ్రెస్ – డి ఎం కె కలయిక ఆయారాష్ట్రాల్లో ప్రాంతీయ తత్వాన్ని, మతతత్వాన్ని, బలపర్చాయని రాజనీతి శాస్త్ర జ్ఞుల అభిప్రాయం. జాతీయ సమైక్యతకు సంకీర్ణ ప్రభుత్వాల నడవ అడ్డంకు అనే భావం పెక్కురిలో కలిగించింది. సంకీర్ణ ప్రభుత్వాల దేశంలో అవకాశవాదానికి, అధికార వ్యామోహానికి ఇంతకు పూర్వ లేని బలాన్ని చేకూర్చాయని పెక్కురి నమ్మకం. రాజకీయాల్లో ఆదర్శాలు అడుగంటడానికి, నీతి నిజాయితీలు మంటిగలవటానికి, స్వ యాత్మక దృష్టి లోపించటానికి, సఖ్యతాభావేన నశించటానికై సంకీ ప్రభుత్వాలు కొంత దోహదం చేశాయంటారు, కొందరు విమర్శకులు.

5) సంకీర్ణ ప్రభుత్వాలు సమాఖ్య రాజ్యవ్యవస్థ పునాదులన కదిలించాయని కొందరు భావించారు. అభివృద్ధి రంగాల్లో కేంద్రం రూపొందించిన మార్గదర్శక సూత్రాలు రాష్ట్రాలు ఆమోదించేవి కావు

కేంద్రం చర్యలు పక్షపాతవైఖరితో కూడుకొని ఉన్నవని, కాంగ్రెస్ పార్టీ అధికారంలో ఉన్న రాష్ట్రాలకు సహాయపడేవని కాంగ్రెసేతర సంకీర్ణ ప్రభుత్వాలు విమర్శించేవి

## ముగింపు

సంకీర్ణ ప్రభుత్వాలు భారతదేశ రాజకీయాలలో అంతర్భాగం కొత్తగా కొంత కాలమే మనగలిగిన సంకీర్ణ ప్రభుత్వాల అనుభవం ఆధారంగా సంకీర్ణ ప్రభుత్వాలు అవాంఛనీయ పరిస్థితులకు దారితీస్తాయని భావించరాదు నేడు సంకీర్ణ ప్రభుత్వాలు కర్నాటక, కేరళ, పశ్చిమ బెంగాలులో కొనసాగుతున్నాయి వాటి అనుభవం 1967–72 మధ్య కొనసాగిన సంకీర్ణ ప్రభుత్వాల అనుభవానికి భిన్నంగా ఉన్నది. సంకీర్ణ ప్రభుత్వ భావన ప్రగతికి వ్యతిరేకం గాదు. సాంఘిక రాజకీయ, ఆర్థిక ప్రగతి – సంకీర్ణప్రభుత్వాలు పరస్పర వ్యతిరేకం కాదు. సంకీర్ణ ప్రభుత్వాల కాలం అతి స్వల్పం స్వల్పకాలిక అనుభవం కొత్తరాజకీయ సిద్ధాంతాల రూపకల్పనకు, పెంపుదలకు సహాయపడక పోవచ్చు దీర్ఘకాలిక అనుభవం, శాస్త్రీయ దృష్టి, పరమైక్యతాభావం, మానవతా దృక్పథం రాజకీయాలకు, రాజకీయ నాయకులకు ఎంతో అవసరం

### పట్టిక – 1

### 1967 ఎన్నికల తర్వాత ఏర్పడిన సంకీర్ణ ప్రభుత్వాల స్వభావం

| రాష్ట్రం | సంకీర్ణ ప్రభుత్వ భాగస్వాములు | సంకీర్ణ ప్రభుత్వాల ఏర్పాటు తర్వాత ఏం జరిగింది ? |
|---|---|---|
| 1. బీహార్ | సోషలిస్ట్ + స్వతంత్ర + జనసంఘ్ + ప్రజాసోషలిస్టు + కమ్యూనిస్టు + జె కె డి | ఓటమి–రాష్ట్రపతిపాలన–మధ్యంతరఎన్నికలు–1969–కాంగ్రెస్ నాయకత్వంలో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు–ఓటమి–సోషలిస్టు నాయకత్వంలో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు– |
| 2. హార్యానా | హర్యానాకాంగ్రెస్ + ఇండిపెండెంట్లు | ఓటమి–రాష్ట్రపతిపాలన–మధ్యంతర ఎన్నికలు–1968 కాంగ్రెసు ప్రభుత్వ ఏర్పాటు |
| 3. మధ్యప్రదేశ్ | జనసంఘ్ + సోషలిస్టు + బి కె.డి + మాజీ కాంగ్రెస్ వాదులు | ఓటమి + కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పాటు– |
| 4. ఒరిస్సా | స్వతంత్ర + జనసంఘ్ | జనకాంగ్రెసు విరాయింపు – మధ్యంతర ఎన్నికలు 1971_ స్వతంత్ర, ఉత్కళకాంగ్రెసు, జార్ఖండ్ పార్టీల సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు |
| 5. పంజాబ్ | అకాలీదళ్ + జనసంఘ్ + కమ్యూనిస్టు + మార్క్సిస్ట్ + సోషలిస్ట్ + రిపబ్లికన్ + ఇండిపెండెంట్లు | ఓటమి. రాష్ట్రపతిపాలన మధ్యంతర ఎన్నికలు 1969 అకాలీ దళ్ జనసంఘ్ సంకీర్ణ ప్రభుత్వంఏర్పాటు |
| 6. కేరళ | మార్క్సిస్టు + కమ్యూనిస్టు + సోషలిస్టు + ముస్లింలీగ్ + ఆర్ ఎస్ పి + కె టి పి + కె ఎస్ | ఓటమి మధ్యంతర ఎన్నికలు 1970– కమ్యూనిస్టు నాయకత్వాన కాంగ్రెసు సహకారంతో మంత్రివర్గం ఏర్పాటు |
| 7 ఉత్తరప్రదేశ్ | బి కె డి + జనసంఘ్ + సోషలిస్టు + కమ్యూనిస్టు + ప్రజాసోషలిస్టు + ఆర్ పి ఐ + ఇండిపెండెంట్లు | ఓటమి రాష్ట్రపతిపాలన–మధ్యంతరఎన్నికలు కాంగ్రెస్, బి కె డి సోషలిస్టుల సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు– కాంగ్రెసు పాలన– |
| 8 పశ్చిమబెంగాల్ | మార్క్సిస్టు + బంగ్లా కాంగ్రెస్ + కమ్యూనిస్టు + ఫార్వర్డ్ బ్లాక్ + ఆర్ ఎస్ పి + సోషలిస్టు + ఎల్ ఎస్ ఎస్ + ఎస్ యు సి + డబ్ల్యుపి + గూర్ఖాలీగ్ + ఇండిపెండెంట్లు | ఓటమి రాష్ట్రపతి పాలన– మధ్యంతర ఎన్నికలు 1969– పూర్వపు సంకీర్ణ మంత్రివర్గంలాంటిదే ఏర్పాటు ఓటమి రాష్ట్రపతిపాలన– మధ్యంతర ఎన్నికలు 1971–కాంగ్రెసు నాయకత్వాన సంకీర్ణప్రభుత్వం ఏర్పాటు– |

## పట్టిక - 2
## సంకీర్ణ ప్రభుత్వాల స్థిరత్వం (1967-1970)

| రాష్ట్రం | మారిన ప్రభుత్వాల సంఖ్య | ప్రభుత్వం కొనసాగిన సగటు కాలం (నెలల్లో) | ఎన్నిసార్లు రాష్ట్రపతి పరిపాలన విధించబడింది | రాష్ట్రపతిపాలన కొ సగటు కాలం (నె |
|---|---|---|---|---|
| బీహార్ | 7 | 4.2 | 2 | 8 5 |
| హర్యానా | 3 | 3 2 | 1 | 6 8 |
| కేరళ | 2 | 20 5 | 1 | 1.8 |
| మధ్యప్రదేశ్ | 3 | 8.3 | - | — |
| పంజాబ్ | 3 | 10 0 | 1 | 8 8 |
| ఉత్తరప్రదేశ్ | 4 | 7 8 | 2 | 6.2 |
| పశ్చిమ బెంగాల్ | 3 | 8 9 | 1 | 12 2 |
| ఒరిస్సా | 1 | 45 9 | - | — |

## పట్టిక - 3
## కొని ఉప అంశాలు, వాటి ఆధారంగా సంకీర్ణ ప్రభుత్వాల రకాలు

| ఉప అంశం | సంకీర్ణ ప్రభుత్వ రకం |
|---|---|
| 1) సంకీర్ణతాకాలం—ఎన్నికలకు ముందా, తర్వాతా | 1) ఎన్నికల పొత్తు ప్రభుత్వ ఏర్పాటులో పొత్తుగా మారటం ఏర్పడిన సంకీర్ణ ప్రభుత్వం<br>2) ఎన్నికల తర్వాత పొత్తుకుదిరి ఏర్పడిన సంకీర్ణ ప్రభుత్వం |
| 2) సంకీర్ణ ప్రభుత్వ భాగస్వామ్య పార్టీల బలం | 1) ఏకపార్టీ ఆధిక్య సంకీర్ణ ప్రభుత్వం<br>2) అధిక సంఖ్యాబలం గలపార్టీ ఆధిక్య సంకీర్ణ ప్రభుత్వం |
| 3) శాసన సభా పరిమాణానికి సంకీర్ణ ప్రభుత్వ భాగస్వామ్య పార్టీల బలాలకి మధ్య సంబంధం | 1) మెజారిటీ సంకీర్ణ ప్రభుత్వాలు<br>2) మైనారిటీ సంకీర్ణ ప్రభుత్వాలు |
| 4) సంకీర్ణ ప్రభుత్వ భాగస్వామ్యపార్టీల సంఖ్య | 1) పెక్కు పార్టీల సంకీర్ణ ప్రభుత్వం<br>2) రెండు పార్టీల సంకీర్ణ ప్రభుత్వం<br>3) కొన్ని పార్టీల సంకీర్ణ ప్రభుత్వం |
| 5) సంకీర్ణ ప్రభుత్వాల భాగస్వామ్యపార్టీల సిద్ధాంతాలు. | 1) సిద్ధాంతపరంగా సాధర్మ్య సంకీర్ణ ప్రభుత్వం<br>2) సిద్ధాంతపరంగా వైధర్మ్య సంకీర్ణ ప్రభుత్వం<br>3) లెఫ్టిస్టు సంకీర్ణ ప్రభుత్వం<br>4) రైటిస్టు సంకీర్ణ ప్రభుత్వం<br>5) సెంట్రిస్టు సంకీర్ణ ప్రభుత్వం<br>6) తాటస్థ్య సంకీర్ణ ప్రభుత్వం |
| 6) రాజకీయాలకు, ఇన్‌ఫ్రాస్ట్రక్చర్‌కు అంతర్చర్య | 1) ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ఆధిక్య సంకీర్ణ ప్రభుత్వం<br>2) సెక్యులర్ ఆధిక్య సంకీర్ణ ప్రభుత్వం |

## సహాయక రచనలు


1. ఇక్బాల్ నారాయణ్ ట్వయ్‌లైట్ ఆర్ డాన్, ది పొలిటికల్ చేంజ్ ఇన్ ఇండియా, 1967-71 శివలాల్ అగర్‌వాల్, అండ్ కంపెనీ, ఆగ్రా, 1972

2. సుభాష్ కాష్యప్ ది పొలిటిక్స్ ఆఫ్ డిఫెక్షన్, నేషనల్ పబ్లిషింగు హవుస్, న్యూ ఢిల్లీ, 1969

3 రాబర్ట్ స్టెర్న్ ది ప్రాసెస్ ఆఫ్ అపొజిషన్ అఫ్ ఇండియా, చికాగో యూనివర్సిటీ ప్రెస్, 1970

4 సరళ్ ఛటర్జీ ది కోయలేషన్ గవర్నమెంట్, సి ఎల్ ఎస్, మద్రాస్, 1974.

5. సరళ్ ఛటర్జీ పొలిటికల్ ప్రాస్పెక్ట్స్ ఇన్ ఇండియా, సి ఎల్ ఎస్, మద్రాస్, 1974

6 ఎం. ఎస్ వర్మ . కోయలేషన్ గవర్నమెంట్, న్యూఢిల్లీ, 1971

7. పి సత్యనారాయణ, భారత రాజ్యాంగం, సౌత్ ఇండియా పబ్లికేషన్స్, హైదరాబాదు, 1984

8. పి సత్యనారాయణ భారత ప్రభుత్వం, రాజకీయాలు, సిద్ధార్థ పబ్లికేషన్స్, హైదరాబాదు, 1984

9. కె మధుసూదనరెడ్డి, డి రవీంద్రప్రసాద్, పి సత్యనారాయణ భారత రాజ్యాంగం, రాజకీయాలు, పాలన, తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నం, 1980




# బాలభానుని అరుణకిరణాలు !

వెలుకాని కఱకుటమ్ముల్లాగా తగిలి
నా మాంద్యాన్ని మటుమాయం చేస్తుంటాయి !
వేల్పుటేటి పాయల్లాగ పారి
నా దోషాల్ని శోధిస్తుంటాయి !
చెంగల్వల పరాగాల్లాగా వలపుల్ని చల్లి
నా "ఏడమూకుడు మనసుకి"
పలుకుల్ని నేర్పి పారాడింప జేస్తుంటాయి !
తేనె చినుకుల్లాగ గుప్పునల గుప్పళించి
పీడలతో కుంటువారిన నా బ్రతుక్కి
ఔజ్జ్వల్యాన్ని కల్పించి రాణింప జేస్తుంటాయి !
వసంతకాలపు మావిమోకల్లాగా గుబురుగా విరిసి
వగపులతో పగుళ్ళువారిన నా స్వాంతానికి
కొత్త కొత్త కోరికల కోయిలల పాటల్ని
ఎఱుక పరచి కోలాటు మాడింపజేస్తుంటాయి !

మధురవాణి చిర్నగవుల్లాగా మెరిసి
కుత్సితుడైన గిరీశంలాంటి నా బుద్ధికి
బుద్ధిని గరిపి సరిచేస్తుంటాయి !
భటకోటిలాగా చిత్ర చిత్ర విన్యాసాల్ని చూపి
కుందేలు లాంటి నా చిన్న గుండెకి
వేటుకుక్కల్ని తునుమాడె దార్ఢ్యాన్ని
ప్రసాదింపజేస్తుంటాయి
సుకవుల కవిత్వంలాగా వర్ణశుద్ధి విలసితమై పిసాళి
నా నీరస చిత్తాన్ని రాగిల్లింప చేస్తుంటాయి !
"బాలభానుని అరుణకిరణాలు"
నాజూకయిన – నాణ్యమయిన
ఆ లే లేతవెలుగులంటే
నాకు మిక్కిలి యిష్టం !
నేను రోజు వాటి వన్నెల కోసమే తపిస్తుంటాను !

# వైశ్వనాథీయం

పాషాణ పాక ప్రభువయినా
"హృదయమున్న వాడు" గనక జలదరించి
అత్త గారి నిందలకు – తల్లడిల్లి
వాగయి ప్రవహించిన
కిన్నెరసాని బతుకుని
పాటగా మలచి,
కనికరాన్ని కుమ్మరిల జేశాడు
"విశ్వ నాథుడు" !

కరుణారసమూర్తి అయినా
"బండ రాయి" గనుక
అత్త గార్ల ఆక్షేపాలతో
కట్నాల గొడవలతో
ఉస్సు రస్సు రంటూ
ఆత్మాహూతి గావించుకుంటున్న నవోఢల జీవితాలకి
ముక్తి మార్గాల్ని చూపించలేకపోతున్నాడు
"విశ్వనాథుడు"
దేవునిగా మాత్రం దర్జాగా పూజ లందుకుంటున్నాడు

శ్రీ కె. కిశోరు బా
శ్రీ కె. అశోకు బా

(గత సంచిక తరువాయి)

యోగి కుటీరంలో లేనప్పుడు-

పతంజలి ప్రసన్నంగానూ - తీరిగ్గానూ ఉన్నప్పుడు - మెల్లగా అడిగింది- సుషమ "ప్రభూ!"

"ఏమిటి సుషమా?"

"మీరు కనిపెట్టబోతున్న దివ్యౌషధం" ప్రపంచంమీద, మానవాళిమీద ఎటువంటి ప్రభావం చూపుతుందో ఎన్నడయినా ఒక్కసారి తీవ్రంగా ఆలోచించారా?"

"లేదు అసలెందుకి ఆలోచన రావాలి నాకు ? నేను కేవలం- వైద్యశాస్త్ర పరిశోధకుణ్ని. నా పని మందులు కనిపెట్టడం మేరకే. కాదూ?"

"కాదేమో స్వామీ" భయంగా మెల్లగా అందామె

"సు . ష . మా!" అవిధేయతకాగ్రహంచెందినట్లు చురుకుగా చూశాడు పతంజలి ఆమెవేపు

కొంచెం కంపిస్తున్న స్వరంతో - క్షమాపణ అర్ధిస్తున్నట్లే అందామె "అపాత్రదానం కూడదని పెద్దలే చెప్పారటగా ? దానం చేసేముందు స్వీకరించేవారి యోగ్యతా యోగ్యతలనుకూడా విచారించాలని..."

సూటిగా చూశాడు పతంజలి ఆమెవేపు. ఈసారతని కంఠం కొంచెం కఠినంగానే ఉంది "నువ్వు చెప్పదలచుకున్నదేమిటి?"

ఆమె తల వొంచుకుంది.

"చెప్పు" గద్దిస్తున్నట్లే ఉందతని కంఠం.

"మీరు కనుగొనబోయే దివ్యౌషధం గురించి ప్రపంచానికి తెలిసి- యావత్ప్రపంచమూ రెండు ముక్కలుగా చీలిపోయింది .."

"రెండు ముక్కలా!" ఆశ్చర్యంగా చూశాడతను.

"ఊc"

"మనిషి చిరంజీవి కావటంపట్లకూడా రెండు అభిప్రాయాలుంటాయా ? మృత్యువును జయింపబడకూడదనే మనుషులుకూడా ఉంటారా?" నమ్మలేనట్లే చూశాడు పతంజలి

"మానవాళి – మీరనుకున్నట్లు సహజమయినది కాదు స్వామీ ఖలునకు నిలువెల్లా విషమన్నట్లే; మనిషికి నిలువెల్లా స్వార్ధమే. 'చిన్నినా బొజ్జకూ శ్రీరామరక్ష' అనుకొని ఊరుకోడంలేదు నేటి మనిషి. తన అధిక్యత చూపుకుందుకు ఎదుటివాడు అల్పుడూ అధముడూ కావాలనికూడా కోరుకుంటున్నాడు. అందుకే- మీరు కనిపెట్టే దివ్యౌషధం తమకే చెందాలని దాని ఫార్ములా తమకే తెలియా ప్రపంచ అగ్రదేశాలన్నీ ప్రయత్నాలు ప్రారంభిస్తున్నాయి. అం యీ ఫార్ములాకోసం అవి పోటీలు పడుతూ యుద్ధాలకి యన్నమాట."

"యుద్ధాలా!"

"యుద్ధమంటే ప్రత్యక్షంగా కత్తులతో కటారులతో కొట్లాడుకోరు ఒకదేశపు గూఢచారిని మరోదేశపు గూఢచారి చుక్కంటే - శబ్దమయినా చేయని రైఫిల్‌తో కాల్చి చంపుతారు చివరకు మిగిలినవారు యిక్కడికి వొచ్చి—"

"వీల్లేదు!" కోపంగా అరిచాడు పతంజలి ఆమెనంత చెప్పనీయకుండా "నా శ్రమ – మనిషిని చిరంజీవిని చేయడం నా తపస్సు - మృత్యువుని జయించడానికి. అంతే దీనికి మనుషులు కొట్టుకు చావడం నేనెంతమాత్రమూ సహించను. చను."

"నిజంగా మీరు - 'సర్వేజనా సుఖినోభవన్తు' అనే ఆ ఉండవచ్చు, కాని - వాస్తవంలో జరిగేది విరుద్ధం నాగరికత, కీయాలు, ఆర్థిక పరిస్థితులు, మతాలు, పార్టీలు, యివన్నీ అభి చెంది – మనిషిని మరోమనిషికి స్నేహితుడిగా సహజీవిగా కాక వుగా ప్రత్యర్థిగా రూపొందిస్తున్నాయి. పెచ్చుపెరిగిన ప్రపంచ మనిషి చిరంజీవి కావడం సహించలేదేమో పెరవారికి చోటొసంగ వృద్ధులు యీ ప్రపంచం నుంచి నిష్క్రమించాలనే యీ తాలూకు కోరికేనేమో. ప్రభూ! మీరు మృత్యువుని జయించ కంటె జనాభా పెరగకుండా సులభోపాయం కనిపెడితేనే సంఖ్యాకులు హర్షించేవారేమో."

"కాని...." ఏదో చెప్పబోయి ఆగిపోయాడు పతంజలి. గమనించిన సుషమ అతనివేపు దీనంగాచూసూ "చెప్పండి స్వా నేను మీ రహస్యాన్ని ఖచ్చితంగా కాపాడగలను. నేను మీ శిష్యు లినీ, సేవకురాలినీ" అంది కంఠంలో కనిపించీ కనిపించని ఛాయతో తను సన్నిహితురాలూ విశ్వసనీయురాలూ అని తన రహస్యాలు దాచడం అన్యాయమనీ ఆమె తన కంఠంలోని మా ద్వారా చక్కగానే సూచించింది

"రహస్య మేమీ కాదు సుషమా ... నేను నా భార్యకి చే వాగ్దానం ."

"మీకు భార్య ఉందా!"

"ఉండేది. సరిగ్గా శోభనం నాటి సాయంత్రమే చనిపోయి నన్ను దురదృష్టవంతుణ్ని చేసి.. ".

"అయ్యో!" జాలిగా చూసిందామె ఆమె సానుభూతికతను కరిగిపోయి- "ఆమె ఆత్మకు నేను వాగ్దానంచేశాను, మమ్మల్ని నిర్దాక్షిణ్యంగా విడదీసిన మృత్యువుని జయిస్తానని" అన్నాడు.

"అందుకా మీ యీ తపస్సు! నిజంగా – స్వామీ మీ ప్రేమ కోసం అద్భుతమూ, అపూర్వమూ. మీ భార్యంత అదృష్టవంతురాలింకెవరూ ఉండరేమో ఆమెయడల మీ ప్రేమ దానికి చిహ్నంగా ఆకృతి చేయబోతున్నది ఓహో! ... మృత్యువుని జయించడం ప్రేమచిహ్నం ... ఇది తాజ్‌మహల్‌కంటెకూడా అద్భుతమయిన ప్రేమకానుకే. మీదెంత మహోన్నతమయిన ప్రేమ!" తడబడింది సుషమ నిజంగా ఆమెకు పతంజలి మాటలు అతని కథ, చాలా ఆశ్చర్యాన్ని కలిగించి వొదిలాయి ప్రపంచంలో నిజంగా యిటువంటి ప్రేముంటుందా అనిపించిందామెకు చనిపోయిన భార్య ఆత్మశాంతి కోసం ఆ మనిషి – మానవుని కసాధ్యమయిన- మృత్యువుని జయించ కోవడం అనే పనిని తలపెట్టడం! నమ్మశక్యం కాలే దామె కొకంతట అతను తన చరిత్ర పూర్తిగా వివరంగా చెబితే బాగుండుననిపించింది

హటాత్తుగా ఏదో ఆలోచన వొచ్చినట్లు – ఒక్కసారి పిలిచాడు పతంజలి "సుషమా!" "స్వామీ" ఆమెకు భయంవేసిందతని స్వరానికి

"ఈ రహస్యం ప్రపంచాని కెలాతెలిసింది?" కోపంగా, నిలదీస్తున్నట్లే అడిగాడు "నేనెవరికీ చెప్పలేదు"

అతని చూపులు ...

గజగజ వొణికిపోయింది సుషమ

అతని కన్నులలో తనపట్ల అనుమానం!

భరించలేకపోయిందామె ఒక్కసారిగా అతని పాదాలమీద వాలిపోయింది కన్నీటితో "ప్రభూ! నన్ను విశ్వసించండి. నేనీ రహస్యం మీరు చెప్పేవరకూ – యీ క్షణంవరకూ వివరంగా ఎరుగనే ఎరగను నేను ఎవరికీ ఏమీ చెప్పలేదు"

కొన్ని నిముషాలు మౌనంగా గడిచిపోయింది అప్పుడు పతంజలి ఆమెను లేవనెత్తాడు కళ్ళనిండా నీళ్ళతో – బహుదీనంగా ఉందామె ముఖం అతని హృదయం కరిగిపోయింది

"నేను నిన్నవమానించడంలేదు-" అన్నాడు మెల్లగా

"ధన్యురాలిని" కళ్ళు తుడుచుకుంటూ అందామె "ఈ సందర్భంలో మీకొకవిషయం ప్రత్యేకంగా చెప్పాలి"

"ఏమిటది?"

"మీరు-మీ ఫార్ములాను ఏంచేస్తారు?"

"ఆలోచించలేదు, చూలాలేదన్నట్టుంది-"

"అలాగకాదు స్వామీ ప్రపంచం- మీరు దీన్ని సాధించేసినట్లే భావిస్తూంది. అందుకని——"

"నువ్వు నలహా చెప్పు ఏం చేయమంటావ్? మృత్యువుని జయించే ఔషధం కనిపెట్టేవరకే నా వంతు తరువాత దాన్ని ఎవరేం చేసుకున్నా నాకనవసరం"

"కాని . పరిస్థితి మీకు వివరించానుకదా ఈ ఫార్ములాను మీ అంతట మీరు మీకిష్టమయినవారికిచ్చే స్వేచ్ఛ మీకు మిగుల్చుతా రనుకోను – అదీ నా భయం"

"అంటే?"

"ఆ ఫార్ములాను మీనుంచి లాక్కుందుకు విపరీతమయిన ప్రయత్నాలు జరుగుతాయి అంటే-మీరు ప్రమాదంలో చిక్కుకున్నా రన్నమాట" చివరి వాక్యం అంటుంటే ఆమె కంఠం వొణికింది.

పతంజలి నిర్ఘాంతపోయాడు

నిశ్చేష్టుడై ఆమె ముఖంవేపు చూస్తూ ఉండిపోయాడు కొన్ని నిముషాలపాటు

"ఐతే నన్ను వాళ్ళు చంపుతారా?" మెల్లగా అడిగాడు.

"నా కంఠంలో ప్రాణముండగా అది అసాధ్యం" హామీ ఇస్తున్నట్లే అందామె పతంజలి ఆమె మాటలలోని శక్తికి చాలా చలించాడు ముగ్ధుడయ్యాడు

"సుషమా!" ప్రేమగా పిలిచాడు "నేను ఎవరినని నీకు నామీద యింత అభిమానమూ, శ్రద్ధా?".

ఆమె – నవ్వింది ఆ నవ్వులో కొంచెం నిరాశ నిరుత్సాహం లేకపోలేదు మీ ప్రతిజ్ఞ నెరవేర్చుకోండి తరువాత చెబుతాను అంది మెల్లగా

హటాత్తుగా అడిగాడు పతంజలి "అసలు – మనం యిక్కడున్నట్లు, మృత్యుంజయని కనిపెట్టబోతున్నట్లు పై వాళ్ళకెలాతెలిసింది?"

ఉలిక్కిపడిందామె ఆ ప్రశ్నకు.

పతంజలి మంచి ప్రశ్నే వేశాడు. నిజమే పతంజలితోపాటు ఉంటున్నది తనూ, యోగే తనకి యిక్కడికి వొచ్చేముందే తెలుసు పతంజలి పరిశోధిస్తున్న విషయం సంగతి అంటే అప్పటికి తెలిసిన వారు – పతంజలికాక – యోగి మాత్రమే అతని ద్వారానే యీ విషయం బయటకు పొక్కి ఉండాలి అసమర్థుడిలా, వెర్రివాడిలా కనిపించే యోగి – ఎవరికయినా ఏజంటు కాదుకద?

అంతే ఐ ఉంటుంది

యోగి ద్వారా తప్ప యీ విషయం బాహ్యప్రపంచానికి తెలిసే మరే అవకాశమూ కనిపించదు.

యోగి! పతంజలి శిష్యుడు . ఇంత పనిచేసి ఉంటాడా!

'రూపములు మోసపూరి తము'లన్న మాట ఎంత నిజం ! తన విషయమూ అంతే పతంజలి తనను అమాయికురాలిగా బావించడం లేదూ ?

ఒక్కసారి - ఆ నిష్కల్మషుడికి - తన గురించి నిజం చెప్పేసి పాపప్రక్షాళనం గావించుకుంటే ? తనిక్కడికి వొచ్చినప్పుడేమిటో, యిప్పుడెలా మారిపోయిందో - నివేదించుకుంటే ?

సుషమలో ఉద్రేకం ఉప్పొంగింది.

ఐనా ఎలాగో నిగ్రహించుకుంది వివేకం తెచ్చుకుంది, మెల్లగా అంది "ఏం జరిగినా ఎలా జరిగినా మీరు పట్టించుకోకండి ప్రభూ! మీ కార్యం నెరవేరేటట్లు చూసే భారం నాది మిమ్మల్ని రక్షించుకునే బాధ్యత నాది మీరు నిశ్చింతగా - మునుపటిలాగే ఉండండి"

అదే క్షణంలో యోగి వచ్చాడక్కడికి

## 11

"సుషమా !"

మంత్రోచ్చారణలాగ పిలిచిన పిలుపుకి - హృదయంలో యిది అని చెప్పరాని సంరంభం కలిగి - ఆ అనుభూతి నుంచి తేరుకోకుండానే పతంజలి వేపు చూసిందామె ఒక విధమైన భక్తితో

అతన్ని చూడడంతో ఆమెకు మరీ ఆశ్చర్యం కలిగింది పతంజలిలో కొట్టవచ్చినట్లు కనపడుతున్న మార్పు కాంతితో పోత పోసినట్లున్నాడు నిలువెల్లా అది సత్యమో తన భ్రమో తెలియడం లేదు కాని - గురూజీ శిరసు చుట్టూ కాంతి చక్రం తిరుగుతున్నట్లు అతని నిండా దివ్యతేజస్సు ప్రజ్వరిల్లుతున్నట్లు.

"ప్రభూ !" అందామె భక్తితో నమస్కరిస్తూ, కొంచెం భయ పడుతూనే అతని కన్నులలోకి చూసింది ఒక్కసారి వివిధ భావా లకూ ఆలవాలములై ఉన్నాయతని కళ్లు

ఆ కన్నులలో - విజయం ప్రపంచాన్నే గెలిచినంత ఆనందం ధ్యేయాన్ని సాధించినట్లు...గమ్యాన్ని చేరినట్లు ..అంతలోనే యింకా ఏదో చిన్న వెలితి మిగిలిపోయినట్లు ఆతత అనుమానం అతని శరీరంలో చిరుకంపన. గురూజీ కొత్తగా కనిపిస్తు న్నారు. దేనికోసమో ఆందోళన చెందుతున్నారు

"నీతో కొంచెం మాట్లాడాలి. నిన్నొకటి అర్థించాలి అన్నాడు పతంజలి మెల్లగా.

అతని మాటలామెకు భయం కొల్పాయి. ఎన్నడూ లేనిది గురూజీ ఏమిటి యిలా మాట్లాడుతున్నారు ?

"మీరు నన్ను ఆజ్ఞాపించాలి కాని అర్థించడమేమిటి ప్రభూ ? అందామె వినయంగా

"నీ భక్తికి సంతోషం వెళ్ళి - స్నానం చేసిరా మనసు కూడా నిర్మలంగానూ ప్రశాంతంగానూ ఉంచుకో"

వాగు వద్దకు వెళ్లి తల స్నానం చేసి వొచ్చిందామె. అప్పటికి పతంజలి పూజామందిరంలో ఆమె కోసం ఎదురుచూస్తున్నాడు.

సుషమని చూస్తూనే అతనికి ముచ్చట వేసింది గోధుమరంగు శరీరం, స్నానం చేయడంతో ఒక విధమయిన మెరుపు తెచ్చుకుని కొలనులోని - తామర రేకులా పరిశుద్ధంగా ప్రకాశిస్తూంది. ఆ శరీర వర్ణం పవిత్రంగా ఉంది దేవతాంశ కల స్త్రీలా ఉంది సుషమ ఈ పవిత్ర కార్యానికిటువంటి అమ్మాయి దొరకడం అత్యంత సుభసూచకం

పూజా కుంకుమ నందించాడు. ఆమె అది తీసుకుని నొసట దిద్దుకుంది పతంజలిలాగే ఆమెకూడా పద్మాసనం వేసుకుని కూర్చుంది ఎదురుగా ఉన్న దైవ విగ్రహాలకు - కళ్లు మూసుకుని భక్తితో నమ స్కరించింది. కొన్ని నిముషాలు మౌనంగా గడిచాయి.

"సుషమా! కనులు తెరవకు ధ్యానం చెదరనీకు, నేను చెప్పేది శ్రద్ధపెట్టి ఏకాగ్రతతో విను సంభాషణ పూర్తయ్యే వరకూ కదలకు". అతని కంఠం హిప్నటైజ్ చేస్తున్నట్లే అనిపించిందామెకు. ఆ ఆజ్ఞకు బద్ధురాలన్నట్లు తల ఊపింది మౌనంగా. అక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

"సుషమా! ఇంతవరకూ నేనేమిటో, నా జీవితమేమిటో, నా కృషి-ఫలితాలేమిటో నీకు స్పష్టంగా తెలియ పరుస్తాను. అవసరం లేక, నేనూ చెప్పలేదు. స్పష్టంగా చెబుతాను విను. కొద్దినిముషాలలో తండ్రినీ, తల్లినీ, భార్యనీ పోగొట్టుకున్న దురదృష్టవంతుణ్ని. శోభనం కోసం ఎదురు చూస్తుండగా ఆ సాయంత్రం జరిగిన ఘోరాలవి. ఒక్కసారి ఒంటరినైపోయాను. ఆదుఃఖం దుర్భరమైంది. నామనసు విచిత్రమైన మార్పులకి లోనయింది మృత్యువుమీద పగబూనాను. నన్నిటు దైన్యానికి శాశ్వతంగా గురిచేసిన మృత్యువుమీద కసి తీర్చుకో, అనుకున్నాను. చనిపోయిన 'నా తల్లి... తండ్రి... భార్య... కలల రూపంలో వొచ్చినన్ను ఉత్సాహపరచి కార్యోన్ముఖుణ్ణి చేశారు. జీవితం మారిపోయింది నేను బ్రతకడమే మృత్యువుని జయించేందుకూ, దానిమీద కసి తీర్చుకుందుకూ అందుకు నేను చిన్నతనంలో మాతండ్రిద్వారా కొంతతెలుసుకున్న ఆయుర్వేదమే ఆయుధంగా కనిపించింది. సంస్కృతంతో పరిచయం ఉండడం- అప్పుడప్పుడు మానాన్నగారిద్వారానూ, యింటికి వొచ్చే పండితుల ద్వారానూ వేదాలు ఉపనిషత్తులూ వింటూ ఉండడం... యివన్నీనాలో ఆత్మవిశ్వాసాన్ని కలిగించాయి. జ్ఞానానికి ఊహని జోడించి ఓషధులు- మూలికలు ఉపయోగించి ప్రయోగాలు ప్రారంభించాను క్షుద్రజంతువులయిన ఎలుకలు, కుందేలుపిల్లలు... కోతులు. కుక్కలు.. వీటిమీద నా మందులు వాడగా ఫలితా లిచ్చాయి. వాటి ఆయుర్దాయం పెరిగింది మానవ జీవితాన్ని కూడా పొడిగించగలనని విశ్వాసం పెరిగింది కాని నా దృష్టిలోమార్పు వచ్చింది హఠాత్తుగా. దృక్పథంలో మార్పు-ధ్యేయం మారకపోయినా.

నేను 'మృత్యుం జయని' కనిపెట్టేది- మృత్యువుమీద పగతీర్చుకుందుకుకాదు మనిషికి మేలునికూర్చేందుకు. విశ్వమానవ కళ్యాణానికి అలా అనుకోగానే నా హృదయం ప్రశాంతమయింది. నవోత్సాహం పెల్లుబికింది, మెదడు మరింత సునిశితమయింది వ్యాధివల్ల మరణాలుండవు వ్యాధులే వుండవు! అకాల మరణాలుండవు. మానవాళి ఎంత సుఖపడగలదు అంతేకాదు .. సుదీర్ఘమైన జీవితం లభించే మానవుడు ఏ రంగంలో అయినా ఎక్కువ కాలం కృషి చేయడానికి ఎక్కువ అభివృద్ధి-సాధించడానికీ చాలా అవకాశ ముంటుంది. అందుచేత-దీర్ఘ జీవితం మనిషికి వరమే దీనికోసమే నేను తపస్సుచేశాను."

"తపస్సా"

"తపస్సంటే- కృషే. పట్టుదలతో... అవిరళంగా... అవిచ్ఛిన్నంగా సాగించే ఏ కృషిఅయినా తపస్సే. తపస్సంటే అధ్యయనం-కార్యదీక్ష ఓషధులు- మూలికలు వీటిమీద నేను గావించిన పరిశోధన తపోసదృశమే. నా తపస్సు ఫలించింది, కూడా!" అన్నప్పుడతని కంఠంలో ఆనందం వెల్లివిరిసింది

"అంటే, 'మీరు మృత్యువుని జయించారా ?" నమ్మలేనట్లడిగింది సుషమ పతంజలివేపు చూస్తూ.

"దాదాపుగా – అంతే ఎటొచ్చీ - ధ్రువీకరించ బడాలంతే" అర్థం కానట్లు చూసిందామె అతనివేపు

"ఔను మృత్యుంజయ అనేది నేను కనుగొన్న దివ్యౌషధం నామధేయం, దానిలో రసవిషాదులు కలుస్తాయి. గరళం . పాషాణం వంటివి ఎటు పనిచేస్తాయో నిశ్చితంగా చెప్పలేం. రోగి చివరి క్షణాల్లో ఉపయోగిస్తారు వీటిని. అత్యంత శక్తివంతమైనవివి. ఇవి కలసిన మృత్యుంజయ శక్తి కూడా అంచనా కందేది కాదు మృత్యుంజయ – నేను ఆశించిన రీతిలో పని చేస్తే ఫరవాలేదు. చేస్తుందనే నా విశ్వాసమూ, కాని - కీడెంచి మేలెంచాలి కదా ? అందుకని . ." ఆగాడు పతంజలి సుషమ మెదడులోకి ఒక సందేహం వొచ్చింది. ఆమె కళ్ళల్లోకి చూసి - అది గ్రహించిన పతంజలి - చిరునవ్వు నవ్వుతూ - "నీ భయం నా కర్థమయింది మృత్యుంజయ వికటిస్తే ఏం చెయ్యాలనేది నేను ఆలోచించి – సిద్ధపడే ఉన్నాను అవసరమయితే విరుగుడు ప్రయోగించుకునేందుకు సర్వసన్నద్ధుడినయ్యే ఉన్నాను. నీ ప్రాణంతో నేను చెలగాట మాడగలనని ఎలా భావించావు ?" అన్నాడు.

సుషమ సిగ్గుపడినట్లూ . . తన తొందరపాటుకి పశ్చాత్తాప పడుతున్నట్లూ తల వొంచుకుంది.

"ఒక్క మహత్తరకార్యానికి సమిధవు కాదలుచుకుందుకు సిద్ధంగా ఉంటే సంతోషంగా ముందుకి రాగలిగితే - నిజంగా నిన్నభినందించాలి ఈ ప్రయోగం సఫలమయితే మానవజాతి నీకు ఋణపడి ఉంటుంది. మొదటిసారిగా ఎవరెస్టు శిఖరారోహణ గావించడం, అంతరిక్షంలో అడుగుపెట్టడం . యిటువంటివాటిలాగే. అంతకంటె గొప్పది, కాకపోతే - యిదీ ఘనమైనదే"

"నేను సంతోషంగా సిద్ధమౌతున్నానని చెప్పలేకపోతే ? అదే ఒకవేళ నేనీప్రమాదకరమయిన ప్రయోగానికి సిద్ధంగా లేనంటే ?"

ఒక్కసారి కలవరపడ్డాడు పతంజలి. ఇంతవరకూ వొచ్చి, యిప్పుడు తాను ఓడిపోవడంలేదుకదా? మొదటినుంచీ తనకి అనుమానం

గానేఉంది- చివరి దశలో ప్రయోగాని కవసరమయిన మనిషి తనకు లభ్యమౌతుందా అని. జంతువులమీద ప్రయోగించడం వేరు మనుషుల మీదవేరు. ఔషధాన్ని కనుక్కోవడంకంటె దానిని ఉపయోగించి ఫలితాలనుచూడడమే సైంటిస్టుకెక్కువ కష్టమైనదశ. అదే తన కెదురయింది సుషమ కాదంటే తనేంచెయ్యాలి? కోతులమీద వాడిచూశాడు మృత్యుంజయను. సఫలమే అయింది. కాని అంతమాత్రాన - వానరులమీద సఫలమైనంతమాత్రాన, నరులమీద విజయవంతం ఔతుందని నూటికి నూరుపాళ్లూ నమ్మేందుకులేదు సుషమ కాదంటే -

"నామీదనే ప్రయోగించుకుంటాను" అన్నాడు పతంజలి నిరాశగా. "కాకు అంతకంటె గత్యంతరం ఏముంది? ఒక విధంగా ప్రమోదకరమే. ఏటు నుంచి ఎటు తిరిగినా విరుగుడు వేసేందుకు సాధ్యంకాక నన్ను నేను బలి చేసుకోవాలి అవసరే, భగవంతుడిమీద విశ్వాసం ఉంచి - మృత్యుంజయని నేనే తీసుకుంటాను" అన్నాడతను నిరాశగా.

"అలాగదేనికి? యోగికూడా మీ శిష్యురాలేకదా? ఆమెన్ని నిర్దేశించవొచ్చుకదా?" సూటిగా అడిగింది.

"యోగి!" పతంజలి ముఖం రంగులు మారింది ఒక క్షణం దీర్ఘాలోచనలో పడినట్లు మౌనంగా ఉండి- అంతలోనే - 'వొద్దు' అనేశాడు అదే తన నిర్ణయమన్నట్లు.

సుషమ ముఖంలో కాంతి వొచ్చింది. యోగిని కాదని తన సొంటివంటి మహాత్కార్యానికి పతంజలి నియోగిస్తున్నారంటే - తనకాయన ప్రత్యేకతనిస్తున్నారన్నమాటే.

ఇది తెలుసుకుందుకే తను ప్రయత్నించింది అంతేకాని ఆయన కోరాలేకాని తన ప్రాణాలనయినా యిచ్చేందుకు సంసిద్ధురాలే తను.

"ప్రభూ! మీరు కోరాలేకాని ప్రాణాలుకూడా పరమానందంగా యిచ్చేస్తాను".

"సుషమా!" సంతోషంగా చూశాడు పతంజలి ఆమెవేపు. "నువ్వు-మృత్యుంజయని సేవిస్తావా?"

"తప్పకుండా"

"ఒక్కనిముషం." అతను కుటీరం బయటకువొచ్చి ఆకాశం వేపుకు చూశాడు. సూర్యాస్తమయాని కింకా చాలా సమయముంది. వేళ్ళమీద ఏవో లెక్కలు వేసుకున్నాడు లోపలకు వచ్చి పంచాంగం బయటకుతీశాడు. ఐదునిముషాలు లెక్కవేసి-ముహూర్తం నిర్ణయించినట్లు పంచాంగం మూసిపెట్టేశాడు

"ఈ రాత్రికి పది గంటల ప్రాంతంలో మంచి ముహూర్తముంది ఇక లే సుషమా"

ఆమె లేచి నిలుచుంది

"ఈ రాత్రి నువ్వు నిరాహారంగా ఉండాలి. ఉపవాసమన్నమాట"

"మృత్యుంజయ సేవన కది నియమమా ?"

"కాదు అది సర్వజన సేవకై . సామాన్య మానవులు సేవించేలా రూపొందించబడినది అందుచేత దీనికి నియమాలూ నిష్ఠలూ అవసరంలేవు."

"మరి?"

"మొట్టమొదటిసారిగా మానవులమీద ప్రయోగించబడుతోంది అందుకని - శుభముహూర్తంచూశాను."

"ఓహో!"

"తొమ్మిది గంటలకు - వెన్నెల బాగావే వొస్తుంది. వెన్నెలలో వాగులో స్నానంచేయాలి. ప వి త్ర వ స్త్రం ధరించాలి. పూజలో కూర్చోవాలి"

"అలాగే."

"నీ రుణం తీర్చుకోలేను సుషమా!"

ఆమె నవ్వి ఊరుకుంది ఆ నవ్వులో అర్థం అతనికి అందలేదు.

ఆమె అంగీకారం లభించడమేమిటి, పతంజలి యిక యీ లోకంలో లేడు. ఏదో ఆలోచన .. ధ్యానం ... ఒకవేపు ఆనందం ఆతృత మరోవేపు ఆందోళన భయం. ఆ ముహూర్తంకోసం నిరీక్షణ- పూజామందిరంలో విగ్రహాల ముందు కూర్చుండిపోయాడు పతంజలి, ఆయుర్వేద గ్రంథాలు తిరగేస్తూ. కాలంగడుస్తూంది - మెల్లగా.

( ఇం కా ఉం ది )

ప్రొఫెసర్ బి. ఆర్. కె. రావు

# పియరో స్రాఫా ఆర్థిక సిద్ధాంత దృష్టి

ఇరవయ్యవ శతాబ్దంలో చాలా వివాదాస్పదుడైన ఆర్థికశాస్త్రజ్ఞుడుగా వెలుగులోవున్న పియరో స్రాఫా ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ స్థాపకనాయకుడైన యాంటోనియో గ్రాంస్కికి మిత్రుడు. బ్రిటిష్ లిబరల్ ఆర్థికశాస్త్రవేత్త సర్ జాన్‌మేనార్డ్ కీన్సు ఆదరాభిమానాల్తో అభివృద్ధిలోకి వచ్చాడు. సోషలిస్టు ప్రవృత్తిగల అభిప్రాయాలు వెలిబుచ్చిన ఉంబెర్టో కాస్మో అనే అధ్యాపకుడు స్రాఫా గురువుల్లో ఒకరు కమ్యూనిస్టు గ్రాంస్కికూడా సోషలిస్టు కాస్మో ఇటాలియన్ సారస్వతంపై యిచ్చిన ఉపన్యాసాలకు హాజరయ్యేవాడు విశ్వవిద్యాలయంలో "ఇటలీ ద్రవ్యోల్బణం - యుద్ధకాలంలోను, తర్వాత" అనే విషయంపై స్రాఫా వ్రాసిన పరిశోధన సిద్ధాంతానికి ల్యూజి ఇనౌజి అనే ఇటాలియన్ శాస్త్రవేత్త, రాజస్వశాస్త్ర నిపుణుడు సంచాలకుడుగా ఉన్నాడు తదుపరి ల్యూజి ఇనౌజి ఇటలీ రిపబ్లిక్‌కు రెండవ అధ్యక్షుడయ్యాడు

## తల్లిదండ్రులు :

వాణిజ్య న్యాయశాస్త్రంలో ప్రఖ్యాతుడైన విశ్వవిద్యాలయాచార్యుడు యాంజెలో స్రాఫా, పియరో స్రాఫాకు తండ్రి కాగా, మాతృప్రాధాన్యతా విధానాన్ననుసరించే 'జ్యూ' కుటుంబానికి చెందిన ఇర్మా టివోలీ పియరో స్రాఫాకు తల్లి పియరో స్రాఫా ఉత్తర ఇటలీ లోని ట్యూరిన్‌పట్టణంలో 5, ఆగస్టు 1898 లో జన్మించాడు

## విద్య - ఉద్యోగం :

1939 నుండి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ఎమెరిటస్ రీడర్‌గా పనిచేసిన పియరో స్రాఫా ఎకడమిక్ సమావేశాల్లోను, వార్షిక మహాసభల్లోను బహు తక్కువగా కన్పించేవాడు. అయినా ఇరవయ్యవ శతాబ్దంలో స్రాఫా రచనలు, రెండు తఖాలు, ఆర్థిక సిద్ధాంతంలో నూతనత్వాన్ని సమకూర్చి ప్రముఖస్థానాన్ని సంపాదించగల్గినవి.

## రికార్డో రచనల పరిష్కరణ :

స్రాఫా ఇటలీలోని ట్యూనిన్ విశ్వవిద్యాలయంలో విద్య నభ్య… కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో రీడర్‌గా పని చేసాడు బాలాకాలం అవివాహితుడుగా కేంబ్రిడ్జి కళాశాలల ఆవరణలో ప్రశాంతంగా పరిశోధన నిర్వహించాడు 1951-73 లో "ది వర్క్స్ అండ్ కరస్పాండెన్స్ ఆఫ్ రికార్డో"ను పరిష్కరించి ప్రచురించాడు రికార్డో అర్థశాస్త్రం మీద స్రాఫా సాధికార పండితుడు, తదుపరి 1960లో కేంబ్రిడ్జి ట్రినిటి కళాశాలలో యిచ్చిన "వస్తు మాధ్యమాల ద్వారా వస్తూత్పత్తి" అనే ఉపన్యాసాన్ని పుస్తకంగా ప్రచురించాడు ఇందులో రికార్డోమీద పరిష్కరించిన గ్రంథం విశ్వవిఖ్యాతి గడించింది

## ఫైనాన్షియల్ మార్కెట్స్, బ్యాంకింగ్ క్రిసిస్ :

1924లో స్రాఫా కీన్సును తొలిసారి కేంబ్రిడ్జిలో కలుసుకున్నాడు ఈ తొలి సమావేశంలోనే స్రాఫా మేధాశక్తి కీన్సును ఆకర్షించింది "ఇటలీ ఫైనాన్షియల్ మార్కెట్స్, బ్యాంకింగ్ క్రిసెస్" మీద వ్యాసం వ్రాయవలసిందని కీన్సు స్రాఫాను కోరాడు. ఆ విషయంపై స్రాఫా వ్రాసిన వ్యాసము రెండు భాగాలుగా విడదీయబడి, ఒక భాగం ఎకనామిక్ జర్నల్ (1922-ఎ)లోను, రెండో భాగం కీన్సు సంపాదకత్వం వహించిన పత్రిక మాంచెస్టర్ గార్డియన్ కమర్షియల్ (1922-బి)లో "రీ కన్‌స్ట్రక్షన్ ఆఫ్ యూరోప్ (కీన్సు సంపాదకత్వం) క్రింద ప్రచురించబడింది. ఈ ప్రచురణ స్రాఫా జీవితంలో ప్రధాన ఘట్టమని చెప్పవచ్చు. అపుడే ఇటలీలో అధికారానికొచ్చిన పచ్చి ఫాసిస్టు రాక్షసి ముసోలిని ఈ వ్యాసం చదివి ఆగ్రహోదగ్రుడయ్యాడు ముసోలినీ కోపం స్రాఫాకు కష్టాల పరంపరను తెచ్చిపెట్టింది. కాని అందువల్ల స్రాఫాకు కీన్సుతో సాన్నిహిత్యం పెరిగింది.

## ఫాసిస్టు బాధ: ఉద్యోగం మార్పులు :

1924లో పెరూగియా విశ్వవిద్యాలయంలో స్రాఫా "ప్రొఫెసర్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి"గా నియుక్తుడయ్యాడు. 1926లో కగ్లియా (సార్డినియా) లో కూడా ప్రొఫెసర్‌గా నియుక్తుడయ్యాడు. కా ఫాసిస్టు పరిపాలన బలపడి చేసే ఘాతుకకృత్యాల బాధలను సహిం లేకపోయాడు. కీన్సు 1927 లో కేంబ్రిడ్జిలో స్రాఫాకు 'లెక్చరర్ ఇ

ఎకనామిక్స్' పదవిని యివ్వగా స్రాఫా అంగీకరించాడు. జీవితాంతం స్రాఫా ప్రపంచ ప్రఖ్యాత ఆర్థికశాస్త్ర పీఠమైన కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో పనిచేశాడు. యూనివర్శిటీ ఉపాధ్యాయుల్ని బాధించేవారికి వినాశనం తప్పదు ముస్సోలిని ద్వితీయ ప్రపంచ సంగ్రామం చివరలో చెట్టుకు వేలాడదీయబడ్డాడు కదా!

## మార్షల్ మీద విమర్శ : విలువ, ధరల మీద సిద్ధాంతాలు :

29 సంవత్సరాల వయస్సులో ఇంగ్లండు వచ్చేసరికే స్రాఫా, అంతర్జాతీయ ప్రమాణాలను అందుకున్న అర్థశాస్త్ర సిద్ధాంతిగా పేరు గాంచాడు. 1925లో ప్రొఫెసర్ ఆల్‌ఫ్రెడ్ మార్షల్ "థీరీ ఆఫ్ ఫరమ్"కు సంబంధించిన ఉత్పత్తితరహా ననుసరించిన ప్రతిఫలాలు వివరణ మీద తీవ్రమైన విమర్శ చేశాడు ఆ వివరణలు తర్కసహేతుకంగా చేయదగ్గ ప్రమేయం తరహాననుసరించే స్థిర ప్రతిఫల ప్రమేయమే నన్నాడు 1926లో వ్రాసిన చక్కటి సంక్షిప్త వ్యాసంలో సంపూర్ణపోటీ నమూనాలో కొట్టవచ్చినట్లు కన్పించే లోపాలను ఎత్తి చూపాడు అప్పటివరకు పారంపర్యంగా వస్తున్న అర్థశాస్త్రం ఆ నమూనానే ఉపయోగించింది. ఏక వ్యాపారసంస్థ డిమాండ్ వక్రరేఖ ఋణాత్మకంగా వంగిపోతున్నప్పుడు, గుత్త విపణివీధి సందర్భాల ప్రాముఖ్యతను, పరిమిత ఉత్పాదనతో తరహా ననుసరించి వచ్చే వృద్ధి ప్రతిఫలాల ప్రాముఖ్యతను నొక్కి చెప్పటం ద్వారా, నూతనమైన, విలువను, చెప్పే సిద్ధాంతాన్ని, ధరలు కట్టే సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన సిద్ధాంతశాఖకు పునాదులు వేశాడు తరువాత ఇంగ్లండులో 1933లో శ్రీమతి జోన్ రాబిన్‌సన్, అదే సంవత్సరంలో అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ఎడ్వర్డ్ ఛాంబర్లిన్ ఆ శాఖను అభివృద్ధి చేస్తూ ప్రచురణలు చేశారు. ఛాంబర్లిన్ వివరణ స్వతంత్రతంగా ఆలోచించి చేసిందే

## వృద్ధి ప్రతిఫలాలపై చర్చ : వాన్‌హయెక్‌పై విమర్శ :

1930లో కేంబ్రిడ్జిలో జరిగిన ఒక ప్రఖ్యాత "సింపోజియం" (ఒకే విషయంపై పలువురు వ్రాసిన వ్యాసాలలోని విషయాలపై చర్చ) లో గెరాల్డ్ షోవ్, డెనిస్ రాబర్ట్‌సన్‌లతో కలసి, "వృద్ధి ప్రతిఫల" లబ్ధిమీద జరిగిన చర్చలో ప్రధానపాత్ర వహించాడు. తదుపరి కొద్ది కాలం తర్వాత ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త ఫ్రెడరిక్ ఎ. వాన్‌హయెక్ (1931) వ్రాసిన సాంప్రదాయబద్ధమైన ద్రవ్య, మూలధన సిద్ధాంతంపై ఆ సిద్ధాంతాన్ని ఛిన్నాభిన్నం చేసే రీతిలో విమర్శ (1932) చేశాడు.

## అపూర్వ రచనల సేకరణ :

తీరిక సమయాల్లో 18వ శతాబ్దపు ప్రముఖ ఆర్థిక, తత్వవేత్తలు వ్రాసిన ప్రముఖ (అప్పటికి అరుదైనట్టిఅపూర్వమైనట్టి) గ్రంథాల మొదటి సంపుటాలను సేకరిస్తూ వుండేవాడు.కొన్నిసందర్భాల్లో కీన్సుతో పోటీపడి, కొన్ని సందర్భాల్లో కీన్సుతో కలసి సంయుక్తంగానూ గ్రంథ ఈ అపూర్వ గ్రంథ సముపార్జనకు పూనుకున్నాడు. డేవిడ్ హ్యూమ్ వ్రాసిన "యాన్ ఆబ్‌స్ట్రాక్ట్ ఆఫ్ ఎ ట్రిటయిజ్ ఆఫ్ హ్యూమన్ నేచర్" అనే గ్రంథాన్ని కీన్సు స్రాఫా కలసి వెతికి బయటకు తీసి 1938 లో ప్రచురించారు. అంతవరకు ఆ గ్రంథం వున్నదనే సంగతి ఎవ్వరికి తెలియదు ఇట్టి కార్యనిర్వహణ స్రాఫా కొక అత్యభిమాన విషయము.

## కేంబ్రిడ్జి ఇచ్చిన అవకాశం :

కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం స్రాఫాకు తన గాఢ వాంఛను నెరవేర్చుకొనే అవకాశం ఇచ్చింది. స్రాఫాకు రికార్డో ఎడ అమిత ఆసక్తులుండేవి "వర్క్స్ అండ్ కరస్పాండెన్స్ ఆఫ్ డేవిడ్ రికార్డో (1951-73)ను పరిష్కరించడానికా విశ్వవిద్యాలయంలో అవకాశం ఇవ్వబడింది ఈ కార్యాన్ని పూర్తిచేయటంవల్ల స్రాఫాకు ప్రపంచ విశ్వవిద్యాలయాల పాండితీ ప్రాంగణంలో అపారమైన ఖ్యాతివచ్చింది. 1930లో ప్రారంభించిన ఈపని ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలోనే గాక 1973వరకు జరిగింది ఈ కార్యనిర్వహణలో ఖచ్చితమైన రికార్డో రచనల్ని సేకరించాడు. వాటిపై చక్కటి చిక్కటి వ్యాఖ్యలు వ్రాసాడు అయన వ్రాసిన తొలిపలుకుల్లోను, ఉపోద్ఘాతాల్లోను నిర్వర్చబడిన విశ్లేషణవల్ల ఆ ప్రచురణలు ఆర్థిక శాస్త్రప్రచురణల్లో విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్నవి సాంప్రదాయ అర్థశాస్త్రానికి స్రాఫా నూతన వాఖ్యలను సమకూర్చాడు రికార్డో రచనలను పరిష్కరించి ప్రచురించడంలో పాండితీ ప్రతిభగల సంపాదకుడిగా పేరు పొందాడు వ్యాఖ్యలోనేర్పును, ఉన్నతప్రమాణంగల వివరణను ప్రదర్శించడం వల్లనే ఆ ప్రఖ్యాతి సంపాదించుకున్నాడు. రికార్డో రచనల సంపుటి సంపాదక వ్యాఖ్యలలో ప్రచురింపబడిన తర్వాత స్రాఫానుండి యింకా కోరదగిందేముందని అనేకమంది అర్థశాస్త్ర పండితులన్నారు.

## 30సం॥ల పైగా పరిశోధనలో :

అయితే తన 62వ ఏట, 1960లో "ప్రొడక్షన్ ఆఫ్ కమోడిటీస్ బై మీన్స్ ఆఫ్ కమోడిటీస్, ప్రెల్యూడ్ టు ఎ క్రిటిక్ ఎకనామిక్ థీరీ" అనే 99 పేజీల ఉద్గ్రంథాన్ని ప్రచురించాడు.

గాలించారు. అయితే ఈ మధ్యనే వెలువడిన అభిప్రాయాలు వేరు ధోరణులను కనబరుస్తున్నవి. 1980 దశకంలోని చివరి సంవత్సరాల్లో స్రాఫా ప్రతి పాదనల మీద నిలబడుచున్న మూలధన సిద్ధాంతంపై జరిగిన చర్చ నూతన సాంప్రదాయ సమిష్టి ఉత్పాదన ప్రమేయాల్లో విసర్జించింది. అయితే ఈ సమష్టి ఉత్పాదన ప్రమేయము దాదాపు వంద సంవత్సరాలుగా ఉపాంత మూల ధన సిద్ధాంతానికి, ఆదాయ పంపిణీకి ప్రాతిపదికగా ఉన్నది. స్రాఫా గ్రంథం ఆధారంగా మార్క్సిస్టులమధ్య జరిగిన చర్చలో చాలమంది మార్క్స్ చెప్పిన శుద్ధక్రమ విలువ సిద్ధాంతాన్ని వర్జించాలని (మారిషిమా 1973 స్టెడ్‌మాన్ అభిప్రాయపడ్డారు

### ముందు ఆలోచనకు మార్గదర్శి

స్రాఫా విశ్లేషణ, ఉపాంత ఆర్థిక సిద్ధాంతంలోను, మార్క్స్ ఆర్థిక సిద్ధాంతంలోను బలంగా పాతుకుపోయిన భావనలపై విమర్శ వాటిని విసర్జించాలనే అభిప్రాయానికి ప్రాతిపదిక కావడము ఆలోచించాలనే ఆసక్తిని కలుగజేస్తోంది ఈ పరిణామాల దృష్ట్యా స్రాఫా గ్రంథ ప్రాముఖ్యతను మదింపుచేయవలసి ఉంటుంది.

---

# నీ కూ - నా కూ మధ్య

## శ్రీ బారు శ్రీనివాసరావు

పూలన్నీ విరగబూసి
అందాలను ఆవిష్కరించినపుడు
మూసుకున్న నా మది గదికి
మౌనం గడి తీస్తుంది.

ప్రమోదాల వెలుగు చూసి
ప్రలోభాలకు లొంగినపుడు,
పరుగులిడే నా తలపులకు
ధ్యానం ముడి వేస్తుంది.

తానుగా అస్థిత్వం లేని భూమే
సూర్యుడి చుట్టూ తిరుగుతుందట
తనలో కాంతి లేని మనిషే
ఇతరులతో మాట్లాడతాడట.

ఇంకా నన్నెందుకు పలకరించవరకు
నీ కేమని చెప్పను నేస్తం ?
నా మౌనం అర్థం కాని నీకు
నా మాట మాత్రం అవుతుందా !

---

డా॥ కొండూరు వీరరాఘవాచార్య

# అక్షర తత్త్వం

మనం మాటాడుకొనే భాష కొన్ని వాక్యాలతో ఏర్పడుతుంది వాక్యాలు కొన్ని పదాలతోను, పదాలు కొన్ని అక్షరాలతోను ఏర్పడు తున్నవి కనుక ప్రతిభాషకూ ఏవో కొన్ని అక్షరాలంటూ ఉండక తప్పదు అయితే అన్నిభాషలలోనూ అన్ని అక్షరాలూ ఉండవు. ఉదాహరణకు ఇంగ్లీషులో ఒత్తులుగల అక్షరాలు– ఖ, ఘ ఇత్యాదులు ప్రత్యేకంగాలేవు వాటిని– కెహెచ్, జిహెచ్ అనే రెండేసి అక్షరాలను జోడించి మనం సృష్టించు కొంటాము అలాగే తెలుగులోకూడ ఈ ఒత్తక్షరాలు లేవు వాటిని సంస్కృతంలో నుండి ఎరువు తెచ్చుకోవాలి. అందుకే ఇంగ్లీషులో 26 అక్షరాలు, తెలుగులో 36 అక్షరాలు మాత్రమే ఉండడం సంభవించింది.

భారతీయుల దేశభాష లన్నిటికీ మూలభాషగా భావింపబడే సంస్కృతానికి మాత్రం 49 లేక 50 అక్షరాలు ఉన్నవి ఇది ఎంతగానో ఆశ్చర్య పడవలసిన అంశం అందుకే సంస్కృత వాఙ్మయ చరిత్ర వ్రాసిన ఆంగ్లేయుడు "మేగ్డొనాల్" పండితుడు తన గ్రంథంలో ఇంత సమగ్రమైన వర్ణసమామ్నాయం సంస్కృతంలో అనాది కాలానే ఏర్పడినందుకు ఎంతో ఆశ్చర్యాన్ని ప్రకటించినాడు

అసలు భారతీయుల సంస్కృత వాఙ్మయం యొక్క దృష్టే విలక్షణమైనదిగా ఉంటుంది మానవుడై పుట్టిన వాడికి ధర్మార్థకామ మోక్షాలనే నాలుగు పురుషార్థాలూ సంపాదించడమే ప్రధాన లక్షణమని ఆ వాఙ్మయంలోని ప్రత్యంశమూ చాటుతూ ఉంటుంది. పురుషార్థ దూరమయిన ఏ అంశానికీ ఈ కర్మ భూమిలో చోటులేదనడం సంస్కృత వాఙ్మయోద్దేశ్యమనే సంగతి సంస్కృత భాషావేత్తలకు చెప్పపని లేదు

అనాది కాలంలో పరమశివుడు లోకోద్ధరణం చేయదలచి తాండవనృత్యానంతరం, తన చేతిలోని ఢక్కను పదునాలుగుసార్లు మోగించాడట అప్పుడా ఢక్క ఇలా మ్రోగిందట –

1 అ, ఇ. ఉ, ణ్ 2 ఋ, ఌ, క్ 3. ఏ, ఓ, ఙ్. 4. ఐ, ఔ, చ్ 5. హ, య, వ, ర, ట్ 6 ల, ణ్ 7. ఞ, మ, ఙ, ణ, న, మ్ 8 ఝ, భ, ఞ్ 9 ఘ, ఢ, ధ, ష్. 10. జ, బ, గ, డ, ద, శ్. 11 ఖ. ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, వ్. 12. క, ప, య్ 13 శ, ష, స, ర్ 14 హ, ల్

ఇవి మహేశ్వరుని నుండి వచ్చినవి కనుక, వీటికి మాహేశ్వర సూత్రాలని పేరు కలిగింది ఈ సూత్రాలను ఆధారంగా చేసికొని పాణిన్యాదులు వ్యాకరణ శాస్త్రాన్ని విస్తరించారు. శివభక్తుడైన నందికేశ్వరుడేమో వీటి తత్త్వార్థాన్ని వివరించాడు వీటిలో మొదటిదైన "అ, ఇ, ఉ, ణ్" అనే సూత్రాన్ని తీసుకొని చూద్దాము ఇందులోని అకారం నిర్గుణ బ్రహ్మస్వరూపానికి గుర్తు ఇకారం చిత్కళాస్వరూపం అంటే ప్రకృతి, మాయ, అవ్యక్తం– ఇత్యాది పదాలతో చెప్పబడుతున్న జగదంబా స్వరూపమన్నమాట. దీనినే సృష్టికి ఉపాదాన కారణమైన పదార్థం అన్నారు సాంఖ్యులు ఋగ్వేదమేమో దీన్ని "తమస్సు" అనే పదంతో పేర్కొన్నది "తమ ఆసీత్తమసా గూఢ మగ్రే" అని ఈ అకార ఇకారార్థముల సంయోగం వల్ల కలిగినదే ఉకారాత్మకజగద్రూప సగుణేశ్వర స్వరూపం అంటే అకారాత్మక నిర్గుణ బ్రహ్మం, ఇకారాత్మక మాయాసంయోగము వల్ల ఉకారాత్మక జగత్తుగా పరిణమించిన దన్నమాట. ఈవిధంగా బ్రహ్మాండతత్త్వం యావత్తూ "అ, ఇ ఉ, ణ్" సూత్రం ద్వారా వ్యక్తమయిందని గ్రహించాలి. ఈ సూత్రాలకు చివర ఉన్న హల్లులు వ్యాకరణ శాస్త్ర ప్రయోజనాలకు ఉపయోగించేవి కాబట్టి వాటిని లెక్కలోనికి తీసుకోరాదు ఇంతకూ తేలిన సారాంశం– అ, ఇ, ఉ అనే మూడక్షరాలు ఈశ్వరునికి, శక్తికి, జీవునికి ప్రతీకలని– ఇంకోదృష్టితో అవి చిదచిదీశ్వరతత్త్వ జ్ఞాపకాలనీ అనుకోవచ్చు. అందుకే భగవానుడు గీతలో "అక్షరాణా మకారోఽస్మి" అని అక్షరాలలో అకారం తనస్వరూపమనే అన్నాడు ఇలా మొదటి సూత్రంలోని మూడక్షరాలవల్లనే నిర్గుణపరబ్రహ్మమూ, జగదుపాదాన కారణమైన మాయ, వాటి నుండి పుట్టిన జగమూ (జీవుడు)అనే తత్త్వత్రయం సువ్యక్తం చేయబడినది.

ఇక రెండో సూత్రంలోని "ఋ" ఌ అనే అక్షరాలు మరల, ఒకటి పరమేశ్వరుణ్ణీ, రెండోది, మాయను (ప్రకృతిని) ప్రకటిస్తున్నది. అంటే అకారం నిర్గుణ బ్రహ్మంకాగా, ఋకారం శుద్ధసత్త్వ ప్రతిబింబిత మాయోపాధిక ఈశ్వరుడని గ్రహించవలె అలాగే "ఌ" కారం కూడ మహదాదులుగా పరిణమించిన ప్రకృతికి చిహ్నమని తెలుసుకోవాలి. కాగా ఈ రెండో సూత్రం మొదటిసూత్రానికి వివరణ ప్రాయమే అవుతుంది.

అసలు ప్రధానములయిన అచ్చులు ఏ భాషలో అయినా అయిదే అయిదు ఉండాలి అవే- అ, ఇ, ఉ, ఋ, ఌ - అనేవి. "ఏ, ఓ, ఐ, ఔ" అనేవి సంధివల్ల ఏర్పడిన అక్షరాలు కాని, ప్రత్యేక వర్ణాలు కావు ఎలాగో చూడండి .- అ + ఇ=ఏ, అవుతుంది; అలాగే అ + ఉ=ఓ, అ + ఏ=ఐ, అ + ఓ=ఔ అవుతుంది కనుక సంధ్యక్షరాలను, అనుస్వార విసర్గలను మినహాయిస్తే మిగిలేవి నికరమైన అచ్చులు అయిదు మాత్రమే దీర్ఘమనేది ప్రత్యేకవర్ణం కాదు. దీర్ఘప్లుతములు రెండూ హ్రస్వముపొందే అవస్థా విశేషాలని శాస్త్రవేత్తలకు చెప్పే పనిలేదు సంస్కృతంలో ఌ వర్ణానిది ఒక ప్రత్యేకస్థానం, అది పరిమితంగానే వాడబడుతుంది

అ, ఇ, ఉ, ఋ, ఌ - అనే అయిదు అక్షరాలూ పృథివ్యప్తేజో వాయ్వాకాశములనే పంచభూతాలకూ సత్తు, చిత్తు, ఆనందం, రూపం, నామం - అనే అంశ పంచకానికిగూడ గుర్తులే. సృష్టి అంతా ఈ అయిదింటిచేతనే జరుగుతున్నదని తత్త్వశాస్త్రం చెపుతున్నదికదా అలాగే సృష్టిలో జరిగే పనులుకూడ అయిదే అవి సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము - అనేవి మనం సృష్టి స్థితి లయములనే కర్మత్రయమునే గ్రహిస్తూ ఉంటాము అలాగే వాటి కర్తలుగా బ్రహ్మ విష్ణు రుద్రులనే ఎన్నుతూ ఉంటాము అది సమగ్రం కాదు లయం తర్వాత, తిరోధానమూ, అనుగ్రహమూ, అనే మరి రెండు కార్యాలు జరిగితేనేకాని పునస్సృష్టి జరగడానికి వీలులేదు ఈ అంశాన్ని అథర్వణవేద భాష్యంలో రుద్రుని "కర్మకృత్" అన్న సందర్భంలో సాయణులిలా వివరించారు "యద్వా సృష్ట్యాదీని పంచ కృత్యాని కరోతీతి కర్మకృత్, ఉక్తంహి—

"పంచవిధం తత్కృత్యం సృష్టిః, స్థితిసంహృతీ,
తిరోభావః, తద్వదనుగ్రహకరణం ప్రోక్తం
సతతోదితస్యాస్య॥ ఏవం మహానుభావో రుద్రః" -

అథర్వ. కాండం 2. సూక్తం 27 మంత్రం 6.

శైవవైశ్వకర్మణ సంప్రదాయములనుబట్టి పంచకృత్యములకు పరమప్రాధాన్యమున్నది. అందుకే శ్రీనాథమహాకవి "కృత్యపంచకము సాగింపలేడే యింతి ప్రాపులేక కృతాంతభంజనుండు" అనినాడు

శైవము పంచకృత్యములకును బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివులను అధిపతులని చెప్పగా, వైశ్వకర్మణ సిద్ధాంతము, బ్రహ్మ, విష్ణు, రుద్ర - ఇంద్రసూర్యులను ఆదినాథులన్నది ఇది నామ భేదమేకాని, సిద్ధాంతమువ్మాత్ర మొక్కటే అందుకే శివవిశ్వకర్మ లిరువురు సద్యోజాత, వామదేవ-అఘోర, తత్పురుష, ఈశానములనెడి పంచాననములు కలవారుగా సంస్కృత వాఙ్మయమున వర్ణింపబడినారు ప్రకృతమునకు వత్తము,

ప్రధానములైన ఆ అచ్చులు అయిదే - క, చ, ట, త, ప అనే వర్గపంచకములకూ, తక్కిన సర్వవర్ణము (అక్షరము) లకూ జనన కారణాలు అయినవి. సృష్టి అంతా పంచభూతాత్మకం అయినట్లు, వర్ణసమామ్నాయం అంతాకూడ పంచాక్షర సముద్భూతమే అని అక్షరతత్త్వం చాటుతున్నది ఆ పంచభూతములనుండే పంచసంఖ్యాకములైన జ్ఞాన, కర్మేంద్రియములూ. మొదలైనవి పుట్టినవి. పంచప్రాణాలు, పంచవిషయాలూ, పంచశిఖలూ ఇత్యాదులు అనేకం ఈ రహస్యాలెన్నో చాటుతున్నవి. ఈ పంచసంఖ్యకు ప్రతీకలుగానే గాయత్రి, విశ్వకర్మ, శివుడు, బ్రహ్మ మొదలైన దేవతలు పంచ ముఖులు కలవారుగా శిల్పంలో చిత్రితులై భక్తులచే సృష్టితత్త్వ వ్యాఖ్యాతలుగా ఆరాధింపబడుతున్నారు. ఈ రహస్యాన్ని చాటడానికే మన హస్తపాదాలకు అయిదేసి వ్రేళ్ళు అమర్చబడినవి పరమేశ్వరుడు ఎంత దయాశాలియో దీన్నిబట్టి తెలుస్తున్నది

మొదటి రెండు సూత్రాలలోని రహస్యాన్నే తరువాతి సూత్రాలు వివరిస్తూ పోయినవి. "హ య వ ర (ట్), ల (ణ్)- వీటిలోని అయిదక్షరములూ మరల పంచభూతాలనే గుర్తుచేస్తున్నవి. లేదా, వాటివల్ల కలిగిన జ్ఞానకర్మేంద్రియాలకు చిహ్నాలని అయినా అనుకోవచ్చు అలాగే "ఞ మ ఙ ణ న (మ్) అనేవి శబ్ద స్పర్శ రూప రసగంధములనే పంచతన్మాత్రలకు (భూతగుణములకు) సంకేతములు "ఝ, భ (ఞ్) ఘ, ఢ, ధ (ష్) ఇవి జ్ఞానేంద్రియములను చెప్తున్నవి. జ, బ, గ, డ, ద (శ్) అనేవి కర్మేంద్రియాలకు సంకేతాలు "ఖ, ఫ,ఛ,ఠ,థ" అనేవి ప్రాణ పంచకమును, "చ,ట,త" (వ్) అనే మూడక్షరాలూ మనస్సు. బుద్ధి, అహంకారములను తెలుపుతున్నవి. 'క, ప (య్) లు మరల ప్రకృతి, పురుషులకు చిహ్నములు. శషస (ర్) లు - రజస్సత్త్వతమో గుణాలకు గుర్తులు హ (ల్) చివరిదైన హల్సూత్రము లోని హకారము మరల ఈశ్వరునికే సంకేతమయినది. ఈ హకారముతో మొదటి సూత్రములోని (అ,ఇ,ఉ,ణ్ లోని) అకారము ను కలిపి ఉచ్చరించినట్లయితే "అహం" అవుతుంది. "అహం" అంటే 'నే'నని సంస్కృతంలో అర్థం. కాగా, ఆద్యంతాక్షరాలకలయికే తానే (అహం) అని తెలుస్తున్నదన్నమాట ఈ అహంలోనే - అంటే నీలోనే సర్వవస్తువులతో కూడిన జగత్తంతా ఉన్నదన్నమాట వర్ణ సమామ్నాయంలో కూడ అకార, హకారముల మధ్య సర్వవర్ణాలు ఉండడం, పైని ఉదాహరించిన మాహేశ్వర సూత్రాలలో గమనించాము కదా ! అలాగే తత్త్వవేత్తకు తనలోనే - సూర్య చంద్ర నక్షత్రాదులతో గూడిన బ్రహ్మాండం అంతా ఉండి సాక్షాత్కరిస్తుందన్న మాట చూడగలిగితే.. బ్రహ్మాండమును, పిండాండం (తన) లో చూచుకొన్న, తత్త్వజ్ఞుడు ఆనందసాంద్రుడవుతాడని సారాంశం ఈ రహస్యాన్నే "అహం విశ్వం భువన మభ్యభవామ్" అని తైత్తిరీయోపనిషత్తు

కొంటున్నది అకారం కారణంగా పుట్టిన జగత్తు, హకారములో మై "అహం, అయి (తానై) మిగులుతున్నదని సారాంశం తన టె (నీ కంటె) భిన్నమయినదేదీ లేకపోవడమే సాధకుడు సాధించ సిన పరమార్థమన్న మాట దీన్ని ఇంకా వివరిస్తే, సర్వాన్నీ గా చూచే యోగ్యత నీకు రావలసి ఉన్నదని తెలుతుంది ఈ వం విశ్వప్రేమ భావనకూ, విశ్వకళ్యాణానికీ, దారితీయదా లేదా! దుకే 'గీత'లోని 'విభూతియోగం'లో భగవానుడు – "ఆది నేనే, నేనే, సర్వమూ నేనే, "మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ంజయ", అని సర్వం తనమయమే అని గానం చేసినాడు. అలాగే ర్వం త్వన్మయం" (నీతో నిండినదీ, నీవే అయినదీ) కావడమే పేక్షితం

సాధారణంగా "నేను, నీవు, అని వ్యవహారం సాగడానికి ఏర్పడిన పదాలలోని "అహం, లో ఎంత తత్వార్థం ఇమిడి ఉన్నదో గమనించాము కదా ఏ భాషలోని అక్షరాలలో నయినా ఇలాంటి రహస్యాలు గోచరిస్తాయా ? రమ్యమైన సంస్కృత భాషలో ఇంతటి విశిష్టార్థాలుండబట్టే దీన్ని "దేవభాష" అని ప్రాచీనులన్నారు. నవుణ్ణి దేవుణ్ణిగా మలచేభాష అన్నమాట గీర్వాణి

ఇప్పుడు మనం దర్శించిన మాహేశ్వర సూత్రాలలో "క్ష, కం లేదు. ఇది "క,ష, ల యొక్క యోగంవల్ల ఏర్పడ్డ సంయుక్తా కం అని అందరకూ తెలుసు. అయినా మంత్ర శాస్త్రజ్ఞులు క్షకా న్ని గూడ ప్రత్యేక వర్ణంగా లెక్కపెట్టుకొన్నారు ఆధారాది షట్చ ల మీద ఈ అక్షరాలను విభజించి ఒకానొక ప్రత్యేకసాధన విధా న్ని ఆదేశించినారు ఆధారం మీద నాలుగు, స్వాధిష్టానమున ఆరు, ణిపూరకమున పది, అనాహతమున పన్నెండు, విశుద్ధ చక్రంమీద హారు – ఇప్పటికిమొత్తం 48 అయినాయి. ఇక ఒక్క హకారము త్రమే మిగిలింది. అలాగే ఆజ్ఞా చక్రం ఒక్కటే మిగిలింది. ూమధ్య స్థానమున రెండు దళాలు కలిగిన ఆజ్ఞా చక్రం ఉన్నది. ని రెండు దళాలమీద – "హం, క్షం, అనే రెండు అక్షరాలను చేర్చి ఉపాసించమన్నారు అక్షరోపదేశకులు ఒక్కొక్క చక్రమునకు ఎన్ని దళాలు ఏందువలన ఉండవలసి వచ్చినదీ, ఆయా అక్షరాల ఉపాసన వల్ల కలిగే ఫలితాలూ మదీయయోగ దర్శనంలో వివరించబడి ఉన్నవి.

అసలు అక్షరాలు అని వర్ణాలకు పేరు పెట్టడంలోనే సంస్కృత భాష గొప్పదనం తెలుస్తున్నది క్షరమంటే నశించేది అక్షరమంటే నశించక శాశ్వతంగా ఉండేది మన సనాతనుల దృష్టిలో ఈ అక్షరాత్మకమైన వేదం (జ్ఞానం) నశించేది కాదు జగత్తులు ప్రళయకాలంలో నశించి మరల పుట్టుతూ వుంటాయి వేదం మాత్రం అలా నశించదని మన వారి విశ్వాసం కనుక ఈ అక్షరాలు నశించేవి కావు" అని అక్షరశబ్దోత్పత్తి ప్రకారమే చెప్పతున్నది వైయాకరణుల దృష్టిలో శబ్దం నిత్యం కూడాను. అలాంటి శబ్దం (ధ్వని) తో ఏర్పడ్డ అక్షరాలు కూడ నశించడమంటూ ఎలా సంభవిస్తుంది ? అందుకే వాక్కును – పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరులని నాలుగు రీతులుగా శాస్త్రం చెప్పింది. పరా, వాక్కు మూలరూపం, పరమార్థమయినది వైఖరి మనం ఉచ్చరించే వర్ణాత్మక శబ్దం వైఖరిని తొలిమెట్టుగా ఉపాసించి పరావాక్తత్వ పారమ్యాన్ని పొందడమే అక్షరోపాసకుల లక్ష్యం మళ్ళీ ఇదంతా ఒక తాత్విక జగత్తు దీన్ని ఇప్పుడు కదలించవద్దు. గీత 15వ అధ్యాయంలో "క్షరాక్షర పురుషవివేకం" వివేచించబడ్డది కడకు క్షరాక్షరాలను దాటిన "పురుషోత్తమ ప్రాప్తి" జీవితలక్ష్యం అంటాడు భగవానుడు. ప్రతి పురుషుడూ పురుషోత్తముడు కావడానికే జగత్తులోనికి అవతరించడం. అలా అవతరించినాక, తగిన సాధన చేసుకుంటూ క్షరాన్ని దాటి అక్షరతత్వం అవగతం చేసుకోవలసి ఉన్నది ఆ పైమాచే పురుషోత్తమత్వ ప్రాప్తి అనేది. దానితో ప్రయాణానికి పరిసమాప్తి "సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్, అప్పుడే సంస్కృత వాఙ్మయ పరమ లక్ష్యమైన తురీయపురుషార్థాన్ని సాధించినట్లు ఇదే భారతీయ సంస్కృతికి పరమ లక్ష్యం. అక్షరాలు మొదలుకొని అనేకంగా ఉన్న గీర్వాణ వాఙ్మయ మంతా ఇందుకు సోపాన ప్రాయమే. స్వస్తి

---

గమనిక :

అక్టోబరు భారతిలో "నామ మహిమ" గ్రంథ సమీక్ష పడినది.
ఈ పుస్తకాన్ని ప్రచురించినవారు శ్రీ గోదా గ్రంథమాల వారు.

— సం॥

# స్వీయ మానసికవాదం

మృత్తికణాల పరిణామంలో
జీవాణువుల వికాసం చిగురాకుల మొలక
రాయీ సున్నం ఇటుకల్లు పేర్పడంలో
మానవ స్వేదాణువుల జీవాధారం
పంచభూతాల ప్రతినిధి మెదడు
జీవకణాలలోంచి అల్లుకునే ఆలోచనలు
ఎవరివైతేనేమి ? ఎక్కడివైతేనేమి ?
ఉపనిషత్కాలం నేర్పించిన ప్రశ్నలనుంచి
మార్క్స్ మేల్కొలిపి నిలిపిన యధార్థాలదాకా
కాల పరీక్షకు నిలువలేనిదంతా —
"స్వీయ మానసిక ధోరణి" !
జీవితానుభవాల ప్రాపంచిక దృక్పథం
నిత్యనూతన సమవ్యవస్థా నిర్మాణంలో
ఏమాత్రం శాస్త్రీయం కానప్పుడేకదా
స్వీయ మానసిక వాదం ?

# నగరాల కట్టడాల-మధ్య

మైదానాల మైళ్ళ పొడవునా
నదులకు నడక నేర్పిన
ప్రవాహాలకే ప్రహరీలు నిర్మించే నగరాల్లో
గోడలు కరుణిస్తే మిగిలిన ఖాళీస్థలాల్లో
బాల్యానికి ఈ కాస్తా స్వేచ్ఛ !
సినిమాహాళ్లు ప్రార్థనా మందిరాల
నవీన భవన నిర్మాణ కళల్లో
తన్మయులైన నాగరీకుల్లో
తలదాచుకోలేని జీవులబతుకు
ఇప్పటికీ అధ్వాన్నపు అడవి —
చలిలోపలి వెచ్చదనపు కోరిక
చెమటగా పిండే వేడిలోని చల్లదనం
తొంగిచూసే ఈనాగరిక కట్టడాలలో
విశ్వవిశాలంగా సాగే మార్గాలలో
అనంతంగా — అంతర్గతంగా
సౌందర్య సృష్టి వాంఛా తృప్తి
విధ్వంసనం వెనుకాలే ఉద్భవం !

# మానవనౌక

చచ్చేదాకా బతికేయడమే,
నిజంగా జీవిత రహస్యమైతే
ఎక్కడో వెతకడం దేనికి ?
కష్టాల కడలి కెరటాలను
నిలువునా చీల్చి
సుందర సుదూర తీరాల వైపు
నిరంతరం సాగే
మానవ నౌకల్లోనే
నిక్షిప్తమైవుంది జీవన ఇంధనం

# "అమృతసరస్సు"లో రక్తకెరటం

జీవాధార నీరు
నాలుగు శతాబ్దాల సరస్సుగా
స్వర్ణకాంతులీనే ఆలయంచుట్టూ
గురబానీ శబ్దతరంగాల స్పర్శతో
కదలీ కదలని విశ్వాసపుటలలు !
తీరని ప్రజాసమస్యల
రాజకీయాల చదరంగంలో
మతాన్ని ఆవహించిన తుపాకులు
ఆదిమ తెగల వారసత్వంలో
హింసలో మార్మోగుతున్న చేతులు
గెలిచినవాడిదే రాజ్యం !
అమాయకుల కన్నీళ్ళ దీనత్వం
కావాల్లన్నది ఎలాగైనా సాధించాలనే పట్టుదల
ప్రతీకారవాంఛకు బలి
తొణకని సరస్సులో అలజడి !
పరిపాలనా అసమర్థతలో
స్వప్రయోజనాల వలయంలో
విముక్తిని కోరే జాతుల సమస్యలో
అపుడపుడు ప్రేలే జనతరంగం !
రాజీపడి ఆగి - ఆగి
హింసా ప్రతిహింసల మలుపులో
నెత్తుటి అలలమధ్య
"అమృతసరస్సు"లో అల్లకల్లోలం

శ్రీ నిఖిలేశ్వర్



# అమ్మ

ఇచ్ఛాపురపు రామచంద్రం

గదిలోకి – భారంగా వొస్తున్న అడుగుల చప్పుడుకి – కిటికీ నుంచి ఇటు తిరిగింది ప్రియ "డాక్టర్ !"

ఒక్క క్షణం అగ్ని పరీక్ష నెదుర్కొంటున్నట్టు తడబడి – అంతలోనే పెదవుల మీదికి బలవంతంగా చిరునవ్వు తెచ్చుకుంది శారద కానీ అది ఎంతమాత్రమూ సహజంగా లేదు.

"రిపోర్టులు ఏం సూచిస్తున్నాయి ?" ప్రియ కంఠంనిండా ఆత్రతే. డాక్టర్ శారద ఆమెకు చాలా దగ్గరగా వొచ్చి భుజం మీద చేయి వేసింది ధైర్యం చెబుతున్నట్టు "ప్రియా ! మీరేమీ కంగారు పడనక్కరలేదు, దిగులూ పెట్టుకోనక్కరలేదు, ఈదేశంలో పిల్లల కేమీ లోటు లేదు. ఎప్పుడు కావాలంటే అప్పుడు ఎవరిని కావాలంటే వారిని ఎందరిని కావాలంటే అందరిని హాయిగా పెంపకానికి తీసుకోవచ్చు నిర్మొహమాటంగా నిజం చెప్పాలంటే ప్రసవమనేది స్త్రీకి బాధాకరమైంది, పునర్జన్మ, జీవన్మరణ సమస్యే ప్రతికాన్పూ. తీరా యిన్ని బాధలూ పడి కంటే – ఆ బిడ్డ కోరుకున్న అబ్బాయే ఔతాడో, కోరుకోని అమ్మాయే ఔతుందో ? వికలాంగులే ఔతారో, వికృత రూపులే ఔతారో ?" అంది

"డాక్టర్ !" భరించలేనట్లరిచింది ప్రియ. అప్పటికే ఆమె కంతా తెలిసిపోయి, కళ్ళనిండా నీళ్ళు నిండిపోయి.. ముఖం ఎర్రగా ఐపోయింది "నేను – చిన్నపిల్లను కాను డాక్టర్, అందని ద్రాక్షలు పుల్లన అని మభ్య పెట్టడానికి నాకు జీవితం తెలుసును ఎంత అంద

మధుకూ అబద్ధాలతో నన్ను మోసం చేయలేవు. నిజం చెప్పెయ్యండి సూటిగా" తీవ్రమయిన స్వరంతో అడిగింది.

ఇక విధి లేనట్లు ప్రియా! మీరు బిడ్డల్ని కనలేరు" అందామె అంతే. ప్రియ ఒక్కసారి విరుచుకు పడిపోయింది. అత్యంత విషాద భయంకరవార్త విన్నట్లు రెండు చేతులతోనూ ముఖం కప్పుకుని భోరున ఏడ్వసాగింది "భగవాన్" ఎందుకు నా మీద నీకింత కోపం? నేనేం నేరం చేశానని యీ శిక్ష వెంబడి శిక్ష? నేనేమీ కోరరాని కోరిక కోరలేదే పురుషులతో సమానత్వం కోరలేదే! మిగిలిన స్త్రీల లాగే ఉండాలనే కదా నేను కోరుకున్నది? అదీ అత్యాశేనా? ప్రకృతి - స్త్రీకి నిర్ణయించిన - సృష్టిని సాగించడానికి అనర్హురాలినీ అసమర్థురాలినీ అయిన నేనింక బ్రతికేం ప్రయోజనం?" డాక్టర్ శారద - విపరీతమయిన దుఃఖంతో ఎగసిపడుతున్న ఆమె వెన్నుమీద జాలిగా చేయి వేసి నిమురుతూ "దయచేసి ఊరుకోండి ప్రియా. నేను మీకు పెంచుకుందుకు మంచి పిల్లల్ని చూస్తానుగా అమ్మాయి కావాలంటే అమ్మాయి అబ్బాయి కావాలంటే అబ్బాయి ఇద్దరూ కావాలంటే యిద్దరూ అందమయిన . ఆరోగ్యమయిన "

"వొద్దు!" గట్టిగా అరిచింది ప్రియ ' నేను కనలేకపోతే నాకు పిల్లలే వొద్దు అంతే కాని - నేనెవరినీ మాత్రం పెంచుకోను నా చేతులతో నేను మరో లేత జీవితాన్ని దుర్భరం చెయ్యను. నా జీవితం లాగా మళ్ళి మరొక జీవితం కాకూడదు."

అర్థం కానట్లు ఆశ్చర్యంగా . ఆమెవేపు చూసింది శారద

* * * *

అప్పుడే పనులు పూర్తిచేసుకుని . . ఎండకు ఉస్సురంటూ. మేను వాల్చబోతున్న కాత్యాయని కాల్ బెల్ విని - చిరాకుగా వెళ్ళి తలుపు తీసింది

తలుపవతల - పదిహేడు - పద్దెమినిదేళ్ల అమ్మాయి తేరిపార చూస్తూ.

"చందాలకా?" విసుగ్గా అడిగింది కాత్యాయని.

ఆమె మౌనంగా - ఆపాద మస్తకమూ చూస్తూ మౌనంగా ఉండిపోయింది.

"ఉద్యోగ సిఫార్సుకా?" కొంచెం గట్టిగా అడిగింది.

కాదన్నట్లు తల అడ్డంగా ఊపిందా అమ్మాయి ఆమె ముఖం మీద చిరునవ్వు ఏదో ఆశరదం . ఉక్కిరి బిక్కిరి

మరేం కావాలి?" కోపంగా చూసిందావిడ ఆమె ప్రుళ్ళిపడి తేరుకున్నట్లు మం . చి . నీ . ళ్లు . " ఎలాగో గొణిగింది. తెల్లబోయింది కాత్యాయని. "ఈ మాత్రం దానికి మంచినీళ్ళకి.... ఇంతవరకూ వొచ్చి తలుపు తట్టి పిలవాలా! రోడ్డు పొడవునా హోటళ్ళు... షోడా షాపులే "

"నన్ను కొంచెం లోపలికి రానిస్తే . ."

ఆవిడ - అవతల ఎండను చూస్తూ తలుపు పూర్తిగా తెరిచింది ఆ అమ్మాయి లోపలికి వచ్చి కూర్చుంది మంచినీళ్లు వొచ్చేలోగా అగదినంతనీ అపరిమితాసక్తితో కలయజూడసాగింది. చాలా ... మయిన అమ్మాయి . . అనుకుంటూ మంచినీళ్లిచ్చి - నీ పేరు ... గిందావిడ కేవలం యధాలాపంగా

"నాకు తెలియదు మీకే తెలియాలి." ఆ మాటలు పరిహాసంగా అన్నట్లు లేవు మనస్ఫూర్తిగా అన్నట్లే ఉన్నాయి.

పిచ్చిదేమో అనుకొని జాలిపడుతూ - "సరే. మంచినీళ్లు తాగావుగా యిక వెళ్లు" అందావిడ

"నేను - వెళ్లడానికి రాలేదు ఇక్కడ ఉందామనే వచ్చాను కష్టపడి వెదుక్కొని ఇక్కడే ఉండిపోతాను "స్థిరంగా అంది ఎవరీ అమ్మాయి? ఏమిటీ మాటలు? తన మధ్యాహ్నపు నిద్ర చెడగొట్టేందుకే దాపరించిందా యీ పిచ్చివేషం ?

"పోనీ కదా అని లోపలికి రానిస్తే - ఏమిటీ ఆగడం" ... గద్దించింది కాత్యాయని.

ఆ అమ్మాయి - నవ్వింది "అమ్మా! నన్నే పొమ్మంటావా నా ముఖం సరిగా చూడు నీ కంతా జ్ఞాపకం వొస్తుంది ... నాకు నువ్వేం పేరు పెట్టావో . . అన్నీను. నన్నెలా మరచిపోగలవు అమ్మా!" ఉలిక్కిపడింది కాత్యాయని ఆ పిలుపు . . మాటలు ... ముఖం . ఎక్కడో పేగు కదులుతున్నట్లు గుండె మూలల్లో చిన్న కదలిక

"నేనమ్మా! నేను. నేను - దురదృష్టవంతురాలిని. నిర్భాగ్యురాలిని. లేకపోతే పుట్టగానే అమ్మ కెందుకు దూరం చేయబడతాను ఇన్నాళ్ళూ అమ్మ వొడిలో కాక ఎక్కడో ఎందుకు పెరుగుతాను అమ్మాయి కళ్లనిండా నీళ్లు గొంతునిండా గద్గదికత. "అమ్మా నిజంగా నేను జ్ఞాపకం రావడం లేదూ? నన్ను మరచిపోయావా వొద్దనుకున్న కొద్దీ ముల్లులాగా హృదయంలో పొడుస్తోంది జ్ఞాపకం భయంకరమయిన . . ఇన్నాళ్లుగా హృదయపేటికలో సమాధి చేయబడినగతం కాని . అంతలోనే . వర్తమానం, వాస్తవం.

"నువ్వెవరో నాకు తెలియదు" మొండితనం తెచ్చుకు మనసులో - కనీసం ఒక్కసారైనా అందాల అమ్మాయిని "పాపా" కౌగిలించుకోవాలని ఎంత పీకుతున్నా.

అమ్మాయికి యింకా చాలా దుఃఖం వొచ్చింది ఉప్పెనలా ఆమె తీవ్రమయిన . . అనంత మయిన . . ఆశాభంగం చెందినట్లుంది. అయినా - ప్రయత్నాన్ని వదల కుండా - "నేను - నీ పెద్ద

...కాదుకదమ్మా? అమ్మా! .. నాకు చెల్లెళ్లెందరు! తమ్ముళ్ళెందరు ...లా ? ఏం చదువుతున్నారు ?". అర్థించాలా అడిగింది. ...ని అభావంతో మిగిలి ఉండడానికి శాయశక్తులా ప్రయత్నిస్తోంది. ...ధైర్యం నటించబోతూ ఓడిపోతూంది. నిజానికి ఆమె ...లో అగ్ని జ్వాలలా రేగుతున్న సంఘర్షణ. స్త్రీకి-ఇల్లాలికి అమ్మకి-ఆడదానికి మధ్య

...చిట్టచివరి అస్త్రంలాగ- వినియోగించిందా అమ్మాయి తన మాట ...చూచి చూచి, "అమ్మా జ్ఞాపకం తెచ్చుకో. నన్ను మోసగించకు నిన్ను మోసగించుకోకు, సుమారు పదిహేడేళ్ళ క్రితం విశాఖ ...లో . దుర్గా నర్సింగ్ హోమ్‌లో నీ బి. ఏ. సెకండియరులో . నన్ను .. కనలేదూ?"

అంతే కాత్యాయని- మొదలు నరికిన వృక్షంలాగ పట్టుతప్పి ...ంది. నిర్వికారాలయింది. తనలోని సంఘర్షణ- ఆవేదన ఆరాటం ...ప్పుకోలేనట్లు ఒక్కసారా అమ్మాయి మీదకు కొంచెం వాలి.. ...ను హఠాత్తుగా హృదయానికి.. గాఢంగా.. ప్రేమగా.. ఆప్యా...గా కౌగలించుకొని ఆమె శిరస్సుమీద కన్నీరు కురిపించింది. ఒక్క...ణం. మళ్ళీ ఆవిడలోకి వాస్తవమూ . దానితో పాటే ఆపాదించు...న్న కాఠిన్యమూ వొచ్చేశాయి "నాకేమీ తెలియదు." అందామె ...కి గొంతుకలోకి వొచ్చేస్తూంటే.

...కఫకా నవ్వింది అమ్మాయి. "ఇంకెందుకమ్మా? నువ్వు ...పోయావు. మా అమ్మ మంచిది. అబద్ధాలాడడం చేతకాదు".

కాత్యాయని ఒక్కసారి బిరువులా నిలువెల్లా వొణికిపోయింది. ...పాపకేమని చెప్పగలదు తను యిప్పుడు? ఆమె ఏం అర్థం చేసుకో...ని? నిజం చెప్పినా ప్రమాదమే, అబద్ధం చెప్పినా ప్రమాదమే. ...? ఎలాగ యీ అమ్మాయిని సున్నితంగా వొదిలించుకోవడం ? ...దూ యిలాగే. వొదిలించు కుందుకు .. ఎంత బాధపడవలసి...ంది?

పదిహేడేళ్ళ క్రితం.. తనకి పద్దెనిమిదేళ్లు. బి. ఏ. రెండో ...సంవత్సరంలోకి రాబోతూ- సుధాకర్ ప్రేమలోపడి- మరీ స్వేచ్ఛగా ...ంచి- గర్భవతి ఐంది. పెళ్ళి జరుగుతుందన్న ఆశతో ఎదురు...- చివరి నిముషంలో కథ అడ్డం తిరిగే సరికి- తప్పని సరి అయి ...ను కని- డాక్టరు సలహామేరకు- ఓ మంచి దంపతులకి... పిల్లల...ం తపించిపోతున్న వాళ్ళకి బాధగా... విరాగిలా యిచ్చేసి- ...కి వెళ్ళిపోయింది. ఇక తనకు పెళ్ళియోగమే లేదనుకుంది. ... జరిగాక కాని... మూడేళ్ళకు... మళ్ళీ మలుపు తిరిగి... ...రే తనని వివాహం చేసుకున్నాడు ! తన జీవితం ...లో పడిపోయింది. సంసారపు గాడిలో... ఉండీ ఉండీ తన పాప జ్ఞాపకం వొస్తూనే ఉండేది. కాని... అన్నీ తెలిసిన సుధాకర్ ఆ విషయమే ఎత్తకపోయే సరికి.. తనకి బయట పడడానికి ధైర్యం చాలేది కాదు గుండెలలోనే దాచుకుని కుమిలిపోయే ఉత్తమ యిల్లాలుగా మారిపోతూ వొచ్చింది సుధాకర్ సహచర్యంలో. మగవాడి బలహీనతా పిరికితనమూ స్వార్థమూ తనకి బాగా తెలుసు. వివాహం కాకముందు- పెళ్ళిచేసుకోబోయే స్త్రీకే కన్నా, ఆ సంతానాన్ని తన దాంపత్య జీవితంలోకి ధైర్యంగానూ మనస్ఫూర్తిగానూ ఎంతమాత్రమూ ఆహ్వానించలేడు. ఈ విషయంలో స్త్రీకంటె పురుషుడే ఎక్కువ భయపడతాడు సమాజం గురించి. ఈ పురుషస్వామ్య వయసులో ఆను...శ్యాగాలు చేయవలసిన అగత్యమూలేదు.

భర్తకు వేళకి న్నీ అమర్చుతూ- పిల్లలని పెంచుకుంటూ దినందిని నిర్వహించుకుంటూ నిజంగా తను పక్కా- యిల్లాలై- స్త్రీగా, వ్యక్తిగా, తన అస్తిత్వాన్నే మరచిపోయిందేమో! ఇప్పుడు- తనలో ఏమయినా మిగిలి ఉందా తను అంటూ? ఇన్నాళ్ళ... యిన్నేళ్ల అనంతరం వొచ్చి- తనదగ్గరే ఉండిపోతా నంటూందీమె ఇది ఎలా సాధ్యం ?

"నువ్వొక్కడుంటున్నావు పాపా?"

"పాప!... నువ్వు నాకాపేరేనా పెట్టావు! ఎంత మంచిపేరు. అ... మరే నేను- నన్ను వాళ్లు పెంచుకుంటున్నారు నీకు తెలియదూ?

"వాళ్ళు నిన్ను సరిగా చూడటం లేదా?" ఆ ప్రశ్నలో అర్థం వేరు

"అలా అనుకుంటే కళ్లు పోతాయి. మమ్మీకి డాడీకి నేనంటే చెప్పలేనంత ప్రేమ. నా చదువు... వివాహం- భవిష్యత్తు- అన్నిటి కోసమూ ముందే జాగ్రత్త పడి కూడబెట్టారు తెలుసా ? నన్నెంత ముద్దుగా చూసుకుంటారని! నేనంటే వాళ్ళకి పంచప్రాణాలూ ... చక్రాల్లాటి కళ్ళు పెద్దవి చేసి మరీ చెప్పింది. .

"అయితే యికనేం? '

ఆ మాటకు దెబ్బతిన్నట్లు గిలగిలలాడిపోయిందా అమ్మాయి.

అమె దుఃఖం ఆపుకోలేక పోతూంది. ఐనా ఎలాగో- నాకు వాళ్ళంటే చాలా ఇష్టమే- కాని- అమ్మ! ఎంత ప్రేమగా చూసినా పెంచిన తల్లికి కన్నతల్లికి భేదం ఉండదూ? నువ్వంటే నాకు మరీ యిష్టమమ్మా నాకు ఊహ తెలిసినప్పటినుంచీ అసలమ్మగురించే ఆలోచిస్తూ ఉండేదాన్ని.

నేనెవరిని? నేనెక్కడి నుంచి వచ్చాను? మా అసలమ్మ నన్నెందుకు వొదిలేసింది? అమ్మ ఎలా ఉంటుంది? ఎక్కడుంటుంది? నాకు కనపడదే? నేనేమయినా తప్పు చేశానా శిక్షిస్తోందిలా? ప్రతిరాత్రీ. నిద్రపట్టనంతవరకూ ఏవేవో సందేహాలు- తప్పుచేశానేమో అన్నభావం

కోపం- జాలి- దుఃఖం- ఒంటరితనం- విసిరివేయబడినట్లు అయోమయంగా- అలా అంతలోనే ఉహూ- కాదేమో- అమ్మకూడా నాలాగే నేనామెను అన్వేషిస్తున్నట్లు ఆమె నాకోసం దయగా వెదుకుతూ నా కోసం పరితపిస్తూందేమో ఎక్కడో ?

లేదు పాపా లేదు. నేను కఠినాత్మురాలను. పాపిష్టిదానను. నేను నీకోసం పరితపించలేదు. వెదుకలేదు. నిన్ను మరచి పోదామనే ప్రయత్నించాను. నీకు దొరికిపోతానేమో అనే భయపడ్డాను. నువ్వు నాకోసం వెదుకుతూంటే నీకు కనపడకుండా ఉండాలని దొంగలా దాక్కుంటూ వొచ్చానిన్నాళ్లు. కాత్యాయనికి కన్నీ రాగడం లేదు. పాపమీద జాలితో ఆమె హృదయం ప్లావితమై పోతూంది. ఆర్ద్రమైపోతూంది. కరిగి పోతోంది. నేను దురదృష్టవంతురాలిని. స్వార్ధపరురాలిని. రాక్షసిని నేను నీకు పేరు పెట్టలేదు. ఎత్తుకుని లాలించలేదు. ముద్దాడలేదు. పెంచలేదు. పాలివ్వలేదు. నేను పరమ పాపాత్మురాలిని.

"చివరకు మమ్మీ, డాడీ, వాళ్ళే నా పరిస్థితి చూడలేక యిష్టం లేక పోయినా సహాయం చేశారు. విశాఖపట్నం నర్సింగ్ హోమ్, నువ్వు చదివిన కాలేజి- నీస్నేహితులు, రికార్డు ఎన్నికష్టాలు పడితేఏం నిన్ను చేరగలిగాను. ఇంకనాకు బాధలేదు. భయం లేదు. ఔను కదూ అమ్మా? మనం కలుసుకో గలిగాం!"

గజగజ వణికిపోయింది కాత్యాయని. ఆ అమ్మాయి ఆశగా, సూటిగా తనవేపు చూస్తుంటే ఆ కళ్ళల్లోకి చూడడానికి ధైర్యంచాలనట్లు పిరికి దానిలా తలవంచేసుకుంది.

నాకేమీ ఆనందంగాలేదు పాపా! మనం కలుసుకున్నందుకు నేను చాలా విచారిస్తున్నాను. మానుతున్న, మానిపోయిన గాయం మళ్ళీ రేగిందే అని బాధపడుతున్నాను. నేను - గృహిణిని. అందుకే భర్త కోసం, పిల్లలకోసం, సంసారంకోసం, సమాజంకోస, భద్రతకోసం, భవిష్యత్తుకోసం, పరువుకోసం, పేరు, ప్రతిష్టకోసం, నీ నుంచి చాలా దూరంగా వెళ్ళిపోవాలనే నా సంకల్పం.

"నేనిక్కడే . . నీ దగ్గరే . . ఉండిపోవద్దూ! అమ్మా ?"

అమ్మో !.. నువ్వు నాతో ఉంటావా ! వొద్దొద్దు. నువ్వెవరని నలుగురూ అడిగితే - ఏం చెప్పేది ? పెళ్లికాకముందు నిన్ను కన్నానని తెలిస్తే నా పరువేమౌతుంది నలుగురిలోనూ ? నా గౌరవం .. మర్యాద . . ఏం కావాలి ? నీ తమ్ముళ్లు చెల్లెళ్లు . . బహుశా మీ నాన్నగారి దృష్టిలో కూడా నేనెంత చులకనయిపోతానో . . యీ ఇంట్లో నా స్థానమేమయి పోతుందో, నలుగురిలోనూ నా బ్రతుకేమై పోతుందో.

వొద్దు . . నువ్విక్కడింక ఒక్క క్షణం కూడా ఉండ నా అసహాయతనూ అశక్తతనూ ఎత్తిపొడవొద్దు. నా గుండెను కలు చెయ్యకు. చిత్రవధ చెయ్యకు. నీకు - చిన్నదానివయినా లెత్తి నమస్కారం పెడతాను. నా బ్రతుకుని బద్దలు చెయ్యకు. ప వెళ్లిపో.. అమాయకపు పాపా ! ఈ అమ్మ నువ్వనుకున్నట్లు దే కాదు. నువ్వాశించినట్లు ప్రేమమూర్తి కాదు. వొట్టి స్వార్థపరుర పిరికి పంద. త్యాగమూర్తి కాదు.

ఒక్కసారామె ముఖం మారిపోయింది. మనిషే మారిపోయి

"ఎక్కడో . . ఏదో . . పొరపాటు జరిగింది. నువ్వు భ్ర పడ్డావు. వేగంగా మీ మమ్మీదగ్గరకి డాడీ దగ్గరకి వెళ్ళిపో. వా నువ్వంటే ప్రాణం. ఇప్పటికే నీ కోసం కంగారుపడుతుంటార

"అమ్మా !" అంతేనా అన్నట్లు ఏడుస్తూ చూసిందా అమ్మా ఆమె కాళ్లకి చుట్టుకుపోతూ చిన్నపిల్లలాగ.

"ఏమిటిది ?.. ఎవరయినా వొస్తారు. చూస్తే - అర తీస్తారు. చిన్న పిల్లవి . . లోకం తెలియని దానివి. నీకు తెలియ వెళ్లిపో. సుఖంగా ఉండు." ఆమెను విదిలించుకుంది కాత్యాయని.

నీకు తెలియదు పాపా . . తెలియదు. నిజంగా నేను సుఖమే కోరుతున్నాను తల్లిగా. దూరంగా - ఇద్దరమూ సుఖం ఉండగలం. దగ్గరయితే యిద్దరికీ అన్నీ సమస్యలే. అందుకే . .

"అమ్మా !"

"గెటౌట్ . " అరిచిందామె ఎంతో ప్రయత్నించి . . మన చంపుకుని. ఆ అమ్మాయి త్రుళ్లిపడి . . చాలా తీవ్రమయిన ఆ భంగం చెందినట్లామె వంక ఎంతో ప్రార్థనాపూర్వకంగా చూసి . ఆశా లేశమయినా లేని .. నిరాశనిండిన గుండెతో . . గత్యంతరంలే బయటకు కదిలింది. ఏడుస్తూ . . మమ్మీ డాడీలను చేరుకుంది.

"నాకే లోటూ లేకపోయినా . . సర్వసౌఖ్యాలూ అనుభవిస్తున్నా ప్రాణాధికంగా ప్రేమించే మమ్మీ డాడీలున్నా - ఎన్నో రాత్రు నిద్ర మానుకుని - అసలమ్మ కోసం ఎంతలా ఆలోచించేదాన్ని ఆమె కోసం ఎంత తహతహ లాడేదానిని. ఎంత వెర్రెత్తి పోయేదానిని చెప్పండి డాక్టర్ ! . . రేపు నేనూ ఎవరినయినా పెంచుకుంటే, ఆమాయకులూ నాలాగ అంత నరకమూ అనుభవించరూ అసలమ్మ కోసం ? తెలిసీ ఎలా విధించేదాశిక్ష మరో జీవికి ?" చాలా సెన్సిటివ్ అనుకుంటూ - ప్రియకు - కొన్ని గంటలవరకూ గాఢంగా నిద్రపట్టే యింజక్షనిచ్చి వెళ్లిపోయిందా గదిలోంచి డాక్టరు శారద.

శ్రీ యస్. యల్. యస్. ఆచార్య

# మన ప్రాచీన శాసనాలు స్థాపించుటకు గల కారణాలు

ప్రాచీన పురాణాల కాలానికే ఆంధ్రులు, ఆంధ్రదేశం ప్రసిద్ధి గాంచినా నాటి ప్రజలుగాని, పాలకులుగాని, వేయించిన శాసనాలు కనిపించలేదు. ప్రస్తుతానికి లభ్యమౌతున్న శాసనాలన్నీ అశోక చక్రవర్తి సమకాలీనాలు, ఆనంతరికములు.

సాధారణంగా శాసనాలు, శిలాశాసనాలు, తామ్రశాసనాలు అని రెండు విధాలుగా కనిపిస్తున్నాయి. రజత శాసనము (తంజావూరు విజయరాఘవ నాయకునిది) అయన స్తంభ శాసనము (ఢిల్లీ పాతకోట లోనిది) వంటి శాసనాలు అరుదుగా కనిపిస్తాయి. అశోకుని శాసనాలు శ్రీకాకుళం జిల్లాలోను, ఎఱ్ఱగుడి, రాజులమండగిరి, అమరావతిమున్నగు ప్రాంతాల్లో లభిస్తున్నాయి.

అశోకచక్రవర్తి కళింగంపై దండెత్తి అత్యధిక రక్తపాతంతో కూడిన విజయాన్ని సంపాదించిన తరువాత ఉద్విగ్న హృదయంతో శాంతినికోరి అహింసనే వ్రతంగా స్వీకరించాడు. ప్రజల యోగక్షేమాలను దృష్టిలో పెట్టుకొని వారికి హితవుబోధిస్తూ అనేక శాసనాలు వేయించాడు. తాను బోధించాలనుకున్న ధర్మాన్ని భేరీమూలకంగా ప్రజలకు తెలియబరుస్తూ అక్షరాస్యులైన ప్రజాసమూహానికి, భావి తరాలవారికి తెలిసేటట్లు, శిలాస్తంభాలపై చెక్కించాడు. "రాజు ప్రజలకు చేసే సదుపాయాలు దేశప్రజలందరికి తెలియుటకు రహదారులలో ప్రకటించాలని ఆ ఆజ్ఞ సర్వత్రగము" అని కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో శాసనాధికారమనే ప్రకరణంలో వివరించాడు.

ఈ విధంగా రాజులు అధికారులు తమ ప్రజల యోగక్షేమాలను కోరి తమ సదాశయాలు, ఆదేశాలు చిరకాలం ప్రచారంలో ఉండాలని శాసనాలు వేయిస్తే, పరిపాలితులు కొందరు పాలకులు, తాము నమ్మిన మతాభివృద్ధికొరకు ఆయా మతప్రచారకులకు పూజ్యులకు దాన ధర్మాదులు చేస్తూ తామిచ్చిన దానము సదా నిలువాలని, అందరికి తెలియాలనే సహజమైన కోరికతో భావితరాలవారికి కూడా తెలిసేటట్లు శిలలపై, రేకులపై, చివరికి కుండలపైకూడ వ్రాయిస్తూ ఉండిరి. ఆ దానాలు నాటికాలానికి చెందిన ప్రజలకు మతమందు ఇతర ధర్మకార్యాలపై ఉన్న అభిరుచిని తెలుపుతున్నవి.

మన తెలుగు దేశంలో కాలక్రమాన వచ్చిన మతాలు ప్రజలలో పుణ్యకార్యాలపై చింతను కలిగించినవి. చక్రవర్తులు, రాజులు, అధికారులు ప్రజలు తమ తమ విభవాన్ననుసరించి దానధర్మాలు చేస్తూ ఉండిరి. ఇందు అధికారులు, అనధికారులు అనే వ్యవస్థగాని స్త్రీలు పురుషులనే తారతమ్యంగాని లేక అందరూ తమకు తోచినట్లు తమతమ ఆర్థికస్తోమత ననుసరించి దానధర్మాదులు చేయుచుండిరి.

తెలుగు దేశంలో బుద్ధుని కాలంనుండే బౌద్ధమతం ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తున్నది. బుద్ధుడు ధాన్యకటకానికి వచ్చి "కాలచక్రమూల తంత్రమనే" మంత్రయానమును బోధించినట్లు "హెల్ ముట్ హాఫ్ మాన్" అనే జర్మన్ పండితుడు పరిశోధించి ప్రచురించిన కాల చక్రమూల తంత్రమనే ప్రాచ్యలిఖిత ప్రతివల్ల తెలుస్తున్నది. అట్లే అమరావతిలో ఉన్న ఒక ఫలకంపై శ్రీ ధాన్యకటకం, అచ్చటి చైత్యారామాలు కృష్ణానది చూపబడియున్నట్లు, బుద్ధుడీ-స్థలమును దర్శించుట పాదుకల రూపములో చూపబడినట్లు ఇంగువ కార్తికేయ శర్మగారు తమ వ్యాసంలో వివరించారు.

అందువల్ల బౌద్ధమతం బుద్ధునికాలంనుండే తెలుగు దేశానికి వచ్చినట్లు స్పష్టమైంది. అందువల్లనే ప్రాచీనకాలంలో బౌద్ధమతంపై ఆసక్తిగల తెలుగు ప్రజలు నాయకులు ఆ మతాభివృద్ధికి పాటుపడుతూ దానధర్మాలు చేస్తూ ఉండిరి.

భట్టిప్రోలులో అతిప్రాచీనమైన బౌద్ధస్తూపంలో లభించిన శాసనం సింహగోష్టికి నాయకుడైన కుబ్బీరకుడనే(కుబేరకుడు?) రాజు ప్రేరణచే సాగతి నిగమం వారు బౌద్ధాలయానికి ఒక అద్దాలపెట్టెను, రాతిపెట్టెను అరహదినగోష్ఠివారు బౌద్ధసంఘానికి కొన్ని బరిణలు దానంచేసినట్లు తెలుపుతున్నది. ఈకుబేరకుడు అశోకుని కన్నా ముందుకాలానికి చెందిన

వాడని తిరుమల రామచంద్రగా రభిప్రాయపడగా ఖండవల్లి లక్ష్మీరంజనంగారు భట్టిప్రోలు శాసనలిపి అశోక చక్రవర్తి కాలానికి చెందినట్లు లిపిశాస్త్రజ్ఞులు నిర్ణయించారని తెలిపినారు,

శాతవాహనులు మరియు ఇక్ష్వాకుల కాలంలో బౌద్ధమతము తెలుగు దేశాన మిక్కిలి వ్యాప్తిచెందింది. బౌద్ధమతంలో "మాధ్యమిక" వాదానికి ప్రధాన ప్రచారకుడైన ఆచార్య నాగార్జునుడు శాతవాహనుల కాలానికి చెందినవాడే. ఈతనివల్ల ఆనాడు తెలుగుదేశంలో బౌద్ధమత ధర్మాలతోపాటు బౌద్ధ శిల్పము మిక్కిలి అభివృద్ధి గాంచినది. అమరావతి, భట్టిప్రోలు స్థూపములు, విహారాలు, చైత్యాలు, నిర్మించబడ్డాయి, నూతనపరిణామ మందిన ఈ మతంపై ప్రజలు ఎక్కువగా ఆకర్షితులయ్యారు. అందువల్ల వారు విహారాలు, చైత్యాలు మొదలైనవాటి నిర్మాణంలో నూతనోత్సాహంతో పాల్గొని అనేక శాసనాలు వేయించారు.

బృహత్పలాయనుల కాలంలో బౌద్ధమతం శాతవాహనులు. ఇక్ష్వాకుల కాలంలో ఉన్నట్లు మిక్కిలి అభివృద్ధి దశలో లేకున్నను, రాజులు బౌద్ధమతాన్ని స్వీకరించ నప్పటికి జనాదరణను పూర్తిగా కోల్పోలేదు. బందరుకు నాల్గుమైళ్ళ దూరంలో ఉన్న కోడూరులో బుద్ధసిరి, ఉశాసిరి' అనే గృహస్థు ఒక శిలామండపాన్ని గంధకుటి-వేదికా తోరణాలతో నిర్మించినాడు. మహానావికుడైన శివకుని భార్య సిద్ధమి. ఆమె పుత్రికలు ఇతర స్నేహితులు కలిసి ఆయక స్తంభాన్ని ఎత్తించి, దానం చేస్తూ శాసనం వేయించారు. విష్ణుకుండినులలో తొలి రాజులు బౌద్ధమతాన్ని ఆదరించినట్లు తుమ్మలగూడెం శాసనాలు తెలుపుతున్నవి.

ఈ విధంగా ఇంచు మించు క్రీ. పూ. 5 వ శతాబ్దినుండి క్రీ. శ. 4,5 శతాబ్దుల వరకు తెలుగునాట బౌద్ధమతం వ్యాప్తిలో ఉండింది. బౌద్ధమతంలో ముఖ్యంగా మహాయాన బౌద్ధంపై అభిమానం గల ప్రజలు, పాలకులు, చైత్యాలు, ఆయక స్తంభాలు, శిలామండపాలు, నిర్మిస్తూ ఉపాసకులకు, ఉపాసికలకు, దానధర్మాలు చేస్తూ అవి అందరికీ శాశ్వతంగా తెలియాలని శాసనాలు వేస్తూ వచ్చారు.

పైకాలంలో బౌద్ధమతంతో పాటు భారత-జాతీయ జీవనంలో నిరంతరం సాగి వస్తున్న వైదికమతం ప్రజలు, పాలకుల ఆదరణ పొందింది. అందువల్ల రాజులు తాము యుద్ధానికి వెళ్ళి విజయం సాధించి వచ్చిన - తర్వాత పుణ్య యశోభివృద్ధికై దేవాలయాలు కట్టించి, దేవాలయాలకు, బ్రాహ్మణులకు, దానం చేసి శాసనాలు వేయించేవారు. బృహత్పలాయన జయవర్మ మహారాజు కూడూరు శాసన మిటువంటిదే.

9వ శతాబ్ది అర్ధంకి శాసనం గుణగ విజయాదిత్యుని సేనా పండరంగుడు బోయ కొట్టములు జయించి వేంగినాటిని నాశనముచే కట్టెపు దుర్గము ధ్వంస మొనర్చి విజయోత్సాహంతో ధర్మపురంలో ఆదిత్యభట్టు అనే వానికి దానం చేసినట్లు చెప్తున్నది. పల్లవ శివస్కంద వర్మ మైదవోలు శాసనం, మీరహడగళ్ళి శాసనం కూడ ఇట్టివే.

ప్రతి వ్యక్తి ధర్మకార్యాలు చేసి పుణ్యం సంపాదించుకోవాలని అనుకుంటాడు. మన ప్రాచీన వాఙ్మయం, పురాణ, ధర్మశాస్త్ర ఇతిహాసాలు మనకు ధర్మబుద్ధిని ప్రేరేపించాయి. దానధర్మాల గురించి వేదశాస్త్రపురాణాలు ప్రత్యేకంగా ప్రబోధించాయి.

యజుర్వేదంలో ప్రతిదినం చేసే దానధర్మాదికార్యాల కంటె పుణ్యదినాలలో చేసే దానం చాలా గొప్పదని చెప్పబడింది. (1-203 మహాభారతంలో

"పర్వసు ద్విగుణం దానమృతౌ దశగుణం భవేత్
ఆయనే నియవేచైవ షడశీతి ముఖేషుచ
చంద్రసూర్యోపరాగే చ దత్తమక్షయముచ్యతే"

వనపర్వం - అధ్యా 200 శ్లో 125. అని పర్వదినాల్లో ఋతు నిశేషాల్లో, ఉత్తర, దక్షిణాయన సంక్రమణ దినాల్లో, విషువత్పుణ్య కాలంలో, మిథునం, కన్య, ధనుస్సు, మీనసంక్రమణ కాలంలో (షడశీతి - ముఖాలలో) గ్రహణ మప్పుడు చేసిన దానోత్కృష్టత తెలుపబడింది. ఇదే విషయం అపరార్కునిచే లఘుశాతాతపమనే ధర్మగ్రంథంలో 'శాతాతపమనే' గ్రంథంలో పేర్కొన్నట్లు చెప్పబడింది.

"అయనాదౌ సదా దద్యాత్ ద్రవ్యమిష్టం గృహే వసన్
షడశీతి ముఖేచైవ విముక్తే సూర్యచంద్రయోః"

లఘుశాతాతపమే మరోచోట

శతమిందుక్షయే దానం సహస్రంతు దినక్షయే
విషువే శతసాహస్రం వ్యతీపాతేత్వనంతకః"

అని దానం యొక్క గొప్పతనాన్ని గురించి చెప్తూ ఉంటే హేమాద్రి దానంలో మరియు దాన మయూఖమనే గ్రంథంలో దాన ప్రాధాన్యత ఈవిధంగా చెప్పబడింది.

"తస్మాత్త్రి భాగం విత్తస్యజీవనాయ ప్రకల్పయేత్
భాగద్వయంతు ధర్మార్థమనిత్యం జీవితం యతః"

(తాను సంపాదించిన ధనంలో మూడొంతులు సంసారానికై ఖర్చు పెట్టుకొని మిగిలిన రెండు వంతులను ధర్మకార్యాలకై వినియోగించవలెను.)

రజతము, సువర్ణము, భూమి, మొదలగునవి ఉదక - ధారాపూర్వకంగా దానం చేసేవారు. నాడు భూములు, గృహాలు, ధన

ధాన్యాలు మొదలైనవి దానం చేస్తున్నట్లు భారత భాగవతాది పురాణాలు చెప్తున్నాయి. భూదానం, రథ, తురగ, సదాదాన, మన్న - ప్రదానం గోదానం, గేహదానం, వివిధ వరపటీదాన, మంబుప్రదానం, తత్తచ్ఛత్ర ప్రదానం, శయ్యాదానం మొదలైన కల్పోక్త దానాలను గోనబుద్ధ రాజు కూతురు గుండసేనాపతి భార్య కుప్పాంబ చేసినట్లు మహబూబ్ నగర్ జిల్లాలోని బూదపుర శాసనం తెల్పుతూంది. దానాలలో భూదానం అతి దానంగా వాసిష్ఠ ధర్మశాస్త్రం (29-19) చెబుతోంది.

ఈ విధంగా ధర్మశాస్త్రాలు, పురాణేతి హాసాది ప్రాచీన గ్రంథాలు చదివినప్పుడు - పురాణేతి - హాస శ్రవణకాలంలో పౌరాణికుడు చేసిన ధర్మబోధ విన్నప్పుడు ప్రేరితులై ప్రజలు ధార్మిక బుద్ధితో దానధర్మాలు చేసి శాసనాలు వేయిస్తూ ఉండిరి. చిత్తూరు జిల్లాలో 9. 10 శతాబ్దాలకు చెందిన రంగసముద్ర శాసనం సోమ గ్రహణ కాలంలో దానం చేసి వేయబడింది. ఇంచుమించు అదే కాలానికి చెందిన కడపజిల్లా ముద్దనూరు శాసనం సూర్యగ్రహణం నాడు చేసిన దానాన్ని తెలుపుతుంది.

గుంటూరు జిల్లా వలివేరు శాసనం ఉత్తరాయణ పుణ్యకాలంలో వేయబడగా, ద్రాక్షారామంలోని ఒక శాసనం దక్షిణాయన పుణ్యకాలంలో భీమేశ్వరునకు అఖండవర్తి దివియకై ' చేసిన దానాన్ని తెలుపుతూంది. అచ్చటనే ఉన్న ఇంకొక శాసనం కన్యాసంక్రాంతినాడు వేరొకశాసనం తులామాసంలో వేయబడింది.

నాడు సప్తసంతానములపై ఎక్కువ మక్కువ ఉండేది.

తన పెంచిన సన్తానము
దన సంతానంబుగ్రితియు దన నల్లిల్లును
వనమును జెరువును గుడియును
జనవినుతములైన సప్తసంతానంబులు

కరీంనగర్ శాసనం. తెలంగాణా శాసనములు 1. పు. 17

ముఖ్యముగా వనాలు పెంచుట, చెరువులు త్రవ్వించుట, గుళ్ళు కట్టించుట, అనే వాటిపై అధికారులు అనధికారులు స్త్రీలు పురుషులు అందరు ఉత్సాహము చూపించారు. తామేమతానికి చెందినా ప్రజలకు సౌకర్యం, తమకు పుణ్యం కలుగుతుందనే భావంతో ఈ కార్యాలు విరివిగా చేస్తూ ఉండేవారు.

అశోకచక్రవర్తి బాటసారులకు, జంతువులకు నీడ నిస్తాయని మార్గానికిరుపై పులా చెట్లు నాటించినట్లు, దప్పిదీర్చుటకై బావులు త్రవ్వించినట్లు అతని శాసనాలు తెలుపుచున్నవి. అట్లే పులోమావి "మ్యాకదోని" శాసనం శాతవాహన నిహారంలో కుమారదత్తుని గ్రామమైన వేపూరులో గృహపతియైన శంభుడు తటాకం త్రవ్వించినట్లు తెలుపుచున్నది. కాకతీయుల కాలంలో దేవాల యాలతోపాటు చెరువులు త్రవ్వించడం ఎక్కువగా కనబడుతుంది. కాకతి రుద్రమదేవుని మంత్రి గంగాధరుడు హనుమకొండలో త్రికూట నిర్మిత శివాలయాన్ని విలసత్తటాకాన్ని సుందర పుష్ప వాటికలు జుట్టు నలుంగ (తు)లవంగ తాలమాకంద వనాలు జనసుఖప్రద మగునట్లు చేసెను. గణపతి దేవుని సేనాపతి చౌండసేనాని తన పేరుతోనున్న చౌండపురమనే అగ్రహారంలో చౌండసముద్రమనే తటాకాన్ని, చౌండీశ్వరుని దేవాలయాన్ని నిర్మించాడు. రేచెర్వుల నామిరెడ్డి తనపేర నామేశ్వరాలయాన్ని కట్టించి పిల్లలమఱ్ఱి దగ్గర గుడ్ల చెరువు గత్యాకే చెరువు అనే రెండు చెరువుల త్రవ్వించెను. రేచెర్ల బేతిరెడ్డి భార్య ఎరుకసానమ్మ పిల్లల మఱ్ఱిలో "ఎఱుక సముద్రమను" చెరువును "లక్ష్మి సముద్రమనే" మరొక చెరువును త్రవ్వించింది. అట్లే తనపేర "ఎఱుక మఠము" అనే మఠాన్ని ఏర్పాటు చేసి అచ్చట చదువుకొనే విద్యార్థులకు భోజన వసతితో పాటు బట్టలుకూడ ఉచితంగా ఇచ్చింది. సత్రంలో వండేవారికి జీతంగా భూమి నిచ్చినది. ఆగంతుకులైన ప్రజలకై చలివందిరి పెట్టి దాహము తీర్చింది.

ఇక గుళ్ళు కట్టించి శాసనాలువేసిన రాజులు ప్రజలనేకులున్నారు. ఇక్ష్వాకు వంశానికి చెందిన మొదటి శాంతిమూలుని చెల్లెలు, శాంతిశ్రీ నాగార్జునకొండలో మహాచైత్యాన్ని ఎత్తించింది. బౌద్ధ స్థూపముల నిర్మించిన రాజులు వాటికొరకు దానధర్మాలు చేసిన ప్రజలు కుబ్బీరకుని కాలమునుండే కనపడుతున్నారు.

కొందరధికారులు తమకు అధికారము లభించిన సందర్భంలో గుళ్ళు ప్రాకారాలు కట్టించేవారు. బెజయరాజుకు "కరణమ్ము" లభించిన సందర్భంలో అతడు తనపేర ఈశ్వరాలయాన్ని (బెజయేశ్వరాన్ని) గుళ్ళు, ప్రాకారము, మండపము మొదలైనవి కట్టించినట్లు 9వ శతాబ్ది నాటి ధర్మవరం శాసనం తెల్పుతున్నది. రెండవ చాళుక్య భీమ విష్ణువర్ధనుని యాశ్రయించిన గుణగవిజయాదిత్యుడు చాళుక్యభీముని పేర భీమేశ్వరము కట్టించి చెరువులు త్రవ్వించినట్లు కొరవి శాసనం వల్ల తెలుస్తున్నది. మొదటి యుద్ధమల్లుడు కుమారస్వామికిభక్తుడై బెజవాడలో కుమారస్వామికి ఆలయము కట్టించినట్లు బెజవాడ శాసనం తెల్పుతున్నది. కాకతీయుల కాలంలో "త్రికూటము" లను మూడు గుళ్ల కట్టించి దానము చేస్తూ శాసనం వేసేవారు. ప్రధానంగా నాడు ఆదిత్యుని కేశవుని ఈశ్వరుని ఈ త్రికూటాలలో స్థాపించేవారు. రుద్రదేవుని వేయిస్తంభాల గుడి (హనుమకొండ) శాసనం రెండవ ప్రోలుని మాటూరు శాసనం, కాకతి గణపతి దేవుని కాలానికి చెందిన కొండపాక శాసనం (అముద్రితం) ఈ విషయాన్నే తెలుపుతున్నాయి. ఆనాడు చాల మంది తమపేర తమ తల్లి దండ్రులపేర, అత్తమామలపేర గుళ్లు

శిట్టించి దానముచేస్తున్నట్లు పిల్లలమఱ్ఱి, వాడపల్లి మొదలైన శాసనాలు తెలుపుతున్నాయి.

కొందరు తమ తల్లిదండ్రులు లేక బంధువులు లేక ఏలికలు చనిపోయినపుడు వారికి పుణ్యలోకం ప్రాప్తించాలని గుళ్లుకట్టి దానాలు చేసి శాసనం వేయించేవారు.మల్యాల గుండయ చనిపోయినప్పుడు అతని భార్య కుప్పాంబ గుండయపేర లింగప్రతిష్ఠ చేసింది. అట్లే ఒకానొక యుద్ధంలో కాకతి రుద్రమదేవి, ఆమెసేనాపతి మల్లికార్జున నాయకుడు చనిపోతే వారికి శివలోకప్రాప్తి కలిగేటట్లు వారి భృత్యుడు పువ్వుల ముమ్మడిగారు చందుపట్ల (నల్లగొండజిల్లా) లోని సోమనాథదేవునికి దానధర్మాలు చేసి శాసనము వేయించెను.

ఈ విధంగా ధనవంతులు, అధికారులు, రాజులు, చక్రవర్తులు గుళ్లు కట్టించి దానధర్మాలు చేసి శాసనాలు వేయిస్తూ ఉంటే సామాన్యులు,భాగ్యవంతులు, స్త్రీలు, దేవాలయాలకు అనేకవిధాలైన దానాలు చేసి పుణ్యం పొందాలని అనుకొనేవారు. దేవాలయంలో ఎల్లప్పుడు వెలుతురుండుటకై అఖండదీపం పెట్టేవారు, దీపాన్ని బ్రహ్మస్వరూపంగా సర్వపాప పరిహార కారణంగా భావించే నాటి ప్రజలు దేవాలయములో అఖండవర్తిదీపం పెట్టాలని అనుకొనెడివారు. అఖండవర్తి దీపానికి నూనెకంటె నేయి శ్రేష్ఠమని భావించేవారు.ప్రతినిత్యము దీపము అఖండంగా వెలుగుటకు ప్రతిదినము సుమారు మానెడు నేయి అవసరమని భావించిన నాటిప్రజలు దానికై ఆవులను గొఱ్ఱెలను దేవునికి దానము చేసి వాటిని ఒకబోయ (అధికారి?) స్వాధీనములో ఉంచేవారు. అతడు వాటి పాలను, పిల్లలను అనుభవిస్తూ తర తరాలుగా ప్రతి నిత్యము మానెడు నేయి పోసేవాడు. ఈ విధంగా అఖండ వర్తి దీపానికి ఆవులను, గొఱ్ఱెలను దానం చేసి దేవునికి అఖండ దీపానికి నేయిపోయటానికి ఒప్పందం చేసికొన్న శాసనాలు ద్రాక్షారామం, గుంటూరు జిల్లాలోని వలివేరు, ముఖలింగం, భీమవరం, సర్పవరం, చేబ్రోలు, జుత్తిగ మొదలైన స్థలాల్లో కనబడుతున్నాయి. బేతేశ్వరం లోని ప్రోలేశ్వరదేవునికి అఖండవర్తి దీపానికి ప్రతినిత్యం పన్నెండు మానికల నేయి పోయుటకు సబ్బునెరచ్చిసెట్టి కషనయ్య నీరు నేలను (మాగాణిభూమిని) పదిమఱుతురుల వెలిజేనును (మెట్టపొలాన్ని) తనఇల్లును, గానుగను దానం చేసినట్లు హనుమ కొండశాసనంవల్ల తెలుస్తున్నది. ఇంకను దేవునికి ఇతర దానాలు, భూమి దానం చేసిన శాసనాలనేకం కనిపిస్తున్నాయి.

ఇవి కాక పెద్దపెద్ద దేవాలయాలుండుచోట దేవుని దర్శించుటకు పోవు భక్తుల సౌకర్యార్థం సత్రాలు ఏర్పాటు చేసేవారు. ఆ సత్రాన ఆగంతుకులైన వారికి ధనవంతులు ఉచితంగా భోజన సౌకర్యాన్ని కలిగించేవారు.

ద్రాక్షారామంలోని కులోత్తుంగ చోడసత్రంలో ఇరువైమంది బ్రాహ్మణులకు ప్రతిదినం నాల్గు నంజుళ్ళతో తీపిపదార్థాలతో ఉచితంగా భోజనం పెట్టేవారు ఆ భోజన పదార్థాలు వండే బ్రాహ్మణునికి, కట్టెపుల్ల వారికి, వడ్లుదంచి ఎంగిళ్ళెత్తేవారికి, నీరుదెచ్చే వారికి,జీతంగా ధనాన్ని నేతికొరకు ఆవులను భూమిని గ్రుద్రవాడి, దాకిరేమి పెద్దబేతి నాయకుని కూతురు దానముచేసినట్లు ద్రాక్షారామంలోని ఒక శాసనం తెలుపుతున్నది. విప్పర్ల శాసనం లెక్కల కొమ్మిశెట్టి కూతురు చుంచు పెమ్మిసెట్టి సోదరియైన ముమ్మనమ్మ సహస్రభోజనపు నుంబురెళు అనే చలివందిరి పెట్టించినట్లు తెలుపుచున్నది. 13వ శతాబ్దికి చెందిన నల్లగొండ జిల్లా ఆగామోతుకూరు శాసనం కూడా ఆగామోతుకూరులోని వీరమల్లనాథ దేవరస్థానపతులు నడిపిన సత్రాన్ని తెలుపుతున్నది.

సప్తసంతానాలలో ఒకటైన కృతిస్వీకారము కొరకు రాజులు దండనాథులు మొదలైనవారు కవిపండితుల నాదరించి వారిచే కృతుల చెప్పించి వాటిని స్వీకరించి కృతిభర్తలయ్యేవారు. కాకతి గణపతిదేవ చక్రవర్తి సేనానియైన మల్యాలగుండ దండనాథుని ఆస్థానంలో పద వాక్యప్రమాణ ప్రమేయ విచిత్రకవిత్వ తత్వజ్ఞుడైన అభినవ మయూర సూరి, ఈశ్వరభట్టోపాధ్యాయులు కశ్చరసూరి మొదలైన పండిత కవి కుటుంబ ముండెడిది. వారు వ్రాసిన కృతులు మనకులభించలేదు. కాని

వారు వ్రాసిన శాసనభాగాలే చిన్నచిన్న కావ్యాలవలె కనిపించుచున్నవి. రుద్రదేవచక్రవర్తి మంత్రియైన గంగాధరుని కరీంనగర్ శాసనం పాఠకులకు శాసన కావ్యంవలె కనిపిస్తుంది.

హేమాద్రి రచించిన ధర్మశాస్త్రం ఆనాటి ప్రజలపై మిక్కిలి ప్రభావాన్ని చూపెట్టింది. కాకతీయుల కాలంలో తిక్కన మహాకవి శిష్యుడైన కేతన విజ్ఞానేశ్వరీయమనే ధర్మగ్రంథాన్ని తెనిగించాడు. ఆ ధర్మగ్రంథాల వల్ల నాటి ప్రజలు వివిధ వ్రతాలు దానధర్మాలు చేసేవారు. మల్యాలగుండ దండాధీశ్వరుని ధర్మపత్నియైన కుప్పాంబ లక్ష్మీనారాయణాఖ్యవ్రతాన్ని, జలశయన, శూన్యశయ్యా, ద్వాదశీ, అరుంధతీ వ్రతాలను చేసినట్లు బూదపుర శాసనం తెలుపుతున్నది.

ఇవన్నియు పుణ్యం సంపాదించాలన్న కోరికతో చేసిన పనులు ఆ పుణ్యకార్యాలు నలుగురికి శాశ్వతంగా తెలియపర్చాలన్న భావనతో శాసనాలు వేసేవారు.

ఇంకను రణరంగంలో వీరోచితంగా పోరాడి యుద్ధంలో చనిపోయిన సైనికులను, సేనాధిపతులను కొనియాడుతూ వారు చేసిన యుద్ధాన్ని వీరగల్లుల క్రిందనుండే శాసనాలు తెలుపుతున్నాయి. దీనివల్ల సైనికులు యుద్ధంలో తమ ప్రాణాలుండేవరకు వీరోచితంగా పోరాడి గెలువు సాధింతురని నాటి ప్రజలు భావించి - యుందురు.

ఈ విధంగా నాటి ప్రజలు పుణ్యసంపాదనేచ్ఛతో దానధర్మాలుచేయుట, చైత్యములు, విహారములు, దేవాలయములు నిర్మించుట, చలిపందిళ్ళు, సత్రములు పెట్టించుట, రణరంగమున వీరోచితముగా పోరాడుట వంటి పనులు చేయుచుండిరి. ఇట్టి పనులకు నాడు విశేషమైన ఆదరణ ఉండినది. అందువలన తాము చేసిన సత్కార్యములు శాశ్వతముగా నలుగురికి తెలియవలెనని, వాటినెవ్వరు చెడగొట్టవద్దని వ్యాసుని శ్లోకములను లేక ఇతర వాక్యములను చివరకు ఉట్టంకించే రాళ్ళపైన, రాగిరేకులపైన శాసనములు వేసేవారు రాళ్ళపై వేసిన శాసనాల యొక్క ప్రధానోద్దేశ్యము అవి సర్వజనులకు సర్వకాల సర్వావస్థలయందు తాము చేసిన పుణ్యకార్యమును తెలుపుట కాగా తామ్రశాసనాలు తాము చేసిన దానధర్మాల గురించి తెల్పే పత్రాల వంటివి. ఇవి ఈ కాలమున ఇచ్చు పట్టాల వంటివి. ఈ తామ్ర పత్రాలను జాగ్రత్తగా ఒక కుండలో పెట్టి వరిపొట్టుపోసి దాచిపెట్టెడివారు. అవసరమైనప్పుడు తీసి చూపుటకివి అనుకూలంగా ఉండేవి. కొన్ని తామ్ర శాసనాలలో దానధర్మాది విషయాలకు బదులుగా గ్రామ సీమాదుల వివాదంలో జరిగిన పరిష్కారాన్ని ఒప్పందాన్ని సూచించడం జరిగింది.

ఈ విధంగా శాసనములు వేయించుటకు నాటి ప్రజలలో గల ధర్మభావన, దానిని శాశ్వతంగా నల్గురికి తెలియ జెప్పాలనే కోరిక ప్రధాన కారణంగా కన్పించును.

## ఉపయుక్త గ్రంథాలు


1. రామచంద్ర, తిరుమల – మన లిపి పుట్టుపూర్వోత్తరాలు.
2. కులశేఖరరావుగారు, ఎమ్ – ఆంధ్రవచన వాఙ్మయము ఉత్పత్తి వికాసములు
3. రాధాకృష్ణ, బూదరాజు(సంపా) – ప్రాచీనాంధ్రశాసనాలు.
4. శేషాద్రి రమణ కవులు(సంపా)–తెలంగాణా శాసనములు 1
5. రామకృష్ణ శర్మ, గడియారం, ( సంపా ) – తెలంగాణా శాసనములు 2
6. వెంకట రంగయ్య, మామిడిపూడి ( అను ) – కౌటిల్యుని అర్థశాస్త్రము
7. శాస్త్రి, బి. యన్ – ఆంధ్రుల సాంఘిక చరిత్ర
8. ,, (సంపా) శాసన సంపుటి
9. ఈశ్వరదత్తు, కుందూరి – శాసనశబ్ద కోశము
10. లక్ష్మీరంజనంగారు, ఖండవల్లి-ఆంధ్రుల చరిత్ర సంస్కృ[illegible]
11. భారతి సంచికలు
12. కాణె పి. వి. హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర, వాల్ 2 పార్ట్ [illegible]
13. శ్రీనివాసాచార్ పి. ఎ కార్పస్ ఆఫ్ ఇన్‌స్క్రిప్షన్ ఆ తెలింగాణా డిస్ట్రిక్ట్స్ వాల్ 2.
14. పరబ్రహ్మశాస్త్రి పి. వి. ( కలెక్టెడ్ ఫ్రమ్) స్టడీస్ ఇ ఇండియన్ ఎపిగ్రఫీ.

శ్రీ గౌరవరపు వాసుదేవరావు

# తరతరాల మన సాంప్రదాయం వైభవం ఏమైపోయింది?

సాంస్కృతిక రంగంలో మనం నానాటికి తీసికట్టవుతున్నా మని అంటూ ఉంటారు. ఇది నిజమేనా? అయితే ఎందుకిలా అవుతోంది? ఎవరు దీనికి కారణము? పాత వైభవాన్ని మళ్ళీ సాధించగలమా?

లలిత కళల్లో సంగీత, నృత్య నాటకాలు, ఎంతో శక్తివంతమైనవి. ఈ 'సంసార' బాధలనుంచి తాపత్రయాలనుంచి ఈ కళలు మానవుని కాస్సేపయినా విముక్తంచేసి ఉల్లాసాన్ని కలిగిస్తా యని 'నాట్య శాస్త్రం' చెబుతుంది. నాటకరంగంలో అద్దంకి, సి.ఎస్. ఆర్. బళ్ళారి రాఘవ, స్థానం, వేమూరివంటి మహామనుషులెందరోఉండే వారు. వేమూరి వారిలాంటి వారిపుడు కనిపించడంలేదు. ఎందుకో?

ఈ రోజుల్లో ఎటుచూసినా శూన్యంగా ఉన్నది. కొన్నాళ్ళు వరసగా ప్రదర్శిస్తే ప్రజలు చూసి ఆనందించే స్థాయికి వచ్చిన ఒక్క నాటకం కూడ లేదు. ఆరాధించదగిన వారొక్కరూ లేరనిపిస్తుంది.

పన్నుల నిరాకరణోద్యమం, పౌరఉల్లంఘనోద్యమం, పరాయి ప్రభుత్వం ఈ జాతీయోద్యమాన్ని అణచడం, ఖైదు శిక్షలు, ఈ చరిత్ర గతిలో మన రాష్ట్రం అంతటా సాంఘిక సాంస్కృతిక కార్యక్రమాలు, వాటిద్వారా చైతన్యం స్తంభిచిపోయింది ఇప్పుడు మూడు దశాబ్దాలు తర్వాత కూడా పునరుజ్జీవనం సాక్షాత్కరించడంలేదు.

అయితే గుడ్డిలో మెల్ల అన్నట్లు సురభి నాటక కుటుంబాలు మాత్రం పాతవిశిష్టతను ఇంకా కొనసాగించుకుంటూ ప్రాకులాడు తున్నాయి. ఇంతమాత్రంతో సరిపోదు. నాటక రచయితలు కూడా, పోటీల్లో బహుమతులు కొట్టేయాలన్న తాపత్రయంతో చిన్న చిన్న నాటి కలతో తమ రచనల్ని గిరిగీసు కుక్కోడంకూడా దురదృష్టకరమైన పరిణామం. ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, తిరుపతి వెంకట కవులు, వేదం వెంకటాయశాస్త్రి వంటివారు ఆ రోజుల్లో చేసిన కృషికి దీటుగా నిల్వగల రచయితలు ఈ రోజుల్లో కనిపించడమే లేదు. ఆధునిక నాటక రచయితలు మహత్తర భావి కవితతో ఎంతో విజృంభించాలి.

మునుపటి రోజుల్లో వేమూరి గగ్గయ్య యముడుగా అద్ద శ్రీరామమూర్తి దుష్యంతుడుగా, బళ్ళారి రాఘవ దశరథుడు హిరణ్యకశిపుడుగా పాత్ర పోషణలో చూపిన నేర్పు, పాత్రామశీల జ్ఞాపకం వచ్చినప్పుడు స్థానం "మధురవాణి నవ్వులు", సి. ఎస్. ఆ రామప్పపంతులుగా చేష్టలు ఈ రోజుల్లో ఏనటుడిలో ఏ పాత్రను జ్ఞ తేగలుగుతున్నాయన్న ప్రశ్నకు జవాబు కనిపించదు. ఆ ఎత్తు ఎదగడానికి నేటి రంగస్థల కళాకారులెందుకు ప్రయత్నించరు?

బరువైన పాత్రల్ని పోషించడంలో కళాకారుల ప్రతి వ్యుత్పన్నత స్పష్టమవుతుంది. తమ ఉద్యోగ కార్యక్రమాలమ తీరిక చేసుకొని ఇప్పటి నటులు ఇంకా కృషి చేయాలి. ధనిక రసికులు ఈ పునరుజ్జీవనానికి సర్వవిధాల తోడ్పడాలి. ఇందుకు నడు బిగిద్దాం. మనలో ప్రతిభ ఉంది. దాన్ని సక్రమ మార్గంలో పెట్టాలి

"తల్లి సమస్త రీతులకు భరతుని నాట్యశాస్త్రము,
ఆ పిల్లలలోన కూచిపూడి ఎంతయు ముద్దులాడి"-

తెలుగువారికి గర్వకారణమైన నృత్యరీతి కూచిపూడి నృత శతాబ్దాలనాటి ఈ నృత్యరీతిలో భామాకలాపం కలికితురాయి. సిద్ధే యోగి రూపొందించిన ఈ నృత్యరీతిని వేదాంతం లక్ష్మీనారాయణశా తీర్చిదిద్ది ఏకపాత్రాభినయంగా వాసికి తెచ్చారు. అనేక చారి కారణాలవల్ల కూచిపూడి నాట్యం తెరమరుగైంది. రాజరాజ చోళ కృష్ణదేవరాయలు, ఉత్తరాదినుంచి వచ్చిన ముస్లిం రాజులు తమ సేనలతో దండయాత్రలు జరిపి కోస్తా ప్రాంతాల్లోని లలిత కళ టిని నశింపజేశారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడేవరకూ ఈ కళలు పునరుద్ధరణనుగురించి ఆలోచించడమే జరుగలేదు.

మనకు ఉద్దండులైన కళాకారులున్నారు. వెంపటి పెద్దస వేదాంతం జగన్నాథశర్మ, కూచిపూడి నాట్యానికి తమ జీవితాన్ని పోశారు. వెంపటి చినసత్యం, కోరాడ నరసింహారావు, వారిశి

శిష్యురాండ్రు ఇప్పుడు కూచిపూడి నృత్యాన్ని అఖిల భారతంలోనేకాదు విశ్వవ్యాప్తంగా పరిగణనకు తెచ్చారు. అది అమెరికాలోనే కావచ్చు. ఐరోపాలోనే కావచ్చు, ఆగ్నేయాసియాలోనే కావచ్చు, ప్రపంచంలో ఎక్కడో ఒకచోట కూచిపూడి నృత్య ప్రదర్శన జరుగని రోజంటూ లేదనటం అతిశయోక్తికాదు. వేదాంతం సత్యనారాయణశర్మ, శోభా నాయుడు, రాజారెడ్డి-రాధారెడ్డి దంపతులు, యామినీ కృష్ణమూర్తి స్వప్నసుందరి తదితరులెందరో అఖండ శైలూషీ సంపన్నులున్నారు. నృత్య నాటకాలు, మనకు కొత్తకాదు. వెంపటి చినసత్యం చండాలిక ప్రసన్నరాణి'ప్రియంవెంకటేశం'కొత్తపల్లిపద్మ'భక్తప్రహ్లాద'వేదాంతం సత్యనారాయణశర్మ 'ఉషాపరిణయం' విప్రనారాయణ దీటులేనివి.

అయినప్పటికి కూచిపూడి నృత్యం ఇంకా ఎంతో సాధించాల్సి ఉంది. నాతోటి విలేఖరి ఒకరు "ఏముంది కూచిపూడి నృత్యమంటే" కాలకనకమయచేల, దశావతార శబ్దం, నీలమేఘశరీర - ఇవి తప్పనిసరికదా ? అని తేల్చేశాడు. ఈ తేలికభావం కలుగకుండా కూచిపూడి ఆచార్యులు జాగ్రత్త పడుతున్నారా ? కొత్త కొత్త అంశాలకు నృత్యం కట్టి ప్రదర్శించడానికి ప్రయత్నించి నప్పుడే భరతనాట్యంతో సమానంగా కూచిపూడి నృత్యం నిలువ గలుగు తుంది. ఇది అసాధ్యమయినదికాదు. మన నాట్యాచార్యులకు తగిన ఉత్సాహం ఉన్నట్లు తోచదు. వారిలో ఉత్సాహాన్ని కల్పిద్దాం నృత్య బృందాలు ఒక ఆసక్తిని కల్పించి తగు కృషిచేసినందువల్ల అమెరికా, ఐరోపా, ఆగ్నేయాసియాల్లో కూచిపూడినృత్యం జనాదరణ పొందింది. ఉమాభారతి రత్నపాప అమెరికాలో నృత్యకేంద్రాన్ని నిర్వహించుతూ ఎంతోమంది శిష్యబృందాన్ని తయారుచేస్తూనే ఉన్నారు.

1926లో కాబోలు, ఓసారి నేను వేసవి సెలవులకు కడపకు వెళ్లాను.ప్రతిరోజు విడిచి రోజు కూచిపూడి భాగవతులు అక్కడతెల్లవారే వరకుప్రదర్శన లిస్తుండడం చూశాను. రాత్రి మంచి తెల్లవారు జామున నాల్గుగం వరకు కన్నార్పకుండా కూర్చుని ఆ నృత్య నాటకాలన్నింటినీ నేను ఎంతో ఆసక్తితో తిలకించాను. కూచిపూడి నృత్యాన్ని అభిమానించి అధ్యయనం చేయటం అప్పుడే ప్రారంభం. కూచిపూడి భాగవతుల్లో ఒకవారుండేవారు కాదు. ఆ బృందం నాయకుడు సత్యభామవేషం,అన్ని ప్రధాన నాయకా వేషాలు కట్టేవాడు. పగటిపూట ఆతడు నావద్దకువచ్చి ఉత్తరాలు వ్రాయించుకు పొయ్యేవాడు. అతనికి చదువు రాదు. నాకు పుట్టలో 'సత్యభామ ప్రయివేటు సెక్రటరీ' అని పేరు పెట్టారు, మా స్నేహితులు.

కూచిపూడికి విశిష్ట సాంప్రదాయం ఉంది, దాన్ని కాపాడాలి. హైదరాబాద్‌లో ఎందరో నాట్యాచార్యులు భరతనాట్యము, కూచిపూడి నేర్పుతున్నారు. నృత్య ప్రదర్శన ఇచ్చేవారు రెండు నృత్యరీతుల్లో కొన్ని కొన్ని అంశాల్ని ప్రదర్శించడం వాడుక. ఆ అంశం కూచిపూడి నృత్యమో, ఏది భరత నాట్యమో చెప్పకపోవడం వల్ల రసికులకు అయోమయ స్థితి తప్పదు. ఈ పద్ధతికి స్వస్తి చెప్పాలి.

సంగీతం అదనమైన గొప్ప లలిత కళ. కర్ణాటక సంగీతానికి సమానం ఏదీలేదు. గనుక మీ స్వరాలు, సంప్రదాయం, వందలకొద్ది కీర్తనలు అపార సంపత్తి వంటివి. అయితే మన మహానాయకు లందరినీ ఇతర ప్రాంతాలకు వలసపోయేట్లు చేసుకొనే ఘనత మన కుంది ! మేళకర్తరాగాలనుంచి కొత్తరాగాన్ని సృష్టించగలిగిన మన వాగ్గేయకారుని సంగీతవిద్వాంసుని మనం నిలుపుకోలేకపోయాం. వారంతా మద్రాసుకు తరలిపోయారు. మరో గొప్ప సంగీతవేత్త శ్రీరంగంలో ఉండిపోవడానికి నిర్ణయించుకున్నారు. ముస్లిం అయినప్ప టికి అక్కడ హిందూదేవాలయానికి ఆస్థాన విద్వాంసుడయ్యారు. తమిళుల సంగీత కళారాధన అటువంటిది.

త్యాగరాజస్వామి వారి తండ్రిగారు గిద్దలూరు తాలూకాలోని కాకర్ల గ్రామం నుంచి తిరువారూరుకు వలస వెళ్ళారు. అక్కడ త్యాగరాజు జన్మించారు.. ఆ కుటుంబం తిరువయ్యూరుకు మకాం మార్చింది. త్యాగరాజస్వామి ఆ వూళ్ళోనే పెరిగి పెద్దవాడయ్యారు. అక్కడే జీవించారు. అక్కడే సమాధి చెందారు. ఆ కుటుంబము నివశించిన రెండు వూళ్ళలోని రెండు ఇళ్ళు స్మారక చిహ్నాలుగా త్యాగ బ్రహ్మఉత్సవ సభవారు సేకరించి నిర్వహిస్తున్నారు. నాటి చారిత్రాత్మక ప్రాధాన్యాన్ని వివరిస్తూ పట్టికలు వ్రాయించారు. కాని మన రాష్ట్రంలో త్యాగబ్రహ్మ పూర్వీకులు నివసించిన కాకర్ల గ్రామం కథ ఏమిటి? 1959లో గిద్దలూరులో నేను తాశీలుదారుగా పని చేస్తూండగా నేను కాకర్ల వెళ్ళి చూచి చాలా విచారించాను. ఒక మాజీ మంత్రి కాకర్లలో త్యాగబ్రహ్మ స్మారకచిహ్నం నెలకొల్పడానికి ఉద్దేశించినప్పటికి అదంతా తర్వాత రద్దయిపోయింది.

మన వాగ్గేయకారులను మనం గౌరవించుకోవాలి. మన శాస్త్రీయ సంగీతానికి మన్నన తేవాలి. అప్పుడే మనం మన సాంస్కృతిక శిఖరాలను ఎక్కగలుగుతాము. పెళ్ళిళ్ళలో, ఉపన్యాసా లలో సంగీత కార్యక్రమానికో, నృత్య కార్యక్రమానికో కొంత డబ్బు కేటాయించి ఉండటం ఒక మంచి అలవాటుగా ఉండాలి. తమిళనాడులో ఈ అలవాటు ఒక సాంప్రదాయంగా ఉంటుంది. ఇందువల్ల లలిత కళలకు ప్రోత్సాహం లభిస్తుంది. సామాన్యునికి కూడా వాటిని ఆస్వాదించ అవకాశం, ఆసక్తి లభిస్తుంది. 1947లో మా అమ్మాయికి వివాహం జరిగినప్పుడు మూడురోజులు జి. ఎన్. బి, ముసిరి సుబ్రహ్మణ్యయ్యరు, పల్లడం సంజీవరావు కచ్చేరీలను ఏర్పాటు చేశాను.

డిస్కో, సినిమా సంగీతం, లలిత సంగీతం ప్రవేశపెట్టి నప్పటికిని సంగీతం ముందంజ వెయ్యాలంటే మరో ...

మార్పురాదు, మహా విద్వాంసులంత వారివారి రంగాల్లో గొప్పవారే. అయిన కచేరి చేసినప్పుడు శ్రోతల్లో రంజకత్వాన్ని సాధించడం ఎంతో అవసరం. సంగీత విద్వాంసులు శ్రోతలతో హృదయస్పందన కలిగించ గలుగుతున్నామో లేక మన ప్రాండిత్యాన్ని మాత్రమే ప్రదర్శించామా అని ఆత్మపరిశీ చేసుకోవాలి. శ్రావ్యత ముఖ్యం. శ్రోతల మనోరంజనానికి అనువుగా పాండిత్యాన్ని బంధించుకోవాలి. విద్వాంసుల ముందు తమ ప్రతిభను ప్రదర్శించుకోవడం న్యాయమే. సామాన్యుల ముందు సంగీత పాండిత్య ప్రదర్శన అంతగా రాణించదు. సంగీతాభిమానం పెంపొందించడానికి అన్ని తాలూకాల్లోనూ సంగీత సభల్ని నిర్వహించి సంగీతాన్ని జనప్రియ స్థాయికి తేవడం అవసరం.

మన సంగీత సభలకు జనం పలచగా ఉండడం ఒక విచారం విషయం. శాస్త్రీయ కళల్ని కోరు వారలకు వ్యాపించ చెయ్యడం కోసం ఉద్యమించాలి.

త్యాగరాజదినోత్సవ సమయంలో తిరువయ్యారును సందర్శించి అక్కడ చేరిన వేలాది సంగీత ప్రియులు త్యాగరాజ కీర్తనల్ని బృంద గానం చేస్తుంటే చూసి పరవశించవలసిందిగా ప్రతి తెలుగువారిని నేను కోరుతున్నాను అ మహా వాగ్గేయకారునికి తలుపుల శ్రద్ధాంజలి ఘటిస్తున్నారో చూసైనా మనం తరించాలి. 1940 నుంచి 1950 వరకు నేను ఈ ఆరంభనోత్సవంకు వెళ్ళే భాగ్యం లభించింది. మహారాజపురం కుంభకోణం, రామాణిక్యం, బెంగళూరు నాగరత్నమ్మ వీళ్లందరిమ నేను కూర్చొని తన్మయుడయ్యాను. తిరువయ్యారులో సమాధి నిం ణం జరిపించింది. బెంగళూరు నాగరత్నమ్మగారే. ఆమె డబ్బు ఆశించి ఆమె బంధువులు ఆమెకు విష ప్రయోగం చేశారు. రాత్రి ఆ త్రాగే పాలలో మందు కలిపారు. కాని ఆమె ఆ పాలు త్రాగకుండా నిద్రపోయింది. నిద్రలో త్యాగరాజస్వామి కనిపించి విషప్రయోగాని గురించి హెచ్చరించారు. ఉదయమే లేచి ఆమె ఆ పాలను పిల్లి పోసింది. పిల్లి ప్రాణం విడిచింది. ఆ నాటి నుంచి బెంగళూరు నా రత్నమ్మగారికి త్యాగరాజస్వామియే సర్వస్వం. ఆయన పట్ల ఆ భక్తి అనన్యం.

తమిళులు మైసూరియన్లు, తిరువయ్యారు ప్రజలు - వర్ణాల కృతులు, పదాలు, జావళీలు తెలుగు భాషలో వ్రాసిన విషయం చా మందికి తెలియక పోవచ్చు. తంజావూర్ పదివేలు రామనాథపుర శ్రీనివాస అయ్యంగార్ వంటివారి కృతజ్ఞతల్ని కాస్త పరిశీలించం ఈ అంశం స్పష్టమవుతుంది.

లలితకళల్లో నృత్య సంగీత నాటికలకున్న అగ్రస్థానాన్ని తిరిగి మనం సాధించుకొని నిలబెట్టుకోవాలి. ఇందుకు వివేకానంద జ్ఞానబోధనలను ఒక్కసారి మననం చేసుకుందాం ఉత్తిష్ఠత జాగ్రత ! ! ప్రాప్యవరాన్నిబోధత ! ! !

---

## రచయిత(త్రు)లకి మనవి

భారతిలో ప్రచురణకి స్వీకరించని కవిత్వం - రచనలని అన్నిటిని ఇంతకాలం స్వంత ఖర్చు మీద తిప్పి పంపుతూ వచ్చాము !

రచనల సంఖ్య మరీ ఎక్కువగా ఉండటంచేత ఈ పద్ధతిని మార్చవలసివస్తోంది.

7-1-1985 తరువాత అందిన రచనలతో తగినన్ని తపాలా బిళ్లలు అతికించి స్వంత చిరునామా గల కవరులు జతపరచి ఉన్న, కవిత్వం - రచనలని మాత్రమే, వాటిని ప్రచురణకి స్వీకరించని పక్షంలో, తిప్పి పంపగలము !

రచయిత(త్రు)లు సహృదయంతో మా ఇబ్బందులని గుర్తించి మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము !

తమ రచనలతో పోష్టు కార్డులని జతపరచి పంపవద్దని రచయిత(త్రు)లకి మనవి !

తగినన్ని తపాలా బిళ్లలు అతికించి, స్వంత చిరునామా గల కవరులు జతపరచబడని రచనలు, ప్రచురణకి స్వీకరించబడక పోయినట్లయితే, ఆ విషయం వాటిని రాసినవారికి తెలుపటానికి వీలుకాదు. అంటే, వారికి తమ రచనలు ప్రచురించటానికి వీలుకాదని తెలుపుతూ వేరే రాయటానికి వీలుకాదన్నమాట !

ఈ విషయములో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవని గమనించ గోరుతాము !

ప్రచురణకి స్వీకరించిన రచనలని పంపినవారికి మాత్రం ఆ విషయం తెలియజేస్తాము !

భారతి
సంపాదకుడు




( గ త స ం చి క   త రు వా యి )

"సరస్వతీ! నువ్వు బాగా ఆలోచించి చేసిన పనికి నేను అంగీకరిస్తున్నాను." అంతవరకే మూర్తి అన్నాడు.

అత్తయ్యకు కొంచెం ఇబ్బంది తప్పదు. అయినా ఆమె ఒప్పుకుంది మామయ్యకూడా తొలుత కోపం ప్రకటించినా, కుటుంబంయొక్క శ్రేయస్సు దృష్టిలో ఉంచుకొని, తరువాత ఒప్పుకున్నాడు.

బస్సు కదిలింది. సరస్వతి పక్కన మరో లావుపాటి ఆవిడ కూర్చుంది. సరస్వతికి ఇంటర్వ్యూలో జరిగినవన్నీ జ్ఞాపకం వచ్చాయి.

.... మీటింగు రూములో ప్రవేశించగనే సరస్వతి కళ్లు చెదరిపోయాయి. లోపల లైటింగ్ చాల ప్రత్యేకంగా ఉంది. ట్యూబ్‌లైటు ఒకటికూడా కనిపించలేదు కాని గది వెలుగుతో నిండిపోయింది. ఎదురుగానున్న గోడమీద పెద్ద ఫ్రేములోనున్న ఆధునికమైన తైలవర్ణచిత్రమొకటి కనిపించింది. యంత్రము-మానవుడు- ఆ చిత్రంలోని రంగులు చాల ప్రశాంతంగా ఉన్నాయి. చిన్నచిన్న క్యూబులతో చిత్రమంతా తయారయింది. దూరానికి ఒక ఆకారం కనిపిస్తుంది. కాని కొంచెం దగ్గిరలో చూస్తే క్యూబులు స్పష్టంగా కనిపిస్తాయి. విశాలమైన గదిలో మధ్యనొక టేబిలు ఉంది. టేబిలుకు అటువైపు ఫోమ్‌లెదరు కుర్చీలలో ముగ్గురు కూర్చున్నారు. వాళ్ళందరూ హొదవుగా ఉన్నారు. మధ్యన కూర్చున్న అతనిని ఎక్కడో చూచినట్లయింది సరస్వతికి.

"మిసెస్ మూర్తిగారు! కూర్చోండి!" తనకు పరిచయంలేని కంఠం మరియాదగా పలికింది.

మధ్యను కూర్చున్నమనిషి కూలింగ్ గ్లాసెస్ పెట్టుకున్నాడు- అతనికి కుడిచేతివైపు కూర్చున్నఅతను సైడ్‌బర్న్సు - మీసాలు దిద్దుకున్నాడు. అవి లేకుండాఉంటే అతను రామాచారే- కాని పెద్ద విగ్గులా ఉన్నతల, గడ్డంవరకున్న సైడ్‌బర్న్సు- వీటితో అతనిని పోల్చడం కష్టమవుతున్నది.

అయిదు నిముషాలవరకు తినవేసేతేరిచూచిన మధ్యనున్న అతడు చివరకు మాట్లాడాడు.

"వెల్‌కమ్-మిసెస్ సరస్వతి"

అతను చలువ కళ్ళజోడుతీసి టేబిలుమీద పెట్టాడు.

సరస్వతికి ఒక్కసారి ఒళ్ళు జలదరించింది.

"నమస్కారం! మనోహర్‌గారూ! అంది సరస్వతి.

ఎడమచేతి పక్కన కూర్చున్న ఆఫీసరు సరస్వతి మాటలువిని ఆశ్చర్యపోయాడు. అక్కడ మనోహర్‌ను ఎవరూ అలా పిలువరు- రాజకుమార్ అనిపిలుస్తారు.

"ఈయన రామాచారి- మా చీఫ్ అకౌంట్సు ఆఫీసరు మన ఓల్డు ఫ్రెండు. ఇతను కిరణ్- మా పెర్సనల్ ఆఫీసర్" అన్నాడు మనోహర్.

"రామాచారిగారా? ఈ జుట్టు, మీసాలు, చెంపలుచూస్తే నాకు సందేహం కలిగింది. నమస్కారం, కిరణ్‌గారికి నమస్కారం" అంది

"నారాయణ్! కాఫీ అరేంజ్ చేయి!" అన్నాడు మనోహర్!

సత్యనారాయణ కాలు ఊపుకుంటూ వెళ్ళిపోయాడు.

"సరస్వతిగారూ! మీరీ పోస్టుకి అప్లయిచేసినట్లు నాకుతెలియదు. ఇప్పటికేనా మించిపోయినది లేదు". అన్నాడు మనోహర్ !

"థాంక్స్!" అంది సరస్వతి.

"కిరణ్! నాకీ ఉద్యోగాల విషయం కొంచెం సరిగా చెప్పండి!" అన్నాడు మనోహర్.

"మూడు పోస్టులు గుమాస్తాలవి, ఒకటి టైపిస్టు కం స్టోర్సు క్లర్కుది. రెండు నెలల క్రింద మనం పత్రికలలో ప్రకటన చేశాము. నెల్లాళ్ళ క్రింద వచ్చిన అప్లికేషన్‌లన్నీ స్క్రూటినీ చేశాం. రెండువేల ఎనిమిదివందల డెబ్బదినాలుగు అప్లికేషన్లు వచ్చాయి, వాటిని వడబోసి ఒక ఏభై మందికి మాత్రమే కాల్‌లెటర్స్ పంపించాం. ఈరోజు వారికి ఇంటర్వ్యూ- ఛీఫ్ ఆర్కిటెక్టు, బోర్డు ఛెయిర్మన్- ఆయన కావలసిన వారిని ఎన్నుకొని, ఈ నలుగురిని అనవసరమని విడిచిపెట్టారు. ఒకరిద్దరు కాండిడేట్లు అల్లరిపెట్టడం నుంచి ఈ రెండవ ఇంటర్వ్యూ ఏర్పాటు చేశాము." అన్నాడు కిరణ్.

"నాకీ విషయాలన్నీ తెలుసు- ఇప్పుడు సెలక్టు చేసినవారిలో ఎవరిని విడిచిపెట్టవచ్చునో నాకు చెప్పండి".



"అనుకున్న ప్రకారం నలుగురిని సెలక్టుచేయడం జరిగింది. సూచనప్రాయంగా వారికివిషయం చెప్పడంకూడా జరిగింది. మంత్రుల కాండిడేట్లుముగ్గురు, యంపిగారి మనిషి ఒకడు- మరి అవకాశాలులేవు."

"ఈ సంగతీ నాకుతెలుసు. కాని ఎవరిని డ్రాప్ చేయవచ్చు?" ప్రశ్నించాడు మానేజింగ్ డైరెక్టరు.

కిరణ్ జవాబు చెప్పలేకపోయాడు.

"రామాచారీ! నువ్వేమన్నా ఆల్టర్నేటివ్ సజస్టు చేయగలనా ?"

"యండీ తలచుకుంటే పోస్టులకే కొదవా ?" అన్నాడు రామాచారి నవ్వుతూ.

"కొత్తపోస్టులు మరివద్దు; యం. పిగారి కాండిడేటును డ్రాప్ చేయండి. ' ఆయనకు నమస్కారాలు పెట్టి, చిన్నపార్టీవిసిరి, వచ్చే ఖాళీలో వారి కాండిడేటునే భర్తీ చేస్తామని చెప్పి చూద్దాం. అయితే కిరణ్ ! శ్రీమతి సరస్వతికి ఏ ఉద్యోగం కేటా యిస్తున్నారు ?" అడిగాడు మనోహర్.

సత్యనారాయణ కాఫీ తీసుకొచ్చాడు. నలుగురు ఎవరి కప్పులు వారు అందుకున్నారు.

"నారాయణ్ ! కాఫీ చాలా బాగుంది. ఒక పావుగంటవరకూ ఎవరినీ లోపలకు రానీయకూడదు. రెడ్‌లైటు ఆన్ చేస్తున్నాను. నువ్వు మానేజరుగారి దగ్గిర ఉండు."

సత్యనారాయణ కాఫీ కప్పులను పట్టుకొని వెళ్ళిపోయాడు.

"కిరణ్ ఉద్యోగాల కేటాయింపులు ఇప్పుడు చెప్పండి."

"ముగ్గురు మంత్రుల కాండిడేట్లకు టైపు రాదు. అందుచేత మనకు ఒకటే పోస్టు మిగులుతుంది. అది టైపిస్టు కం స్టోరు క్లార్కు. శ్రీమతి మూర్తికి ఆ పోస్టుకు తగిన అర్హతలున్నాయి." అన్నాడు కిరణ్.

"సరస్వతి ఫామిలీవుమన్. స్టోరుక్లార్కు కొంచెం ఆలస్యంగా ఉద్యోగం నుంచి వెళ్లవలసి వస్తుంది. రమారమి అయిదువందల అయిటమ్సు ఉంటాయి. లెడ్జర్లలో పోస్టుచేసి, వాటిని ఇస్యూ చేయడం కష్టమయిన పని. పెద్ద పెద్ద స్టేటుమెంట్లు టైపు చేయడానికే ఆమెకు కాలం అయిపోతుంది. ఇది చాలా రెస్పాన్సిబిల్ జాబ్" అన్నాడు రామాచారి.

మనోహర్ ఒక పదినిమిషాలసేపు సరస్వతి ముఖంలోకి చూచాడు.

"శ్రీమతి సరస్వతి వంటివారే అటువంటి పనులకు ఉండాలి. ఈ సంస్థ కొద్దిమంది సిన్సియర్ అండ్ ఆనెస్టు స్టాఫ్‌మీద ఆధారపడి ఉంటుంది. నారాయణ్ ఒకడు, మానేజరు నరసింగరావు, మజదూర్ వెంకునాయుడు వంటివాళ్ళు మూలస్తంభాలు. సరస్వతి వీరందరికన్న విశ్వాసపాత్రురాలైన లాయల్ వర్కరు. కిరణ్ ! ఆమె శ్రమకు ఫలితమేమేనా ముట్టచెప్పవచ్చా ?"

"ఒకటి రెండు అడ్వాన్సు ఇంక్రిమెంట్లు ఇవ్వవచ్చు."

"రామాచారీ ! నీ సజషనేమిటి ?"

"యండీ తలచుకుంటే ఆమెకు గ్రేడులోని మాక్సిమమ్ ఇవ్వవచ్చు." అన్నాడు రామాచారి.

"శ్రీమతి సరస్వతి గారూ ! మీరేమంటారు ? మనోహర్ చాలా మృదువుగా ప్రశ్నించాడు.

సరస్వతికి ఏమి చెప్పాలో తోచలేదు.

"చాల థాంక్స్ !" అంతమాత్రమే ఆమె పలికింది.

"కిరణ్ ! శ్రీమతి సరస్వతీమూర్తికి వెంటనే ఆర్డర్లు టైపు చేయించి నా సంతకానికి పంపు."

మనోహర్ బెల్ నొక్కాడు. కొద్ది సేపటిలో సత్యనారాయణ వచ్చాడు.

"నారాయణ్ ! పైప్ వాష్ చేసి టొబాకో నింపి నా ఛాంబరులోకి తీసుకొనిరా ! థాంక్స్ కిరణ్ ! థాంక్స్ రామాచారీ ! సరస్వతిగారూ ! ఒక్క పది నిమిషాలు వెయిట్ చేయండి. ఆర్డర్లు మీ చేతిలో ఉంటాయి."

మనోహర్ లేచిపోయాడు అతనితోపాటు రామాచారి, కిరణ్ వెళ్లిపోయారు.

సత్యనారాయణ పైప్ కడిగి మానేజింగ్ డైరెక్టరు ఛాంబరులోకి ప్రవేశించాడు.

మరో పది నిముషాలకు మానేజరు నరసింగరావు వచ్చి ఆర్డరు లెటరు సరస్వతికి ఇచ్చాడు.

సరస్వతి అయిదు నిమిషాలు అలా మాన్పడి కూర్చుంది.

మధ్యాహ్నం మూడుగంటలప్పుడు ఉద్యోగం చేతిలోంచి జారిపోయిందని విచారించింది. ఇప్పుడు ఉద్యోగమే చేతిలోకి వస్తే ఏమి చేయాలో తెలియని సందర్భంలో పడింది...

బస్సు కండక్టరు అరుస్తున్నాడు. మువ్వలవానిపాలెం, మువ్వలవానిపాలెం అని. పక్కనున్న వలంపటి ఆవిడ లేవడంతో సరస్వతి ఈ లోకంలోకి వచ్చింది.

## 13

సరస్వతి మొదటి నెల తరువాత జీతం అందుకుంది. సాయంకాలం వేగంగా ఆఫీసు విడిచిపెట్టి బజారుకి వచ్చింది. అత్తకు చీర జాకెట్టు, మామకొక పంచలచాపు, కాత్యాయనికి, శేఖర్‌కి రడీమేడ్ దుస్తులు, ఒక పాకెట్టు స్వీట్సుకొంది. మూర్తికోసం ఏం కొనాలి? ఏమీ కొనాలని లేదు. అతనికి ఏవస్తువు నచ్చుతుందో తెలియదు. తాను తెలుసుకోడానికి గూడా ప్రయత్నించలేదు. తాను ఏదీ కొని ప్రజంటు చేయకపోయినా అతను అనుకోవలసిన మనిషికాడు.

బట్టల దుకాణంవాడు మల్లెపూలలా ఉన్నకాలికో జేబురుమాళ్ళను ఎవరికో చూపిస్తున్నాడు. సరస్వతి మరే ఆలోచన లేకుండా అరడజను రుమాళ్ళను కొంది. మరి తనకో... తనకని వేరే కొనుక్కోడం దేనికి ఇంటిల్లిపాది సంతోషిస్తే అదేచాలు.

సరస్వతి ఇల్లు చేరుకునే సరికి చీకటిపడింది. మామయ్య వీధి వరండాలో కూర్చున్నాడు, సముద్రంవేపుచూస్తూ. తను ఉద్యోగంలో చేరిన దగ్గరనుండీ అత్తకు పనిహెచ్చయింది. తన సహాయం ప్రొద్దున రెండుగంటలుతప్ప మరేమీ ఆమెకు లభించడం లేదు. రోజూ తను ఇల్లు చేరుకునే సరికి రాత్రి ఎనిమిది గంటలవుతున్నది. తనకు దొరికిన జీతం అన్నీకలిపి తొమ్మిది వందలు, ప్రయివేటు సంస్థ కాబట్టి జీతాలు బాగానే ఉన్నవి. తనకు తక్కిన వారికంటె హెచ్చుగనే జీతం దొరికింది. బట్టలు అవి రెండువందల యాభై రూపాయలయాయి. తన బస్సుఖర్చులకి వాటికి వందాయాభై రూపాయలు కావాలి. మిగిలిన అయిదు వందలు అత్తచేతిలో పెట్టింది. జానకమ్మ, రామచంద్రయ్య సంతోషం వెలిబుచ్చారు, కాత్యాయనికి పరికిణీ,జాకెట్టు బాగా నచ్చాయి. శేఖర్ తనబట్టల కొలతలు వదినకు సరీగా ఎలా తెలిశాయని ఆశ్చర్యపోయాడు.

ఎనిమిది దాటిపోయింది. సత్యమూర్తి ఇంకా ఇల్లు చేరలేదు. ఈమధ్య ప్రమోషన్ దొరికినదగ్గిరనుంచీ అతను మరీ ఆలస్యంగా ఇల్లు చేరుతున్నాడు.

సరస్వతి ఒళ్లు కడుక్కుంది. తెల్లటి చీర, జరీ అంచు ఉన్నది, కట్టుకుంది. అప్పటికింకా తొమ్మిది అయింది. పిల్లలు, అత్త, మామ భోజనం చేశారు. మూర్తి వస్తే ఇద్దరు కలిసి భోజనం చేయాలి.

సరస్వతి మేడమీదిగదిలో తనమంచం ముందుకు లాక్కుంది. కిటికీలోంచి సముద్రంవేపు చూచింది. అలలు చిన్నవిగా ఉన్నాయి. బహుళ పంచమినాటి చందమామ సాగరగర్భం చీల్చుకొని పైకి వస్తున్నాడు. కొంచెంసేపు అటువేపుచూచి, తరువాత ఈ ప్రపంచంలోకి వచ్చింది. టేబులుమీద కొనితెచ్చిన రుమాళ్ళు అలాగే పడి ఉన్నవి. వాటికి ఎటువంటి రంగుబోర్డరు లేదు. బోడిగా వుండి, బాగాకనిపించడం లేదు. పెట్టెతీసి, నీలందారం, సూదితీసుకుని ఫ్రేములో రు బిగించి కుట్టడం మొదలుపెట్టింది. చిన్న అరీను– దానిమీదను లవ్' అని కుట్టింది. దీపం వెలుతురులో జాగ్రత్తగా దానిని చూ డిజైను చాలచక్కగా వచ్చింది.

అలా కుట్టువేపే చూస్తూ కూర్చుంది. ఏదో ఆత్మ వి చేసుకోవడం మొదలు పెట్టింది. ఇప్పటికి కూడా సత్యమూర్తి ఆమె అభిప్రాయం మారలేదు. తనని పెళ్ళిచేసుకోవడం, తన లకు తూచా తప్పకుండా అంగీకారం తెల్పడం, అన్నీ ఉన్నాయి. కాని, ఇద్దరూ కలిసి ఒకే గదిలో పడుక్కుంట ముచ్చటకయినా కౌగిలించుకొని, ముద్దు పెట్టుకొని, తను కా అలిగి, కోపం తెచ్చుకొని, తనతో మాటలు మానివేస్తే, అత ఎంతో గౌరవం కలిగేది. అతను కొంచెమేనా తనపైని అధి చూపినా, సంతోషించేది. అతనికి ధైర్యం కలగడం లేదు. చి అతను భర్తగా తన హక్కులను ఉపయోగించి తనను రేప్ చే మరునాటి నుండీ అతనికి దాసురాలై ఉండేది. కాని అతను బుద్ధిమంతుడు మూడేళ్ల క్రిందట పెండ్లయిన నాటి మాట నేటికీ అమలులోనే ఉంచాడు. తను కురూపి అయి, రోగిష్ఠి అయి, సం చేయడానికి యోగ్యురాలు కానప్పుడు, తనను విసర్జించడంలో తప్ప ఇంతెందుకు – ఆఫీసులో అందరూ మేనేజింగ్ డైరెక్టరు వె అటెండెంటు వరకు తనను చూస్తే, ఒక్క క్షణం నిలబడి, సౌందర్యాన్ని ఆరాధన చేసి వెళ్లిపోతారు. కాని, ఇంటిదేవుడు రాతికి మల్లె తన అందచందాలను గుర్తించడం మానివేశాడు.

సరస్వతి ఇంటర్వ్యూ జరిగిన రోజు జ్ఞాపకం వచ్చింది.

రామాచారి, అతన్ని చూడగానే పోల్చుకుంది. ఎన్ని సైడు లున్నా, మీసాలెంత పెంచినా, జుత్తును పోషించినా, ఆ అరుఅ మనిషిని వెంటనే గుర్తుపట్టవచ్చు. తనని చూస్తే అతను చాలా షంతో మాట్లాడాడు. తనకి అందరికన్న హెచ్చు జీతం

### మనవి

కొంతకాలంగా ఏర్పడిన న్యూస్‌ప్రింట్ కొరత వలన భారతిని సకాలంలో వెలువరించటం కష్టంగా ఉంటోంది. అందుచేత డిసెంబరు 1984, జనవరి 1985 సంచికలని కలిపి వేస్తున్నాము. ఫిబ్రవరి నుంచి భారతిని సకాలంలో వెలువరించటానికి కృషి చేస్తున్నామని మనవి!

ర్గాలు చూపించాడు. చాల చక్కగా ఉన్నాడు. మంచి హోదాలో న్నాడు. ఆనాటి రాత్రి రంగనాయకమ్మగారు అడ్డుపడకుండా ఉంటే ను ఈనాడు మిసెస్ రామాచారిగా ఉండేది. అతనికి ఇద్దరు బిడ్డలను ఉండేది.

మనోహర్ ఎంత చక్కగా ఉన్నాడు. ఎంత సభ్యతగా మాట్లా డు. సమస్యలను ఎంత సులువుగా అర్థం చేసుకున్నాడు! తనకు ్యోగం దొరుకుతుందనే ఆశ లేకపోయింది. కాని, తన కోసం అతను ంపిగారి కాండిడేటునుకూడా కాదని ఉద్యోగమిచ్చాడు. చాల దక్షతతో ంత పెద్ద సంస్థను నిర్వహిస్తున్నాడు. తరచు విదేశాలకు పోయి స్తుంటాడు. ఇంజనీరింగ్ సెమినార్లకు విధిగా హాజరవుతాడు. అతని ో రోజ్‌కి అతనికి సంబంధం ఉందని అంటారు. ఇద్దరూ చనువుగా ్టట్లు కూడా పైకి తెలియదు. స్టాఫ్‌కి అతని మీద మంచి అభిమానం డు అందరి యోగక్షేమాలు, చిన్న, పెద్ద తేడా లేకుండా,అందరిని ారించి సహాయం చేయడానికి ప్రయత్నిస్తాడు. అన్నిటికి మించి ోహర్ చాల సామర్థ్యమున్నవాడు. అన్నపని విధిగా అనుకున్న కు ముగిస్తాడు. ఎటువంటి కార్యమయినా సాధించగలడు. అటు ్టర్లనుండి, ఇటు వర్కర్లనుండి, ఇంకా షేర్‌హోల్డర్లనుండి అతను నందనలు పొందుతుంటాడు. ఇటువంటివారు చాల అరుదుగా నిత్య తంలో లభిస్తారు. తాను పొరపాటే చేసింది. అతను ప్రామిస్ డు. రాజకుమారితో వివాహమయిన తరువాత తనను రిజిష్టర్డు ేజ్ చేసుకుంటానన్నాడు. అప్పుడు తను ఈ సంస్థలో ఉద్యోగిగా డదు. సర్వాధికారిణిగా ఉండేది. ఫారిన్ టూరులు, పార్టీలు - - మ్యర్ సర్కిల్సులో తన సౌందర్యానికి, తన తెలివితేటలకి మంచి గ్నిషన్ వచ్చేది...కాని....

క్రిందను స్కూటరు చప్పుడు వినిపించింది. సరస్వతి రుమా ప ఫ్రేమును పెట్లో పెట్టి క్రిందికి దిగిపోయింది. ఆ కుట్టినరుమాలు ్యమూర్తికి ఇవ్వాలని ఆమెకు అనిపించలేదు.

సత్యమూర్తి స్నానాదులు ముగించి సరస్వతితో కలిసి భోజనం డు. మేడమీదకు వచ్చిన తరువాత సరస్వతి తాను తెచ్చిన జీతం ంచి, తను పెట్టిన ఖర్చుగురించి చెప్పింది.

"సరస్వతీ! నేను చేయలేని పని నువ్వు చేశావు. ఎప్పుడూ ్ర ఖర్చుపెట్టేముందు నేను చాలసార్లు ఆలోచించి, పిడికిలి మూసు ూను. జీవితంలో కొన్ని సమపాయాలు కావలసివస్తే డబ్బు ఖర్చు ాలి. కొంతమంది మనస్సులను ఆనందింప జేయాలంటే పదిసార్లు ెంచకూడదు. ఈ యింటిని నువ్వు వెలుగుతో నింపా.వు" ్నడు సత్యమూర్తి.

సరస్వతి ఈ మాటలు విని గిల్టీగా ఫీలయింది. ఈ మాటలు అతను తన మెప్పును కోరి అనడంలేదు. హృదయపు లోతులలోంచి తను చేసిన పనిని ఆమోదించాడు. కల్లకపటంలేని సత్యాన్ని చెప్పాడు. అతని ముఖంలోకి చూచింది అక్కడ ఆమెకు మూర్తీభవించిన స్వచ్ఛత గోచరించింది.

మరునాడు డిజైను కుట్టిన రుమాలు తన హాండ్‌బాగ్‌లో పెట్టు కొని వెళ్లింది. ఆరోజు రాజకుమార్ పుట్టిన దినం. తన తరపున "విత్ లవ్" అని కుట్టిన రుమాలును అతనికి బహూకరిస్తే, అతను ఉబ్బి తబ్బిబ్బవుతాడు. ఒకసారి తనతో చెప్పాడు, తొలిచూపుల లోనే ఆమెను ప్రేమించాడని. ఈ చిన్న బహుమతితో ఆమె మనసు లోని అభిప్రాయం అతనికి విశదమౌతుంది.

సరస్వతి రెండవ అంతస్తుమీదికి ఆఫీసుకు వెళ్లిన వెంటనే వెళ్లింది. మనోహర్‌ని విష్‌చేసి తను తెచ్చిన రుమాలును ఇద్దామనుకుంది.

మానేజింగ్ డైరెక్టరు ఛాంబరు వెలుపల గ్రీన్‌లైటు వెలుగు తున్నది. ఎవరూ ఆయనతో లేరు. సమయం చాల అనుకూలంగా ఉంది. లోపలికి వెళ్లాలని అనుకుంటూ ఒక్కక్షణం ద్వారం దగ్గిర నిలబడింది.

ఆమె మనసు చేయబోతున్న పనికి ఎదురుతిరుగుతున్నది. ఏదో కలుగబోయే మహాప్రమాదం నుండి, దూకబోయే అగ్ని శిఖలనుండి నిర్ణయమొకటి ఒక్కసారి ఆమెను ఆపివేసింది. తాను చేయబోతున్న ఘోరమైన అసందర్భ కార్యాన్ని ఆమె గుర్తించింది. ఆ రుమాలు మనోహర్‌కి చెందవలసింది కాదు. సత్యమూర్తి ఆ బహుమతికి పాత్రుడు కాకపోవచ్చు. కాని బహుస్త్రీలంపటుడైన మనోహర్ అంతకన్నా అపాత్రుడు.

"ఏం సరస్వతీ! నిలబడిపోయావు?" సత్యనారాయణ లోపలినుంచి వస్తూ పలకరించాడు.

"యండీగారితో ఎవరైనా ఉన్నారా?"

"లేరు"

"ఆయనను ఒకసారి చూడాలి."

"నువ్వు ఎప్పుడు వచ్చినా, రెడ్‌లైటు వెలుగుతున్నా, ఆప వద్దని దొరగారి ఆర్డరు. నిరభ్యంతరంగా వెళ్లవచ్చు."

సరస్వతి ఛాంబరులోకి ప్రవేశించింది.

మానేజింగ్ డైరెక్టరు శ్రీరాజకుమార్ మనోహర్‌వర్మను ఆయన జన్మదినం సందర్భంలో అభినందించింది. అతను రెండు చేతులు జోడించి వినయంగా ఆమె సుభాకాంక్షలను స్వీకరించాడు.

## 14

"సరూ ! ఇవాళ ఇంత లేటయిందేమిటి? " రోజ్ ప్రశ్నించింది సరస్వతిని.

మధ్యాహ్నం లంచి అవర్‌లో, సంస్థలో పనిచేసే ఆడవాళ్ళు లేడీస్ టిఫిన్ రూములో చేరుతారు. పదిమందివరకు ఆడవారు మొదటి అంతస్తులోని వెనుక గదిలో ఒక గంట ఫలహారాలు తిని విశ్రాంతి తీసుకుంటారు. తెచ్చుకున్నవి తిని, ముఖాలు కడుక్కొని పౌడర్లు పూసుకొని, ఫ్రెష్‌గా మధ్యాహ్నం ఉద్యోగానికి వెళ్తారు.

అందరూ ఒంటిగంటకు అక్కడికి రావడానికి కుదరదు. ఒక రిద్దరు విధిగా ఆలస్యంగా వస్తారు. రోజ్ అందులో ఒకతె. డిక్టేషను మధ్యలో ఆమెకు రావడానికి వీలుపడదు. ఆమె మానేజింగ్ డైరెక్టరు గారికి, ఛీఫ్ ఆర్కిటెక్టుగారికి కంబైన్డు స్టెనో. మిగిలిన ఆఫీసర్లకు మరో యిద్దరు మగ స్టెనోలు ఉన్నారు. సరస్వతి కూడా తరచు ఆలస్యంగా వస్తుంది. టైపింగ్ పనికన్న ఆమెకు స్టోర్సుపని హెచ్చుగా ఉంటుంది. అందరూ సాయంకాలం అయిదు గంటలకు వెళ్ళిపోతే ఆమె ఆరు గంటలవరకు ఉండవలసి వస్తుంది. లెడ్జరు పోస్టింగు చేసుకొని, స్టోరుకు తాళం వేసి, సీలుచేసి మరీ బయలుదేరు తుంది.

"రోజ్! ఈ వెంకునాయు డెటువంటివాడు?" సరస్వతి రోజ్‌ని అడిగింది.

"వీడు యండీగారి కుడిభుజం. ఎడమ భుజం ఆ నారాయణ్: వీళ్ళిద్దరి నుండి బచాయించుకో!" రోజ్ ఆంగ్లో ఇండియన్ యాసతో మాట్లాడుతుంది. తెల్లగా,కొంచెం సన్నంగా, చాలాయాక్టివ్‌గా, సరదాగా నవ్వుతూ అందరిమధ్య తిరుగుతుంది. ఇంగ్లీషు చక్కగా మాట్లాడు తుంది. తెలుగులో, హిందీలో సినిమా పాటలు పాడుతుంది.

"ఈ వెంకునాయుడు యండీగారు ఊర్లో లేనప్పుడు విధిగా ఒంటిగంటకు మధ్యాహ్నంవేళ వచ్చి, ఒక అరగంటయినా స్టోరులో గడపనిది వెళ్ళడు. సామాను చూడడానికి బదులు నావేపే చూస్తూ వెకిలి నవ్వులు నవ్వుతూ, మీసాలు మెలివేస్తూ ఇబ్బంది పెడు తున్నాడు."

"వీడి చరిత్ర నీకు తెలియదు. ఈ సంస్థ ఏర్పడి ఇంకా రెండు సంవత్సరాలే అయింది. వీడు ముందు తాపీమేస్త్రి దగ్గర కూలీగా చేరాడు. అక్కడ ఆడపనివాళ్ళతో దెబ్బలాడి, కార్పెంటరు దగ్గిర కూలీగా వచ్చాడు. క్రమంగా చిన్న యూనియన్ ప్రారంభించాడు. దానికి తను నాయకుడుగా వ్యవహరించాడు. సంవత్సరం క్రింద సమ్మె నొకటి లేవదీశాడు. అప్పుడు మన పనులన్నీ ఒక నెలరోజులు ఆగి పోయాయి. యండీగారు యూనియన్ కార్యకర్తలను స్వయంగా కలిసి చాల కృషి చేశారు. కాని, వీడు చాల మొండిఘటం. అప్పుడు వీడికి సమమైనడ్జీ ఒకడు ఉద్యోగంలో చేరి ఈ సమస్యకు పరిష్కారం సజెస్టు చేశాడు. సమ్మె విజయవంతంగా ముగిసింది. ఒక నెల్లాళ్ళల్లో వెంకునాయుడు హెడ్‌మాసన్ అయ్యాడు. అసలు వీడికి ఏ పనీ రాదు. ప్రతీనెల వీడికి స్పెషల్ బోనస్ అందుతుంది. రెండువందల రూపాయలు కవరులో పెట్టి యండీగారు స్వయంగా ఇస్తారు. దానితో వాడి పొగరు అణగడం కాకుండా, యండీగారికి సన్నిహితుడయాడు. తరచు వీడిని ఆయన కన్సల్టు చేస్తుంటారు. మెడలో ఎర్ర రుమాలు కట్టుకొని, కాలరు బనియను తొడుక్కొని, పువ్వుల లుంగీ వేసుకొని, మీసాలు మెలిపెడుతూ పనిలో తిరుగుతుంటాడు. వర్కర్లను దబా యించి పని చేయిస్తాడు. పొగరుమోతులను తన్ని పనిలోనికి పంపు తాడు పోయిన రెండు వందలు పోయాయికాని, నిరంకుశంగా పాలన సాగుతున్నది."

"వీడిని వదిలించుకునే ఉపాయమేదేనా ఉందా?"

"అది ప్రాబ్లమే. ఈ బాస్టర్డు ఒకసారి నన్ను చాల హింస పెట్టాడు. గౌను చింపేశాడు. పక్కనే ఉన్న ఇనుపరాడ్‌ని తీసుకొని బుర్ర బద్దలు కొట్టడానికి మీదను పడ్డాను. డొక్కలో ఒక తాపు తన్నాను. వాడు అవకాశం కోసం చూస్తున్నాడు. ఎప్పుడూ వీడితో జాగ్రత్తగా ఉండాలి. ఆడకూలీలను ఆలా అల్లరి పెడుతునే ఉంటాడు. బాగా తాగుతాడు. వీడికి ముగ్గురు ఉంపుడు కత్తెలు. రాజకుమార్ గారికి అన్ని విషయాలు తెలుసు. 'పాములను జాగ్రత్తగా పెంచితే ఒకప్పుడు పనికొస్తాయి' అంటారాయన.

"మంచి పొజిషన్‌లో ఉన్న నీకే ఇంత ఇబ్బందిగా ఉంటే, నా వంటి దానికి ఇక్కడ పని చేయడం చాల కష్టమన్నమాట."

"అదే ఇక్కడి ఛాలెంజ్. ఇది ఒక జూ - దుష్టమృగాల మధ్య కొంతమంది తిరుగుతుంటారు. వాటికి ఆహారం పెడతారు. వాటిని రక్షించుతారు. కాని ఏ జంతువైనా ఎదురుతిరిగితే కాల్చి చంపడానికి ఆలోచించరు."

"మదించిన మృగానికి మరో ఆలోచన ఉండదు. ఎటువంటి ఘోరానికైనా అది వెనుదీయదు. ఆ మృగానికి మదం తలకెక్కిందని తెలిసిన దగ్గిరనుంచీ జాగ్రత్తగా ఉండాలి."

"రెండవ మృగం నారాయణ్ !"

"ఆ మృగమెప్పుడు ఉద్యోగంలో చేరింది ?"

"దానిని రామాచారిగారు ఒక సంవత్సరం క్రింద తీసుకొని వచ్చారు. వారుండే వీధిలో ఒక రెవెన్యూ ఇనస్పెక్టరుగారు ఉండేవారట.

వాళ్లు ఇప్పుడు సీతమ్మధారలో ఉన్నారట. ఆ యినస్పెక్టరుగారు సిమెంటు పెర్మిట్లను ఇప్పించడంలో చాల సహాయం చేశారు. ఆయన బావమరిది ఈ నారాయణ్! ఆయన రామాచారిని చాల రికమెండు చేశారు. యండీ గారితో చెప్పి రామాచారి అటెండెంటు ఉద్యోగం ఇప్పించారు. పెద్ద పెద్ద మృగాలు కూడా ఒక్కొక్కప్పుడు నక్క వంటి చిన్న మృగాల మాయలకు లొంగిపోతుంటాయి. ఈ వెంకు నాయుడు పొగరణచడానికి ఈ నారాయణ్ ఉపయోగపడ్డాడు. యండీ గారు ఈ కుంటివాడి తెలివితేటలకు చాల ఆశ్చర్యపడ్డారు. వెంకు నాయుడు లేవదీసిన సమ్మెలో ఏదో అగ్రిమెంటుకు రావడానికి యండీ గారు మెత్తబడ్డారు. అప్పుడే మనకు పది లక్షలవరకు నష్టం వచ్చింది. ఒక్క వెంకునాయుడుని మచ్చిక చేసుకుంటే, వాడి ఎదాన్న రెండు నూర్లు కొడితే రాబోయే సమ్మెలకు ముందుగనే అడ్డుకట్టవచ్చని ఈ కుంటివాడు చెప్పాడు. అప్పటినుండీ నారాయణ్ యండీగారి పెర్సనల్ అటెండెంటు అయాడు. వీడిని ఆయన మరో విధంగా కూడా ఉపయోగిస్తున్నారు. జేమ్సుబాండ్ అని వీడికి నామకరణం చేశారు. అలా పిలుస్తే ఈ మూర్ఖుడు సంస్థలోని ప్రతిఒక్కరి గుట్టుమట్లు, దిన చర్యతో సహా ఆయనకు చెప్తాడు. రాబోయే ఉపద్రవాలను రాజకుమార్ గారు చాల సున్నితంగా సకాలంలో నలిపారేస్తారు. ఇప్పటికి అయిదుగురిని తీసేశాడు వీడు."

"అలాగా!"

"అంతలో వదిలిపోయిందా! కొన్నాళ్లు నా వెంటపడ్డాడు. యండీగారితో చెప్తానంటే తప్పుకున్నాడు. ఇప్పుడు టైపిస్టు రుక్మిణి వెంటపడుతున్నాడు. భయపెట్టి ఆమెను లొంగదీసుకోడానికి చాల ప్రయత్నిస్తున్నాడు. కుంటివాడికి లొంగవద్దని ఆ అమ్మాయికి ధైర్యం చెప్పాను."

"రోజ్! ఈ కాఫీ తీసుకో! తరువాత ఈ గొడవలన్నీ ఆలోచించవచ్చు." అంది సరస్వతి కాఫీ కప్పులోపోసి ఇస్తూ.

రామచంద్రయ్యతో పాటు కోడలికి కూడా కాఫీ ఫ్లాస్కులో పోసి, టిఫెన్ తయారు చేసి ఇస్తుంది జానకమ్మ.

ప్లేటు, కప్పులు కడిగి సరస్వతి మళ్లా రోజ్ దగ్గిరికి వచ్చింది.

"రోజ్! ఒక విషయం చెప్పు, "సరస్వతి గది నలుమూలలా చూచింది. తక్కిన ఆడవాళ్లు వెళ్లిపోయారు. మరెవరూ లేరు.

"ఏమిటది?"

"నీకు రాజకుమార్‌కి ఎంతవరకు పరిచయం?"

"సరూ! ఇటువంటి విషయాలను వేరే అడుగుతావెందుకు? వారానికి రెండు రాత్రులలో, సరిగా పదకొండు గంటలకు స్వోర్డు పోటలో నున్న మా యింటి ముందు - అదేమీ మా యిల్లు కాదు. మే మంటున్న రాజకుమార్ ఇల్లు - ఒక క్రీము కలరు అంబాసిడర్ ఆగుతుంది. దానినుండి ఒక రాజకుమారుడు దిగి తిన్నగా మేడమీదకు దారి తీస్తాడు. అతనికోసం స్కాచ్, సోడాలు, ఆయిస్క్యూబులు, కాజూనట్సు, చికెన్ కట్‌లెట్సు - వీటితోపాటు ఒక రోజ్!"

సరస్వతి ఆమె ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది. ఒకప్పుడు ఆ మేడ, ఆ ఫర్నీచరు, ఆ భోగం అంతా తనకతడు ఆఫర్ చేశాడు. తనే వద్దని తోసిపుచ్చింది.

"రోజ్! ఇటువంటి జీవితం నీకు ఆనందకరంగా ఉందా?

"సరూ! ఒళ్లమ్ముకున్నవాళ్లకి ఆనందముంటుందా అంటే వాళ్ళేమి చెప్పగలరు? వాళ్లకి కావలసినది సంసారపోషణకు డబ్బు. దానిని సంపాదించే మార్గాలలో ఇదొకటి. ఈ సరసుల ఆకారాలు ఎంత ఆకర్షణీయంగా ఉన్నా, వాళ్ల మనసులలోని దుర్గంధం ఒకొక్కసారి వెలువడి భరించరానిదిగా ఉంటుంది."

(ఇంకా ఉంది)



# కలగూరగంప

## ఉత్తరేశ్వరపుర తామ్ర శాసనము - ఒక పరిశీలనము

పావు శతాబ్ది కాలము క్రిందట ఖండవల్లి గ్రామవాసులు మా మిత్రులు సాంబశివరావు సోదరులు తమ గృహ నిర్మాణము కొరకు పునాదులు త్రవ్వించుచుండగా మూడు తామ్ర శాసనములు లభించినవి. మా స్నేహమును పురస్కరించుకొని, నేనా మూడు శాసనముల ప్రచురణార్థము నా పరము గావించుకొంటిని. అందు మొదటిది ఒక రేకు, రెండవది అయిదు రేకులు కలిగి, రాగి కడియములచే బంధింపబడి, పైన రాజ ముద్రికల కలిగియుండి, మంచి స్థితిలో నున్నవి. మూడవది ఏడు రేకులు కలిగి కడియముగాని, రాజ ముద్రికగాని లేకుండ విడివడి యుండి, ఒక తీగచే బంధింపబడియున్నది.

నా పరమైన ఆ మూడు శాసనములలో ఒకే రేకు కల్గిన దానిని 1959వ సంవత్సరం నవంబరు నెల "భారతి"లో "కోన గణపతి ఖండవల్లి శాసనము"ను పేరున ప్రచురించియుంటిని. అయిదు రేకులు గల రెండవ శాసన పాఠముల గుర్తించి, నిర్దుష్ట మొనరించుకొని ప్రకటింప సుద్యుక్తుడనై యున్నతరిని, సాంబశివరావుగారి సోదరుడు సత్యనారాయణగారు ఆంధ్ర విశ్వవిద్యాలయములో 'సర్టిఫికేట్ కోర్సు'న కరుగుటయు, నట ఆచార్య శ్రీ ఓరుగంటి రామచంద్రయ్యగారు నేను "భారతి"లో ప్రకటించిన "కోన గణపతి ఖండవల్లి శాసనము"ను బట్టి యావద్విషయముల దెలిసికొని, సత్యనారాయణగారిని మోమోటము పెట్టి, నాకిచ్చిన ఆ మూడు శాసనములను తమ పరము గావింప నొప్పించి, ఆ మూటిని తమ చేజిక్కించుకొని, ఆంధ్ర విశ్వ విద్యాలయము నందలి చరిత్ర, పురావస్తు శాఖల కొసంగిరి. అప్పటికే నేను అయిదు రేకులుగల శాసనమును ఎపిగ్రాఫియా ఆంధ్రికా సం. 4 లో "దాయగజ కేసరి ఖండవల్లి శాసనము"గా ప్రచురించియుంటిని.

శ్రీ ఓరుగంటి రామ చంద్రయ్యగారు పైన చెప్పిన రీతిగా మూడు శాసనముల దమ హస్తగత మొనరించుకొన్నను, వాని ప్రచురణ విషయమై యెట్టి ప్రయత్నము నొనరింపలేదు. ఆ సమయమున వయో వృద్ధత్వ కారణమున విశాఖ పట్టణములో యుండి, విశ్రాంతి జీవితమును గడుపుచున్న శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి కా ఏడు రేకుల శాసన ప్రచురణ భారము నప్పగించి శ్రీ రామచంద్రయ్యగార తమ పని అయినదని తృప్తిగా నిశ్వసించినారు. శ్రీ సోమ శేఖర శర్మగారి వద్దనున్న ఆ ఏడు రేకుల శాసనమును ప్రభుత్వ పురావస్తు శాఖలో పని చేయుచున్న మా మిత్రులు శ్రీ కొల్లూరి హర్షవర్ధన శర్మ గారు చూచి, శ్రీ సోమశేఖరశర్మగారి అనుమతితో శాసన ప్రతిబింబముల దీసికొనిపోయి మైసూరు నందలి తమ ఆఫీసులో భద్రపరచిరి శ్రీ సోమశేఖరశర్మగారు శివ సాయుజ్యమందగా ఆ ఏడు రేకుల శాసన మప్రకటితముగా మైసూరు, విశాఖ పట్టణములలో నుండిపోయినది. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు ఆ శాసనము రేకులను తిరిగి తెప్పించికొని వారి చరిత్ర, పురావస్తు శాఖలో భద్రపరచుకొనిరి ఈ విధిని తొలుత నాకు లభించిన మూడు శాసనములలో రెండు మాత్రము నాచే ప్రకటింపబడుటయు, మూడవది ప్రకటన భాగ్యమునకు నోచుకొనకుండ నజ్ఞాతముగ నుండిపోవుట సంభవించినది.

ఈ రీతిగ నడచిన పూర్వ చరిత్ర నెరింగియో, నెరుంగకుండగనో వర్ధమాన యువ పరిశోధక ద్వయము శ్రీ కె. వి రమేష్, శ్రీ వి. యస్. సుబ్రహ్మణ్యం గారలు ఎపిగ్రాఫియా ఇండికా సం. 38 లో ఈ శాసనమును ప్రకటించుచు "ది ఇంప్రెషన్స్ ఆఫ్ దీజ్ కాపర్ ప్లేట్స్ వెర్ ప్రిపేర్డ్ బయి అవర్ లేట్ లేమెంటెడ్ కొలీగ్ శ్రీ కె. హెచ్. వి. శర్మ ఫ్రమ్ ది సెట్ ఇన్ ది పొసెషన్ ఆఫ్ ది లేట్ శ్రీ ఎమ్. సోమశేఖర శర్మ ఆఫ్ వాల్తెయిర్" అని చెప్పుకొన్నారు.

శ్రీ కె. వి. రమేష్, శ్రీ వి. యస్. సుబ్రహ్మణ్యం గారలు ఈ శాసనమునకు "ఉత్తరేశ్వర గ్రాంట్ ఆఫ్ కాకతీయ రుద్రాంబ ఎస్. ఎస్. 1211" అని పేరిడినారు. ఆ పేరిడుటలోనే వా ప్రమాదపతితులైనారు. అపై స్వవచన వ్యాఘాతమున కగ్గమైనారు. ఏలనన వారీ శాసనమునకు వ్రాసిన వ్యాఖ్యలో "వెన్ వీరరుద్రన్నృప వాస్ రూలింగ్ ఓవర్ ది కాకతీయ రాజ్య ఫ్రమ్ ది కాపిటల్ ఆఫ్ ఓరుగల్లు" అని వ్రాయుచునే, ఈ శాసనము కాకతి రుద్రాంబ ఉత్తరేశ్వర శాసన మనుటలోని అనౌచిత్యము వెల్లడి యగుచున్నది. ప్రసక్త శాసన కాలము 25 ఫిబ్రవరి, 1290. అప్పుడికి కాకతీయ రాజ్యమును పాలించుచున్నది రెండవ ప్రతాపరుద్రుడు. రుద్రమా

ఆనాటికి స్వర్గస్థురాలైనది.[1] కావున నీ శాసనమును కాకతి రుద్రాంబ యిచ్చినదనుట హాస్యాస్పదము. అదియునుగాక రుద్రమ బ్రతికి యుండగనే ప్రతాపరుద్రుడు తన మాతామహితోబాటు సింహాసనా శీనుడై యుండి రాజ్యభారము వహించి వ్యవహరించుచున్నట్లు చారిత్రక నిదర్శనము లున్నవి.[2]

"శకవర్షంబులు 1202 నేండు మల్లవోలి చిమ్మేశ్వర శ్రీ మహాదేవరకు [ప్రతాపరుద్రదేవు] అంగ్గరక్ష[చా] నయనాయంక్కలు పెట్టిన క్షేత్ర శాసనము ...... విఖ్యాత ధైర్యే ప్రబల విక్రమే శ్రీ మత్ప్రతాప రుద్రేశే నిత్యం సామ్రాజ్య దీక్షితే"

ఇట నొక విశేషమును దెలుపవలసి యున్నది. శాసనములో పలు చోట్ల "వీరరుద్రనృపతి" "రుద్రకుమారవీర" "రుద్రనృపాల మౌళి" యను పద ప్రయోగములు కానవచ్చుచున్నవి. అవి రుద్రమ దేవికి వర్తింపవని శ్రీ రమేష్, శ్రీ సుబ్రహ్మణ్యంగార లెఱింగకుండ నుండరు. రుద్రమ వహించిన పురుష నామములోని సంబోధన లెక్కడను కానుపింపవు. ఆ కారణము చేతనైనను ఆ యువ పరిశోధక ద్వయము "ఉత్తరేశ్వర శాసనము" కాకతీయ రుద్రాంబది కాదను అభిప్రాయమునకు వచ్చియుండి, తదను గుణముగ శాసన నామము నుంచి యుండవలసినది! అట్లు వారు గావింప కుండుటతో విమర్శనా పాత్రులగుచున్నారు.

శాసనము రచించుటలో దొరలిన మరొక తప్పును వీరు గుర్తించి, సవరించి సమన్వయించుటలో కృతకృత్యులైనారు. శాసనము 18వ పంక్తిలో "తత్బాంధవః పంకజ బాంధవాన్వయే (19) జాతా (తో) నృపోనామని విష్ణువర్ధనః" అన్న వక్కాణమును వీరు తప్పు అని నిరూపించుచు "పంకజ బాంధవ" అను పదమునకు మారు "కుముద బాంధవ" అను పద ప్రయోగము అర్థవంతము, చారిత్రక సమ్మతమని సాయించినారు. ఈ మార్పు సమంజసమైనదైనను, ఛందో భంగమొనగూర్చుచున్న విషయమును వారు గమనించలేదు. ఈ మార్పు వలన యదార్థము వ్యక్తమగుచున్నను, శ్లోకములో గణ భంగము నొన గూర్చుచున్నది. చంద్రునకు పర్యాయ పదమైన మరొక గీర్వాణ పదమును ఛందోభంగము లేకుండనుండ సూచించిన బాగుండెడిది.

శాసనములోని 26, 27 పంక్తులలోని "తస్మాదలభత గ్రామ ముత్తరేశ్వర మాఖ్యయా! రుద్రదేవ సుధీర్ధాతుం గురవే గురుదక్షిణామ్" అను వక్కాణమును వీరు "లెర్నెడ్ రుద్రదేవ అబ్టెయిన్డ్ ది విలేజి ఉత్తరేశ్వర ఫ్రమ్ ఇందు శేఖర ఇన్ ఆర్డర్ టు గ్రాంట్ ఇట్ టు హిస్ టీచర్ యాజ్ గురు దక్షిణ" అని అనువదించినారు. ఉత్తరేశ్వర పురము రుద్రదేవుడు చాళుక్య ఇందుశేఖరుని వలన దానముగా గ్రహించి, దానిని గురు దక్షిణగా విద్దనాచార్యున కొసంగెను. దీనికి విరుద్ధముగా "దాయగజకేసరి ఖండవల్లి శాసనము"లో రుద్రదేవు డా దానమును పొందినట్లుగా గాక, విద్దనయే స్వయముగ పొందినట్లు "యః ప్రాప్యస్వయ మిందుశేఖర నృపా చ్చాలుక్య వంశోద్భవా దష్టై శ్వర్యముదుత్తరేశ్వర పురం గ్రామం మహీభూషణం" అని చెప్పబడి నది. ఈ విరుద్ధ వక్కాణముల వలన వచ్చు ప్రమాదమేమియులేదు; గాని చాళుక్య ఇందుశేఖరుడు రుద్రదేవున కుత్తరేశ్వరపురము దాన మిచ్చుటకు అతని పాండిత్యమే కారణమా? కాక మరేమైన కారణ మున్నదా? యను జిజ్ఞాస కలుగుట సహజము!

రుద్ర దేవుడు పండితులను, కవులను పోషించుచు ననేక దానములిచ్చుచు, తర్క మీమాంసాది శాస్త్రములందు, కవిత్వమునందు దిట్టయని ప్రసిద్ధి నందుటయేగాక, యుద్ధ విద్యలో నసమాన శూరుడని కూడ ప్రసిద్ధి నందినవాడే! ఆ కారణముచే నాత డిందుశేఖరునిచే పొంద బడిన ఉత్తరేశ్వర గ్రామమును గురు దక్షిణగా విద్దన కిచ్చుటలో నాశ్చర్య మేమియులేదు! కాని ఇందు శేఖరుడు రుద్రదేవుని పాండిత్యా మునకు మెచ్చి ఈ దాన మిచ్చినటుల చెప్పదగు నాధారములు లేవు! కాని "దాయ గజ కేసరి ఖండవల్లి శాసనము" లోని "బ్రూమః కిం విద్దనాచార్య వృత్తః విన్నయ యజ్వనః! రుద్ర దేవః పురారీ రజయ ద్యత్తు ప్రసాదతః" అన్న వక్కాణములో రుద్ర దేవుని శౌర్య ప్రతాపముల పొగడ్త కాన్పించుచున్నది. రుద్రదేవు డిందుశేఖరు కడ పాండిత్య ప్రకర్షకుగాక శౌర్య పరాక్రమములకే ప్రసిద్ధి కెక్కినట్లు తోచుచున్నది. ఈ సందర్భమున కాకతి ప్రతాప రుద్రుని సైన్యాధి కారులలో చాళుక్య ఇందు శేఖరుడు, ఇందులూరి అన్నల దేవునితో పాటు సోమయాజుల రుద్రదేవుడను మరొక సైన్యాధికారి యున్నట్లు తెలియనగుచున్నది. ఆ రుద్రదేవుడే ఈ రుద్రదేవుడైన, చాళుక్య ఇందుశేఖరుడు తన ప్రభువు రెండవ ప్రతాప రుద్రునికి తనతోబాటు కాయస్థ అంబ దేవుని త్రిపురాంతకమువద్ద యుద్ధములో నోడించుటకు

1. ఇది వరలో రుద్రమదేవి క్రీ॥ శ॥ 1295 వరకు జీవించి యుండి రాజ్యము చేసినదని తలంపు ఉండెడిది. ఆ తలంపే యదార్థమైన, ఈ శాసనము కాకతీయ రుద్రాంబదేయని వాదించుట సమర్థనీయమగును; కాని- చందుపట్ల శాసనము వలన రుద్రమదేవి క్రీ॥ శ॥ 1289లోనే (25-11-1289) రణరంగమున వీరస్వర్గ మలంకరించినట్లు స్పష్టమైనది. (భారతి - సంపుటము 51 - సంచిక 5)

2. సౌ. ఇన్. ఇన్. వాల్. 10, నెం. 451 (ఎ. ఆర్. నెం. 884 ఆఫ్ 1920) ఆన్ ది నంది పిల్లర్ నియర్ ది ధ్వజస్తంభ ఇన్ ది టింపుల్ ఆఫ్ చిన్నమయేశ్వర, మల్లవోలు (బందర్ తాలూకా, కృ. జి.)

సాయపడినందులకు మెచ్చికోలుగా నీ దానమును రుద్రదేవున కొసంగి యుండినట్లూహింప వచ్చుననిపించుచున్నది!

శాసనములోని 86-93 పంక్తులలో "యస్మైకృతం ప్రథమ దర్శన ఏవ రాజ్ఞా కర్పూరపూగ ఫల భోగ సమర్పణంచ। (50) ఆదత్త యస్మై స్వయమాత పత్రం య్యాందోళికాం రుద్రకుమార వీరః॥" అన్న వక్కాణములో "ఆందోళిక" అన్న "చామరము" (విసనకర్ర) అన్న అర్థములో నుపయోగింపబడినట్లు అభిప్రాయపడి నారు, కాని అది తప్పు "ఆందోళిక" మన్న "పల్యంకికము" (పల్లకి) అని యర్థ్యర్థమున్నది.

ఈ శాసనము మూలప్రతిలో "దాచాపల్లి" గ్రామ ప్రసక్తి లేదు. యదార్థ విషయ మట్లుండ వీరు శాసన పాఠమును సరిగా నన్వయించుకొనలేక (148-78 పంక్తులలో) "విద్దన్న అబ్టెయిన్డ్ యాన్ ఎడిషనల్ ఎక్స్టెంట్ ఆఫ్ లాండ్ ఇన్ ది విలేజెస్ ఆఫ్ దాచే పల్లి (?) ఎండ్ పులుప్రురు ఎండ్ షేర్డ్ ఇట్ అవుట్ టు సమ్ మోర్ బ్రాహ్మిన్స్ ఎగెయిన్ రిటెయినింగ్ 12 షేర్స్ టు హింసెల్ఫ్" అని వాక్రుచ్చినారు. తత్సంబంధమైన శాసన పాఠమిది "పునరపి విద్దనాచార్యే రౌనపల్లి పులుపత్రైచ త్రి (౦) శత్ఖారిమితం క్షేత్రం లబ్ధ్వా తదుభయ ముత్తరేశపురేం తర్భావ్య విప్రేభ్యో దత్తం" అని యున్నది. ఇందు "ఓనపల్లి" అను పదమును వీరు "దాచపల్లి" గా పొరబడి యట్లు వ్రాసినారు. ఆప్రకార మీ శాసనములో "దాచపల్లి" ప్రస్తావనమేలేదు! సరిగా ఆవగాహన చేసికొనలేక నా యువకద్వయము తమ యూహానుసారముగ రచన సాగించి సమస్య సృష్టించినారు.

విద్దనాచార్యుని తండ్రి శ్రీ కంఠాచార్యుడని శాసన పాఠము నపార్థము చేసికొని అట్లు వ్రాసినారు. కాని - విద్దనాచార్యుని తండ్రి శ్రీ రంగాచార్యుడని శాసన ముద్ఘోషించుచున్నది చూడుడు.

"కపిముని కులమాస్తే యత్రమైత్రీం రచయతి
పంకజభూ కురంగనేత్రీ
... ... ... ... ...
తతోఽభూ ద్దేవనాచార్యః సౌజన్యామృతవారిధిః
నకదాచి దభూద్యస్మాదభిజన్యో హలాహలః॥
యస్మిన్ వదతి గోష్ఠీషు ప్రతివాదిత్వ ముద్రిషు
తత్తనూ భూర భూద్ధన్యః శ్రీ రంగాచార్య కోవిదః ।
... ... ... ... ...
తతోఽభూ ద్విద్దనార్యో యః శంకరాదివ షణ్ముఖః ॥

శాసనము లభ్యమైన విధము తెలియకున్ని వారు శాసనములో నుదాహృతములైన గ్రామముల, దాన గ్రామ సీమావధుల సరిగా గుర్తింపనేరక తమ నిస్సహాయతను వెల్లడించినారు.

వీరు కొంచెము శ్రమదీసికొని "కోనగణపతి ఖం శాసనము" "కాటయవేముని అన్యమావరత్నామ శాసనము పరిశీలించి యుండిరేని, ఉత్తరేశ్వర పుర శాసనములో నుదాహృ లైన స్థలములలో పెక్కింటిని గుర్తుపట్టి తెలిపే సావకాశ యుండెడువారు. అట్లు చేయమి ఉత్తరేశ్వర పురశాసన ప్రాధాన్య గుర్తింప వీలులేకుండ బోయినది.

ప్రసక్త శాసనములో నుదాహృతమైన గ్రామములు, నేటి స్వరూప స్వభావాదుల నీ క్రింద వివరించుచున్నాను.

భీమవల్లభ పురము = ప॥గో॥జిల్లా, భీమవరం తా॥ భీమవ కావలెను.

వాగీశరత్నాకరము = దీని ఉనికినిగుర్తించుటకు వీలుపడుట

పులుప్రురు = పులుపర్రి గ్రామము (ప॥గో॥జిల్లా తణుకు అన్నవరప్పాడు)

ఒనపల్లి = ప॥గో॥జిల్లా తణుకు తా॥ మల్లేశ్వర గ్రా కావలయును.

కదమి = ప॥గో॥జిల్లా తణుకు తా॥ పిట్టల వేమవరం కడింపాడు

ప్రేకేటి = ప॥గో॥జిల్లా తణుకు తా॥ పేకేరు గ్రామం.

ముక్రోమల = ప॥గో॥జిల్లా తణుకు తా॥ ముక్కామల గ్రా

ఉత్తరేశ్వరపురం = ప.గో.జిల్లా తణుకు తా॥ ఖండవల్లిగ్రా

పై పట్టికను పరిశీలించినచో ఉత్తరేశ్వరపురము నేటి ఖం గ్రామమని దానికి సరిహద్దులుగ చెప్పబడిన వివిధ గ్రామములు పరివర్తనములతో నేటికిని ఖండవల్లి చుట్టియున్నవని తెల్లమగుచున

మైసూరులోని ఆర్కిలాజికల్ సంస్థలో పనిచేయుచున్న కె. వి. రమేష్, శ్రీ వి. యస్. సుబ్రహ్మణ్యంగారలు ఎపిగ్రాఫి ఇండికా సం 38లో ప్రచురించిన "ఉత్తరేశ్వర గ్రంథ ఆఫ్ కాక రుద్రాంబ, ఎస్ ఎస్ 1211" వ్యాసము శాసన ప్రతిబింబ ఆధారముగా గొనుట వలన వారి పాఠములలో కొన్ని తప్పులు లినవని నుడువుచు, వానిని సవరింప బూనుకొని శాసనపు రేకులు ఆధీనములో నుంచుకొన్న శ్రీ సి. సోమసుందరరావు, శ్రీమతి ప్ర చిన్నప్పగారలు సంయుక్తముగా "కాకతి వీరరుద్రుని ఉత్తరే త్నామ శాసనము (శక సం॥ 1211) అను పేరున 1976వ సం జూన్ నెల "భారతి" లో నొక వ్యాసమును ప్రచురించినారు. శాసనము లభించిన తీరుతెన్నుల వివరించుటలో అర్థసత్యా వెల్లడించినారు. శాసనలబ్ధికై జరిగిన పూర్వాపర సంఘటనలు వ తెలిసియుండక పోవచ్చును. వాని వివరముల నేనింతకుముందే వివర తినిగాన, చర్వితచర్వణముగా మరలనిట ప్రస్తావించుట భావ్యముగాది

వర్ధించిన వి స్తరిగా లభ్యమైన శాసనము; దాని ప్రతిబింబముల నాధారముగా గొని, వ్యాసములు వ్రాసి ప్రచురించిన ఫలితము వారి వచనములలోనే వ్యక్తమగు చున్నది. శ్రీ కె. వి. రమేష్ శ్రీ వి. యస్. సుబ్రహ్మణ్యంగారలు వారి నిస్సహాయతను వెల్లడించు చుండ, కొంతలో కొంత ఈ శాసనము దొరికిన చోటు నెఱింగిన శ్రీ సి. సోమసుందరరావు శ్రీమతి ప్రతిభచిన్నప్పగారలు "ఉత్తరేశ్వరమును గుర్తించుట కష్టము" అని తమ నిస్సహాయతను వెల్లడించినారు. ఇది చాలా వింతగానున్నది.

శ్రీ సి. సోమసుందరరావు, శ్రీమతి ప్రతిభచిన్నప్ప గారలు "ఉత్తరేశ్వరము దానముగానిచ్చినది కాకతి వీరరుద్రునిదని వ్రాయుట ఎపిగ్రాఫియా ఇండికాలోని వ్రాతను అధారకరించునదై యున్నది. వీరి వ్రాత సమర్ధనీయమైనను ఆ నిర్ణయమునకెట్లు వచ్చినది వివరింప ప్రయత్నింపలేదు. అందువలన పాఠకులు ఈ శాసనము "కాకతీయ రుద్రాంబదా? లేక కాకతి వీరరుద్రునిదా? అన్న విచికిత్సకు లోనగుట సంభవించుచున్నది.

వీరి వ్యాసములో నొక ముఖ్యమైన విషయము విస్మరింప బడినది. ముఖ్యమైన ఆ విషయమై వీరు చర్చించి, సమస్యను పరిష్కరించి నిర్ణయించక పోవుటచే చరిత్ర విరుద్ధమైన వ్రాత అట్లుగా నిలిచిపోయినది. రుద్రదేవునికి ఉత్తరేశ్వర పురమును దానమొసగిన చాళుక్య ఇందుశేఖరుని వంశ ప్రశస్తి గూర్చి శాసనములో దొరలిన ముఖ్యమైన తప్పును వీరు గమనించి యుండనేలేదు! "దాతయొక్క ప్రపితామహుడు కాకతీయుల బందుగు అని తప్ప స్పష్టమైన బంధుత్వము శాసనము తెలుపుటలేదు. కాని - వారు కాకతీయులతో వైవాహిక సంబంధములుగల నిడదవోలు చాళుక్యులు తప్ప వేరొకరు కారు" అని ధృవీకరించుమనే, వీరాచాళుక్యులు "పంకజ బాంధవాన్వయ సంభవుల" ని శాసనము చెప్పుచున్న మాటను చరిత్ర విరుద్ధమైన దానిగా ప్రకటింపలేదు! శాసన పాఠమిట్లున్నది "శ్రీ మత్కాకెత (త్కాకతి) రాజ్య భారవహన ప్రేంఖద్భుజావిక్రమో, యస్య త్యాగ ముదీక్ష్య కల్పవిటపీ వ్రీడా దినాగాద్దివం తద్బాంధవః పంకజ బాంధ వాన్వయే జాతా (తో) నృపో నామని విష్ణువర్ధనః" వీరి ప్రాలు మాలిక వలన నిడదవోలు చాళుక్యులు సూర్యవంశ సంభవులని తేలుచు, శాసనములో నితర పట్టుల చెప్పబడిన "చంద్ర వంశ్యులను మాటను వమ్ము చేయుచున్నది. ఇందు విషయమై వీరెట్టి చర్చను కొనసాగింపక నుదాహృతుడైన విష్ణువర్ధనుడెవ్వరో? గుర్తింప బహు శ్రమపడిరి వారి అన్వేషణాక్రమ పద్ధతి మంచి ఫలితమునే యొసంగి, యదార్థ విషయమును వెలికి దీయుట కుపకరించినది. "పంకజ బాంధవాన్వయ జాతులుగా నిడదవోలు చాళుక్యులు నిలిచిపోయిరి! ఇది కడువింతయైన విషయము. శ్రీ సి. సోమసుందరరావు శ్రీమతి ప్రతిభచిన్నప్పగారలీ విషయములో యేమరుపాటు చూపుట చరిత్రను తప్పుదారి పట్టించి, తలపట్లు పట్టించుటేయగు.

శాసన దాత చాళుక్య ఇందుశేఖర నృపాలుడు. ప్రతిగృహీత రుద్రదేవుడు. దాన గ్రామ ముత్తరేశ్వర పురము. ఆ ప్రకార మీ శాసనము చాళుక్య ఇందుశేఖరుని "ఉత్తరేశ్వరపుర శాసనము"ని పిలువబడవలెను. కాని-ఒక్కయెడ "కాకతీయ రుద్రాంబ ఉత్తరేశ్వర గ్రామ శాసనము" ని వేరొకయెడ "కాకతి వీరరుద్రుని ఉత్తరేశ్వర గ్రామ శాసన" మని పిలుచుటకు కారణమేమియో వ్యాసకర్తలలో నేరుసుచెప్ప శ్రద్ధవహింపలేదు. సర్వసాధారణముగా దానము లొసంగు అధికారము సార్వభౌములకే గాని ఒరులకుండదు. ఒక వేళ వారి సామంతులో, సైన్యాధ్యక్షులో, మంత్రులో అట్టి దానము లొనర్ప వలసి వచ్చినపుడు వారి ప్రభువు వంశ వర్ణనముతో శాసనమును ప్రారంభించి. తమ వంశాధిక్యతను ప్రకటించి, తమ ప్రభువు నామమునే శాసనమున కుంతురు. ప్రభువు రాజముద్రిక క్రిందనే తచ్ఛాసన మొసంగబడును. ఇది సాంప్రదాయము. ఒక సామంత ప్రభువు తన ఆధిపత్యములోని రాజ్య భాగములో గల నేదేని గ్రామమును దాన మొసంగిన తొల్త సార్వభౌముని ప్రశంసయు, నా తరువాత సామంతుని వంశ ప్రశంసయు, నా పిదప దాన గృహీత వంశ ప్రశంసయు, పిదప దానగ్రామ ప్రశంసయు యుండుట లోకాచారము. అటులనే ప్రసక్త శాసనముతో కాకతి వీరరుద్రుని సామంతునిగా చాళుక్య ఇందుశేఖరుడీదాన మొసంగెను. గాన నా కాకతి రాజన్యుని పేరనే శాసనము పిలువబడుట సమంజసము. చాళుక్య ఇందుశేఖరుడు కాకతి వంశ రాజన్యుల బంధు కోటిలోనివాడుగా కూడ నెఱుంగబడుచున్నాడు, ఈ సాంప్రదాయము ననుసరించియే కాకతి వీర రుద్రుని సేనానియు' మంత్రియు పినతల్లి భర్తయునైన ఇందులూరి అన్నలదేవుడు శక సం॥రం. 1211 విరోధినామ సంవత్సర భాద్రపద బహుళ శుక్ర వారము (10-9-1289) నాడు "మర్పడిగ" మను గ్రామమును విద్దనాచార్యునకు దాన మొసంగెను. అటులనే శక సం॥రం. 1213 ఖరనామ సంవత్సర అర్ధోదయ పుణ్య కాలమున (21-1-1292) చాళుక్య ఇందుశేఖరుడు విద్దనాచార్యునకు "ఒనపల్లి" గ్రామమును అష్ట భోగ స్వామ్యముగ దాన మిచ్చెను. ఈ రెండు దానములు వేర్వేరు కాలములందు వేర్వేరు వ్యక్తులచే నీయబడినను అవి "దాయ గజ కేసరి" నామమున, కాకతీయ రాజముద్రికతో నీయబడినవి. "దాయ గజ కేసరి" బిరుదము రెండవ ప్రతాపరుద్రునికే చెల్లునని సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు శ్రీ పి. వి. పరబ్రహ్మ శాస్త్రిగారు తమ "కాకతీయ కాయిన్స్ ఎండ్ మెషర్స్" అను గ్రంథమున స్పష్టపరచి

నారు. కావున కాకతి ప్రతాపరుద్రుని మంత్రి సేనాధిపతి, సామంతుడు బంధుగులు అయిన అన్నల మంత్రి, చాళుక్య ఇందుశేఖరులు తామిచ్చిన దానముల తమ ప్రభువు కాకతి వీర రుద్రునిపేర, నాతని ముద్రిక క్రిందనే శాసనస్థ మొనర్చిరి. ఈ సాంప్రదాయమే ఉత్తరేశ్వర పుర గ్రామ దానము విషయమున గూడ వర్తింప జేయబడినది. ఈ శాసనపు రేకుల బంధించి యుంచు కడియము, రాజ ముద్రిక లభ్యముగాకుండ పోయినందున ఏ రాజన్యుని పేర నీ దాన శాసన మొసంగబడినదో తెలియరాని స్థితి యేర్పడినది. దాన భిన్నాభిప్రాయములకు తావొసంగినది.

"చరిత్ర విద్యాధర" **తురగా కృష్ణమూర్తి**

# ఆత్మైక్య బోధ

ఈ మధ్య నావద్దకు చేరిన తాళ పత్రములను పరిశీలించు చుండగా చక్కని వ్రాత గలిగి పత్రము లన్నియు బాగుగా ఉన్న తాళ పత్రముల సంపుటము కనిపించినది. దానిని తెరచి పరిశీలింపగా మొత్తం అందు 62 ఆకులు ఉన్నవి. వానిలో ఈ క్రింది గ్రంథాలు గలవు.

| | | |
|---|---|---|
| శ్రీరామ స్తవం - | ముమ్మడి మల్లన్న | - 35 పత్రాలు |
| ఆత్మైక్యబోధ - | యోగానందావధూత | - 5 పత్రాలు |
| గురు శిష్య సంవాదం | | - 14 పత్రాలు |
| సిద్ధ రామ శతకం | | - 8 పత్రాలు |
| | మొత్తం | 62 ఆకులు (పత్రాలు) |

పై గ్రంథములలో నాల్గును విమర్శకులకు ఈ వరకే తెలిసినను కవి చరిత్రల కెక్కినను అవి అముద్రితములుగానే ఉండి పోయినవి. వివరణాత్మక గ్రంథ సూచికలలో ఉదాహరించిన పద్యముల కంటే ఎక్కువ స్థాయిలో విమర్శనము జరుగలేదు. ప్రాచీన సాహిత్య విమర్శ క్రమముగా తగ్గిపోవుచున్న నేటి కాలమున ఈ గ్రంథముల గురించి తెలిసికొనవలెనను జిజ్ఞాసగల వారి యెఱుకకై వీనిలో ఆత్మైక్యబోధ'ను గురించి ఈ లఘు వ్యాసమును వ్రాయుచున్నాను.

తాళ పత్రములందు కేవలము 4 ఆకులలో రెండు వైపుల ఒక్కొక్క వైపున ఆఱేసి పంక్తులలోను 5వ ఆకులో ఒక ప్రక్క పూర్తిగా రెండవ ప్రక్కన కేవలము ఒక పంక్తిలో మాత్రము వ్రాయబడి ముగించబడిన లఘు ద్విపద గ్రంథమిది. వ్రాయస గాని అక్షరములు చక్కగా గలవు. గ్రంథము గూడా ఏ మాత్రము శిథిలము గాక చక్కని స్థితిలో ఉన్నది గానీ తప్పులు విపరీతముగా ఉన్నవి.

ఇది 211 ద్విపదలు గల లఘు గ్రంథము. కవి పేరేమియు లేదు. ఇందలి విషయమంతయు రాజ యోగమునకు సంబంధించిన వేదాంతము. ఈ తాళ పత్రాలలోనే ఉన్న శ్రీరామ స్తవరాజం చివర "వ్రాలా తప్పులు శ్రీఖలు"... అనే పద్యం వ్రాసి క్రింది శుభకృతు నామ సంవత్సరం శ్రావణ బహుళ విదియా సోమవారం సరికి రామ స్తవం సంపూర్ణం. క్రొద్దికె వెంకటపతి సుపుత్రులైన తిమ్మప్ప, కృష్ణప్ప, భీమప్ప, శేషప్ప గారికి, అయిన కల్లు వైద్యం రామప్ప కొమారుడు వెంకప్ప వ్రాసిన రామ స్తవం, ఆత్మైక్యబోధ, గురు శిష్య సంవాదం శ్రీ వేంకటేశ్వర ప్రసన్నత్వంబు గాను వ్రాసినది పుత్ర మిత్ర కళత్ర భాతృ బంధు జనులకు ఆ చంద్ర తారార్కంగాను వ్రాసినదీ శ్రీ గురుభ్యోనమః' అని గలదు. దీనివలన ముందు ఆత్మైక్య బోధ, గురు శిష్య సంవాదము వ్రాసి తరువాత శ్రీరామ స్తవం ప్రతి వ్రాసినట్లు తెలియుచున్నది. ఇందు ఎచ్చట కవి పేరు లేదు. ఇతరత్రా లభించిన ఆధారములను బట్టి ఈ కవి జీవిత చరిత్రాదులు తెలుపబడినవి.

ఈ గ్రంథము

'శ్రీ మన్మహాభాగ్య శృంగార మగుచు
నామరూపులకెల్ల నాటపట్టగుచు"...అని ప్రారంభమగుచున్నది.

"ఆరు పువ్వుల తుద నా వుదక మందు
నాదమై చెలగి తానాద ఘోష మగుచు
మేలుగా బలుకుచు మెలగి యందున్న
శ్రీ లింగ గురుని నా చిత్తంబులోన
భావించి యతనినే బట్టి కలయుచును
సావధానము బొంది సఖియరో నేను
ఆతని ఆజ్ఞ ధరించి ఆత్మైక్యబోధ
వితతముగా లెస్స వివరింతుదెలియ"

అని గ్రంథ ప్రారంభమును తాను శ్రీ లింగ గురుని ఆజ్ఞచే దీనిని వ్రాసినట్లు తెలిపినాడు. ఇందు అచ్చటచ్చట సఖియరో, వనితరో అని యుండుటచే యొక స్త్రీని సంబోధన చేసినట్లు కాన్పించును. ఈ స్త్రీ ఎవ్వరోగాదు బుద్ధియే. 'నా గురుదలచి పూనిక తోడుత బుద్ధను చెలికి' యని చెప్పుటచే ఈ విషయము తెలియుచున్నది.

ఇందు చెప్పబడిన విషయములను గురించి

"వినుము శ్రీ గురు జేరు విధము సద్గురుని
వినుతి సేయు విధంబు వినుపింతు మరియు
అధ్యాత్మముల యాధి భూతముల
అధిదైవతములను అంటి జెప్పెదను

అమరిన సాంఖ్యంబు నా తారకంబు
అమితాత్ముడుండేటి అనువైన తావు
పంచ భూతముల ప్రక్రియలన్ని
సంచితంబుగ వాటి సంజ్ఞ లన్నియును
అటువలె ద్వివిధమగు అష్ట తనువులును
పటు తరమగు మహావాక్య పద్ధతుల్ నాల్గు
విధములు లెస్సగా వివరింతు తెలియ"

అని ఇందు సంక్షిప్తముగా జెప్పబడిన అంశములను కవి వివరించినాడు. గ్రంథము నంతయును అనగానీ 211 ద్విపదలను కవి 9 విభాగములు చేసినట్లున్నది. సంఖ్యలు ప్రతి విభాగము చివర వేసినను అవి సరిగా తెలియుటలేదు. మూడు నాలుగు సంఖ్యలు ఏలకో రెండు సార్లు వేయబడినవి. 5, 6 లకు బదులు 15, 16 సంఖ్యలు వేయబడినవి. ఈ 9 విభాగములు ఇవిగా వచ్చును.

1. శ్రీ గురు జేరువిధము
2. సద్గురుని వినుతి సేయువిధము
3. అధ్యాత్మముల యాధిభూతముల అధిదైవతముల వివరణము
4. సాంఖ్యము
5. తారకము
6. అమితాత్ముగుండేటి అనువైన రావు
7. పంచ భూతముల ప్రక్రియలు వాటి సంజ్ఞలు
8. ద్వివిధాలైన అష్ట తనువులు
9. నాలుగు విధములైన మహావాక్య పద్ధతులు

ఇందలి ఒక్కొక్క విషయమును వివరింపవలయునన్న అతి విస్తరమగును. కావున అట్టి పనికి పూనుకొనుట లేదు. ఇందు కవిత్వాంశ అతి తక్కువ తరగతికి చెందినది. కవి ఉద్దేశ్యమును కేవలము యోగ శాస్త్రవిషయములను వివరించుటయే గానీ కవిత్వాంశ ప్రదర్శనము మాత్రము గాదు. కొన్నిచోట్ల పాదములు అతి దీర్ఘములైనవి. ఇందుకు కారణము గణములను సరిగా పాటింపక పోవుటయే. ఉదాహరణమునకు 'తేజుడగు బ్రహ్మయు తెలియ నధిపతియు' అను పాదమున గణములు గాలికి వదలబడినవి. ఇట్టివి ఇంకను కొన్ని గలవు. ఇట్లే 'నయమగు విరాట్టుకు నమ్మిన తనువు' గణము చెడినది.

"వాచ్యార్థ లక్ష్యార్థ వైభవమంత
చూపించితిని వీటి సూత్రమంతయును"—ఇందు ప్రాస చెడినది.

ఇట్లే యతి భ్రష్టములును కొన్ని గలవు. వీనిలో చాలావరకు కొద్ది సవరణలతో సరిచేయవచ్చును. కొన్ని సగము పాదముమాత్రమే గలవు. అట్టివి పూరించుట కష్టము. ఖిలమేమి యైనను ఈ పాదములందు జరిగెనను కొనుటకు వీలులేదు. వానియందు కొనసాగింపు (కన్‌టిన్యుయిటీ) చెడుటలేదు.

మొత్తము పై విషయ వివరణమునకే కవి యుద్దేశించినట్లు మనము దృష్టిని నిలిపి కవి యూహించినట్లు

'తత్త్వమసి వాక్యవిధమునే తెలిసి
సుదతిరో యీ రీతి సుఖమనుభవించు' అని ఇందలి వేదాంత విషయముల నెఱుగుటకే జిజ్ఞాసువులు ప్రయత్నింతురు గాక.

మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున దీనికొక తాళ పత్ర ప్రతి గలదు. (ఆర్. నెం. 678) దీనిని గుఱించిన వివరములలో

"పామ్ లీఫ్ 10"×1⅛" ఫోలియో 55- లైన్స్ 8 ఇన్ ఎ పేజ్. మోడ్ ఆఫ్ రైటింగ్-గుడ్, బట్ కన్‌సైన్స్ మిస్టేక్స్-స్లైట్‌లీ ఇన్‌జర్ట్ అండ్ బ్రేక్సు ఆఫ్ హియర్ అండ్ దేర్.

(ఎ) ఆత్మైక్యబోధ : ఎ ట్రిటైజ్ ఇన్ ద్విపద మీటర్ ఆన్ ది అద్వైత - వేదాంత పర్‌పోర్టింగ్ టు ఎస్టాబ్లిష్ ది ఐడెన్‌టిటీ ఆఫ్ ది సోల్ విత్ ది సుప్రీమ్. బై యోగానందావధూత, డిసైపుల్ ఆఫ్ లింగగురు కంప్లీట్" — అని కలదు.

నా వద్ద గల తాళపత్ర గ్రంథములోని ప్రతులకు ఆద్యంతములలో కొంతభాగమును వ్రాయసగాడు వ్రాసినట్లుగాలేదు. ఇట్లూహించుటకు కొంత కారణము గలదు. ఇదే వ్రాయసగానిచే వ్రాయబడిన శ్రీరామ స్తవమునందు కృత్యాదియే వ్రాయబడలేదు. కేవలము షష్ఠ్యంతాల నుండియే మొదలు పెట్టబడినది. వ్రాయసగాడు కవి వివరములున్న భాగములకు ప్రాముఖ్యత యిచ్చినట్లు కాన్పించదు. ప్రాచ్యప్రాచీన కవులు కవి జీవితములకంటె కావ్యములకే ప్రాముఖ్యత యిచ్చినట్లు దీనిచే మరొకసారి నిరూపింపబడినది. అందువలననే ప్రాచ్యలిఖిత పుస్తక భాండార వివరణాత్మక సూచికలో పేర్కొన్న

చెలువైన గురులింగ శిష్యుండనగుచు
అలరు యోగానంద అవధూత స్వామి
నైనట్టి నేనును నా గురుఁ దలచి
పూనిక తోడుత బుద్ధన్షు చెలిక్షి
సకల వేదాంతార్థ సారమై యున్న
యకలంక మాత్మైక్యమది విస్తరించి
ఒప్పైన ద్విపదగా ఉన్నదున్నట్లు
చెప్పితి ద్విపదను జిత్తగించుడు
అనుభవార్థంబంత యది లెస్స తెలిసి
అనుదిన మీ బోధనరయుడు మీరు

యతి ప్రాసముల గొడవయేలను మాకు
గతి గురుడని తలచు గతి యదె మాకు
ఈ లోకమున జనులీ ద్విపద విన్న
పాటించి చూచిన పట్టివాసినను
బుద్ధి కుదిరి లెస్స బుధ జనులజేరి
శుద్ధులై యిహపర సుఖము బొందుదురు.

అను భాగము లేదు. శ్రీ చాంగటి శేషయ్యగారు తమ కవుల చరిత్రము నందు పై భాగము నుండియే యుదాహరించిరి.

ఈ యోగానందావ ధూతస్వామి గురువైన 'లింగ గురుడు' 'చింతల లింగావధానులు' అను పేరు గలవాడు. ఈ లింగావధానులు శ్రీ రామ స్తవ రాజమును రచించిన ముమ్మడి మల్లన కవి ఆంధ్ర భగవద్గీతలను రచించిన కంభంపాటి నారయామాత్యుడును ధేనువు కొండ తిమ్మయా మాత్యుని శిష్యులు. వీరు అందఱును నెల్లూరు మండల వాసులు కావలయును. ధేనువుకొండ తిమ్మయ దత్తాత్రేయ యోగి శిష్యుడు. క్రీ. శ. 16, 17 శతాబ్దులలో నెల్లూరు మండలమున నొక దత్తాత్రేయ యోగి మఠము ఉన్నట్లు తెలియుచున్నది.

యోగానందావ ధూతను గుఱించి ఇంతకంటెను అతని రెండు గ్రంథముల నుండియు తెలియవచ్చుట లేదు. ఈయన 16వ శతాబ్ది ఉత్తరార్థమున జీవించియుండి యుండవచ్చును.

కంభంపాటి నారయా మాత్యుడు రచించిన ఆంధ్ర భగవద్గీత అను కావ్యమునుండి యోగానందావధూత గురుపరంపర యిట్లుండును.




వీరందరును పదునారవ శతాబ్దమున నుండియుండవచ్చును

వీరందరును గురు శిష్యులగుటచే దత్తాత్రేయ యోగీశ్వ కును, కంభంపాటి నారయామాత్యునికిని ఎక్కువ వయోవ్యత్యా లేక పోవచ్చును. యోగ విద్యకు సంబంధించినంత వఱకును ఒక కృప్పుడు గురువు కంటె శిష్యుడు పెద్దవాడగుటలోను ఆశ్చర్య లేదుకదా. అందువలన తరములు అనేకములు కన్పించు చున వీరందరును యించు మించు సమకాలికులే కావచ్చును.

దీనితో ఉన్న మిగిలిన గ్రంథములను గుఱించి అవకా లభించిన మరియొక మారు ముచ్చటించు కొనగలము. ఇట్టి గ్రంథవ ప్రకటింపబడు దినమునకై వేచియుందము.

ఈ చిన్న గ్రంథమునకు కనీసము సంస్కరణతో సైక్లోస్టం ప్రతులనైనను కొన్నింటిని తీసి పండితులకు పంపి కవి కావిం కృషిని లోకమునకు వెల్లడి చేయవలయునని కొను చున్నాను. త్వ నా కోరిక తీరగలదు. ద్విపద వేదాంత వాఙ్మయశాఖ ప్రత్యేక శాఖగా తెలుగులో వెలిసినది. దీనిపై పర్యాప్త పరిశీలన జరుపు అవకాశము గలదు. వేదాంతముపైనున్న ఆసక్తి కాకపోయినను చేసిన కృషిని విద్వాంసుల దృష్టికి తీసికొని రాగలమను ఆశయే వ్యాసము వ్రాయుటకు పురికొల్పినది.

## శ్రీ ఆవంచ సత్యనారాయ

# దిన జీవితంలో అలంకారాలు

సాధారణంగా మనం చిన్న పిల్లలను ఏదైనా చూచినా అబ్బీ! అని అడిగినపుడది వాడు చూడనిదైతే, వెంటనే అది ఉంటుంది? అని ఎదురు ప్రశ్న వేస్తాడు అపుడు దానికి మనం వ సమాధానంగా స్వభావోక్తినో, లేదా ఒక్కమాటలో చెప్పాలనుకు ఉపమానాలంకారాన్నో ఆశ్రయించక తప్పదు. అందుకే కా నైయాయికులు ప్రమాణాలలో ఉపమానాన్ని గూడా ఒకటిగా అం రించినారు.

ఇక రూపక విషయంలోనికి వస్తే అదొక ప్రత్యేక ప్రపం అవుతుంది. ఈ అలంకార భావన మనకు పసిపిల్లలలో గుజ్జన గు దశనుండే కనిపిస్తుంది. వారు తమ చేతలపై ఎన్నెన్నో సంస భావాలు, మట్టిని చిన్న చిన్న కుప్పలుగా పోసికొని వానిపై అన పప్పు, శాకం, అని ఎన్నెన్నో ఆహార పదార్థ భావాలు ఆరోపి కొని లీనమై ఆడుతూ ఉండటం చూస్తాము.

సామాన్య జనం ఏ అలంకారశాస్త్రం చదువకున్నా ఏదో ఒక అలంకారాలంబనం లేకుండా తమ వాగ్వ్యవహారం నడపలేరు. ఈ అలంకారాల ఉపయోగం మామూలుగా పురుషులకంటె స్త్రీల సంభాషణలో ఎక్కువ కనిపిస్తుంది. పురుషుల వాగ్వ్యవహారం అలంకార ప్రధానం గాక ధ్వని ప్రధానమై ఉంటుంది. అందుచేత ఈ ధ్వన్య లంకారాలను సాహిత్య ప్రపంచంలో ప్రకృతి పురుషులతో పోల్చవచ్చు. ఇవి మామూలు సంభాషణలకంటె బావామరదుల ఛలోక్తులలోను' వదినా మరదళ్ళ పరిహాసాల్లోను, ఎక్కువగా తొణికిసలాడు తుంటవి. లక్షణం తెలిసి ఉండవలెగాని లక్ష్యాల కోసం మనం ఏ కావ్యాలు వెదక నవసరముండదు. దిన జీవితంలోని సంభాషణలోనే మనకు సమస్తమైన అలంకార ప్రపంచమంతా సాంగంగా దర్శనమిస్తుంది.

ఈనాటి మానవుడు ఏ అలంకారాలంబనం లేకుండా మాటాడ లేడు. వైదర్భి, గౌడి, పాంచాలాది రీతులు ఆయా దేశ పద్ధతులైనట్టుగా మానవసమాజంలో ఈ అలంకారాలు గూడా ఒక సంభాషణావిధంగా సాధారణీకరణాన్ని పొందినవి అందుకే కాబోలు ఆంగ్లేయులు వీనిని "ఫిగర్స్ ఆఫ్ స్పీచ్'' (వాక్య విన్యాసాలు, వక్తవ్య విధానాలు) అని పిలిచినారు.

ఈ విధానాలను విద్యానాథుడు సాదృశ్యమూలము, అధ్యవసాయమూలము, విరోధమూలము, వాక్యన్యాయమూలము, లోకవ్యవహారమూలము, తర్కన్యాయమూలము, శృంఖలావైచిత్రమూలము, అపహ్నవమూలము, విశేషణవైచిత్రీమూలకము, నిరపేక్షన్యాయములు అని పది విధాలుగా వింగడించి ప్రదర్శించినాడు వీనిలో కుమారి జె. ). సుబ్బలక్ష్మి గారు (నవంబరు 1984) కొన్ని ప్రదర్శించినారు. ఈ వ్యాసములో మరికొన్ని దిన జీవితోపయోగాలు చూడండి.

1. ఆయన ఫలానా వారి వలె ఉంటాడు - అంటె ఉపమ.
2. ఆయన కాయనే సాటి - అంటె అనన్వయం.
3. ఆయన ఈయనవలె, ఈయన ఆయనవలె ఉంటారు - అంటె ఉపమేయోపమ.
4. నీవుండగా ఇక ఆయనెందుకులే ! - అంటె ప్రతీపం.
5. ఆయన మహారాజు—ఆవిడ మహారాణి - అంటె రూపకం.
6. ఆయన మా పాలిటికి దేవుడై వచ్చాడు - అంటె పరిణామం.
7. ఆయన ఇంట్లో గృహస్థు-రచ్చలో పెద్దమనిషి - అంటె ఉల్లేఖం.
8. నిన్ను చూస్తుంటే నాకు మీ నాన్న జ్ఞాపకం వచ్చాడు - అంటె స్మృతి.
9. నిన్ను చూచి నేను ఫలానా ఆయనే అనుకున్నాను-అంటె భ్రాంతి.
0. నిన్ను చూడగానే నేను మీయన్నో మీనాయనో అనుకున్నా - అంటె సందేహం.
11. ఆయన మనుష్యుడుగాడు - అవతారమూర్తి—అంటె అపహ్నవం
12. ఆయన అలా అన్నట్టుంటాడు - అంటె ఉత్ప్రేక్ష.
13. ఆయన్ని మనం అంచనా కట్టలేంలే ! - అంటెఅ తిశయోక్తి.
14. ఆయన అంతే ! వీడూ అంతే ! అంటె తుల్యయోగిత.
15. వాడేం ? కుక్కేం ? నాలుగు మెతుకులు పడేస్తే ఉంటాడు అంటె దీపకం.
16. వాడూ అలాగే ఉంటాడు, ఆమె అలాగే ఉంటుంది - అంటె కారక దీపకం.
17. వాడెక్కడ వెడతాడు - దొడ్డి మరగిన పశువు పోతుందా ! అంటె ప్రతివస్తూపమ.
18. ఆయనెక్కడ రాలుతాడు ఈతాకు - అంటె నిదర్శన.
19. ఆయన మన మాటెక్కడ వింటాడు - గుడ్లగూబ పగలు చూస్తుందా - అంటె దృష్టాంతం.
20. ఆయన కంటె ఈయనే మేలు - అంటె వ్యతిరేకం.
21 ఆయనతోపాటు అదీ కాస్త పోయింది - అంటె సహోక్తి.
22. ఆయన లేకపోబట్టి ఇది జరిగిపోయింది - అంటే వినోక్తి.
23. ఆ రాజు చూస్తున్నాడు అంటె సమాసోక్తి.
24. ఎవరినేగాని సాభిప్రాయ విశేషణాలతో పొగిడితే పరికరం.
25. ఆయన్నే అలాటి పేరుతో పిలిస్తే పరికరాంకురం.
26. రెండర్థాలు వచ్చేటట్టు మాటాడితే శ్లేష.
27. ఏదైనా ప్రత్యక్షంగా చెప్పలేనపుడు దేనిపైనన్నా పెట్టి చెప్పటం అప్రస్తుత ప్రశంస.
28. ఎదురుగా ఉండేదాన్నే ఎత్తుకొని చెప్పటం ప్రస్తుతాంకురం.
29. వ్యక్తిని పేరుతో చెప్పక ఆకారాది విశేషాలతో చెబితే పర్యాయోక్తి.
30. పైకి పొగడినట్లుండి దూషిస్తే వ్యాజస్తుతి.
31. అసలు మీ నాన్నగారిది తప్పుగాని నిన్నని ఏం లాభం అంటే వ్యాజనింద.
32. ఓ విషయం మొదట గబుక్కున అనేసి, పిమ్మట దాన్ని కాదని యింకోటి చెబితే ఆక్షేపం.
33. వాని పెండ్లికి పోతె నా పెండ్లి అయింది అంటె విరోధాభాసం.
34. ఏరు లేని ఆరాటం మొగడు లేని పోరాటం అంటె విభావన.
35. చింత చచ్చినా పులుపు చావదు అంటె విశేషోక్తి.
36. ఈ విధంగా ఎక్కడా జరిగి ఉండదు - అన్న ధోరణిలో చెబితె అసంభవం.
37. "పృష్ఠ తాడనాత్ దంత భంగః" అంటె అసంగతి.
38. నక్క యెక్కడ ! నాగలోక మెక్కడ ! అంటె విషమం.
39. ఆ యెద్దు ఈ యెద్దు జోడు - ఆ చేను ఈ చేను బీడు అంటే సమం.

40. మనిషి సుఖాన్ని కోరి కష్టపడతాడు అంటె విచిత్రం.

41. చద్ది కంటే ఊరగాయ ఘనం అంటె అధికం.

42. ఆమెకు ఉంగరం కంకణమయింది అంటె అల్పం.

43. ఇల్లాలుతో యిల్లు, ఇల్లుతో ఇల్లాలు శోభిస్తాయి అంటె అన్యోన్యం

44. ఆయన ఉండటానికిల్లే కావాలా! ఎన్ని చోట్లు లేవు అంటె విశేషం.

45. ఉండి ఒకడు సుఖపడితె ఉన్న దానితోనే ఒకడు కష్టపడతాడు అంటె వ్యాఘాతం.

46. చదివితె ఉద్యోగం వస్తుంది. ఉద్యోగం వస్తె ఊళ్ళేలు వచ్చు అంటె కారణమాల.

47. ఆయన కన్నులు చెవుల వరకు, చెవులు చెంపల వరకు అంటె ఏకావళి. అందరికి నేను లోకువ నాకు నంబి సింగయ లోకువ అంటె గూడా ఏకావళి.

48. మన్మధుడామె మనస్సులోను, ఆవిడ అతని మనస్సులోను నిలచారు అంటె మాలాదీపకం.

49. ఒకదాని కంటె ఒకటి మేలని చెబితె సారం.

50. ఏ వరుసలో చెప్పిన వస్తువుల కావరుసలోనే అన్వయం చెబితె క్రమికాన్వయం.

51. ఒకే వస్తువు అనేకుల నాశ్రయించినట్లు చెబితె పర్యాయం.

52 మాట యిచ్చి మనస్సు పుచ్చుకున్నాడు అంటె పరివృత్తి.

53. వానికి ఆటమీదే గాని కాపురం మీద మనస్సు లేదు అంటె పరిసంఖ్య.

54. ఉద్యోగానికి ఉత్తరమైనా కావాలి దక్షిణమైనా కావాలి అంటె వికల్పం.

55. ఆయనకి లాటరీ తగలటం, ప్రమోషన్ రావటం, కొడుకు పుట్టడం అన్నీ ఒకేసారి కలిశాయి అంటె సముచ్చయం.

56. పాలేరీనాడు పనికిరాలేదు, పొలానికి వెళ్ళలేదు, ఊరికైనా వెళ్ళి రాలేదు అంటె కారకదీపకం.

57. నేను నీ దగ్గరకు రావాలను కుంటుండగానే మీ మనిషి నన్ను పిలువటానికి వచ్చాడు అంటె సమాధి.

58. అత్తమీది కోపం దుత్తమీద చూపింది అంటె ప్రత్యానీకం.

59. నా వాళ్ళే నాక్కాకుండా పోయినపుడు తక్కిన వారౌతారా అంటె అర్థాపత్తి.

60. అదృష్టం బాగున్నది కాబట్టి ఆ గండం తప్పిపోయింది అంటె కావ్యలింగం.

61. గాంధీ గారే ఆయుధం లేకుండా తెల్లవాని జయించాడు గొప్ప వాళ్ళతో కాని పనేమంది అంటె అర్థాంతరన్యాసం,

62. పది మంచి గుణాల్లో ఓ చెడ్డ ఏంలెక్క అంటె వికస్వరం.

63. బ్రహ్మదేవు డాయన్ని మామూలు మట్టితో చేయలేదూళే అంటె ప్రౌఢోక్తి.

64. చంద్రునిలో మచ్చ లేకుంటె అతడామె ముఖానికి సరిపోతాడు అంటె సంభావన.

65. గాలి పిడికిళ్ళు తినేవారైతేనే ఈనాడు నిస్వార్థంగా పనిచేస్తారు అంటె మిథ్యాధ్యవసితం.

66. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నాడు అంటె లలితం.

67. వెదకబోయిన తీగ కాలికి తగిలింది అంటె ప్రహర్షణం.

68. తలం గడిగిన నాడే పడగల్లో వాన అంటె విషాదనం.

69. ఉత్తముల దర్శనం చేయాలని ఎవ్వరనుకోరు అంటె ఉల్లాసం.

70. పుత్తడి నగలున్నంత మాత్రంలో తొత్తుదొరసానౌతుందా! అంటె అవజ్ఞ.

71. నిర్భయానికి దారిద్ర్యమే కారణమైతే అదే నూ కుండనీ - అంటే అనుజ్ఞ.

72. అయ్యవారి బందెం అయ్యవారికే ముప్పు అంటే లేశం.

73. తిట్టబోరా గాడిద కొడకా! అంటె ముద్ర.

74. ఆయన అన్ని తెలిసినవాడు, పది వేషాలేసి చూశాడు, నాలుగు మాటలు నేర్చాడు అంటె రత్నావళి.

75. ఆమె దోసిట్లో ముత్యాలు పగడాలైనాయి అంటె తద్గుణం.

76. పనిచేస్తె రెక్కలరుగుతాయను కుంటారు గాని చేయకుంటె అరుగవా - అంటె పూర్వ రూపం.

77. ఇంతకాలం నీవు నాతో ఉండి గూడా నన్నర్థం చేసి కోలేదు అంటె అతద్గుణం.

78. అది మొదలే కోతి - కల్లు త్రాగింది - తమీద దయ్యం పట్టింది అంటె అనుగుణం.

79. చీకటింటిలో నల్ల పిల్లి అంటె మీలితం.

80. ఎక్కడ చూసినా నీ రూపే కనిపిస్తుంటె నిజరూపం ఎరుగలేక పోయాను అంటె సామాన్యం.

81. వాళ్ళిద్దరూ ఒకటే గాని ఈయన కొంచెం మందం కాబట్టి గుర్తించటానికి వీలుంది అంటె ఉన్మీలితం.

82. కాకి నలుపే, కోకిల నలుపే కాని వసంతకాలం వస్తే కాకి కాకి అవుతుంది కోకిల కోకిలౌతుంది అంటే విశేషకం.

83. ఎద్దీవనకళ్వ. ? అని అంటె ఉత్తరం.

84. అతడు కనుగీటగా ఆమె పెదవి విరచింది అంటె సూక్ష్మం.
85. ఎదుటివాళ్ళ రహస్యాన్ని మరో రహస్యంతో తెలిపితె పిహితం.
86. నిజాన్ని కప్పిపుచ్చి దాన్నేదో వంకతో సమర్థిస్తె వ్యాజోక్తి.
87. ఒకరిపై బెట్టి ఒకరికి చెబితె గూఢోక్తి.
88. శ్లేషతో దాచిన దాన్ని మరో రీతిలో వెలికి తీస్తే వివృతోక్తి.
89. తన రహస్యాన్ని దాచటానికితరుల నేదో తీరుగా వంచిస్తె యుక్తి.
90. నూరబద్ధాలాడైన ఓ పెండ్లి చేయాలి అంటె లోకోక్తి.
91. ఆవుల మలిపినవాడే అర్జునుడు అంటె ఛేకోక్తి.
92. విరుపుతో ఎత్తిపొడిస్తె వక్రోక్తి.
93. ఉన్నది ఉన్నట్లుగా చెబితె స్వభావోక్తి.
94. ఆ రామ రావణ యుద్ధం యిపుడు చూస్తున్నానంటె భావికం.
95. ఈ పెన్నెవరి దనుకున్నావురా ! తాతగారిది అంటె ఉదాత్తం.
96. శౌర్య ధైర్యాల నద్భుతంగా వర్ణిస్తె అత్యుక్తి.
97. పేరుకు అర్థాంతరం కల్పిస్తె నిరుక్తి.
98. మరెవరూ గాదు ! ఆడవాళ్ళ కాడవాళ్ళే పగవాళ్ళు అంటె ప్రతిషేధం.
99. ఆడది ఉన్నపుడే యిల్లు యిల్లులా గుంటుంది అంటె విధి.
100. ఆయనంటె ఎందరికో తోడ్పడ్డాడు సామాన్యుడు గాదు అంటె హేతువు.

ఈ విధంగా మనం మాటాడే ప్రతి మాటలో గాకపోయినా చాలా వరకు అలంకారాలుంటాయి.

శ్రీ కె. కిశోరుబాబు,
శ్రీ కె. అశోకుబాబు

# క న్య క

ఆదికవి నన్నయ నుండి ఆంధ్ర కవితాస్రవంతి అఖండంగా అనుస్యూతంగా ప్రవహించుచునే యున్నది. దేశ కాల పాత్రములను బట్టి ప్రజల జీవన విధానములందు మార్పులు వచ్చినట్లే కవితా స్రవంతికలు గూడా కాల గర్భమున క్రొంగ్రొత్త వేదికలు సంతరించు కొనుచునే యుండును.

మూఢాచారములు, మూఢ విశ్వాసములు, మూర్ఖ వాదములు ముప్పిరిగొన్న కాలమున మూఢ విశ్వాస శృంఖలములను ఛేదించి వివేక సూర్యులై వెలుగొందిన వీరేశలింగంగారి ప్రభావముతో జాతి మేల్కొన్న సమయ మది. ప్రజలలో భావగతముగా, భాషాగతముగా క్రొంగొత్త మార్పులు కొనితేవలయునని గిడుగు రామమూర్తిపంతులు గారి వంటి పండితప్రకాండులు ప్రయత్నించుచున్న కాలమది. అట్టి సమయమున వీరి ప్రభావముతో గురజాడవారు ఆంధ్ర భాషాయోషకు ముత్యాలసరముతో ముచ్చట అయిన ఆభరణములను సంతరించినారు.

గురజాడవారిని - మహాకవియని, ఆతని దేశభక్తి గేయము ప్రపంచ జాతీయగీతమని పలువిధముల ప్రశంసించినవారు అనేకు లున్నారు. వారివారి అభిమాన పరంపరను బట్టి ఎవరెవరు ఎన్నెన్ని విధముల ప్రశంసించినను గురజాడవారిని మహాకవిగా మనకు పట్టి ఇవ్వగల గేయము ఒక్క 'పూర్ణమ్మ'యే ! ఆ తరువాత అంతగా శిల్ప సుషమ గలిగి వెల్గొందు గేయము 'కన్యక' యని చెప్పవచ్చును.

భౌతిక దృష్టితో చూచినపుడు పూర్ణమ్మ, కన్యక గేయము లందు ఏదో ఒక సామ్యము గోచరించినప్పటికి మౌలికమైన భావమును పరిశీలించినపుడు భేదము గోచరింపక తప్పదు.

వైశ్య పురాణమునందలి కన్యకాపరమేశ్వరీ కథకు గురజాడ వారి కన్యక గేయఖండికకు ఒక కొంత సామ్యమున్నది. మదరాసు లోని తెలుగు శెట్ల కోరికపై ఈ గాథను చేబూని అప్పారావు గారు ఈ ఖండిక వ్రాయుట జరిగినదని రామదాసు పంతులుగారు ఒక్కచో పేర్కొనుటను బట్టి వైశ్య పురాణము నందలి కన్యకాపరమేశ్వరి కథనే కొలది మార్పులతో గురజాడవారు ఈ 'కన్యక'ను సృష్టించిరని చెప్పుటకు అవకాశమున్నది.

ప్రాచీనులు రాజు సాక్షాత్తు నారాయణస్వరూపుడని 'నా విష్ణుః పృథివీపతిః' అనియు అతని వ్యక్తిత్వమున కొక ప్రత్యేకతను ప్రవచించినారు. ప్రజల ఈ మంచితనమును అసమర్థత క్రింద భావించి రాను రాను రాజు తలచిందే ధర్మమని, రాజు చెప్పిందే శాస్త్రమని పాలకులు భావించి పసరములవలె ప్రవర్తించు స్థితి ప్రవర్తిల్లినది. దీనికి తోడు రాసిక్యము పేర రమణీమణులను చెరపట్టు రాక్షసకృత్యము రాజ ధర్మము పేర రచ్చకెక్కినది. జారచోరత్వములకన్న నికృష్ట మైన ఈ రాక్షస వివాహము రాజ కులములందు ప్రబలినది. కండ కావరమెక్కి కావించు నీ దుండగములను అరికట్టు శక్తి చాలని రోజు లలో ఈ కథ ప్రవర్తిల్లినది.

"తగటు బంగరు చీరె కట్టి
కురుల పువ్వుల సరుల జుట్టి
నుదుట కుంకుమ బొట్టు పెట్టి
సొంపు పెంపారన్"

"తొగల కాంతులు తనులు పరపగ
మించు తళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ
కన్నె పరతెంచెన్ రాజ వీధిని"

"పసిడి కడవల పాలు పెరుగులు
పళ్లెరమ్ముల పళ్లు పువ్వులు
మోములందున మొలక నవ్వులు" చలగునట్లు చెలికత్తెలు వెంటనడువగా సొంపు పెంపారగా శెటి కూతురు రాజవీధిని చుక్కలలో చంద్రుడునట్లుగా వెలుగుచు దేవళమును గూర్చి ప్రయనమయినది.

ఇక్కడ గురజాడవారు చూపిన రచనా శిల్పము రమణీయమైనది. కన్యక సౌందర్యము శీలము పవిత్రమైనదని తెలుపుటకు దేవళమున కేగు సన్నివేశముతో ఖండికను ప్రారంభించి ఉదాత్తతను సంతరించినారు.

వెనువెంటనే రాజు ప్రవేశించుటను
"పట్టవలెరా దీని బలిమిని
కొట్టవలెరా మరుని రాజ్యం
కట్టవలెరా గండపెండెం
రసిక మండలిలో"

"నాలనడుమను నట్టివీధిని
దుష్ట మంత్రులు తాను పెండెం
గట్టి కన్నెను చుట్టి నరపతి
పట్టనుంకించెన్" అను గేయములందు నిరూపించుట వ న రాజునందు గల దౌష్ట్యమును వ్యంజిత మొనర్చినారు గురజాడవారు.

"ముట్టబోకుడు, దేవకార్యం
తీర్చ వచ్చెద, నీవు పట్నం
యేలు రాజువు, సెట్టికూతుర,
నెటకు పోనేర్తున్" అను గేయమునందును

"పట్టమేలే రాజ! బలిమిని
పట్టవలెనా? నీదు సొమ్మే
కాద కన్నియ? నీవు కోరుట
కన్న మరి కలదా
వైశ్యజాతికి వన్నె" అను గేయమునందును రాచరికపు వ్యవస్థలో రక్షణ లేని రమణీమణుల దౌర్భాగ్య స్థితిని కట్టుకున్న భార్యనయినా, కన్న కూతురునైనా రాజు కోరితే కాదనలేని పౌరుల బలహీనతను నిరూపించినారు.

ప్రజలను' కన్నబిడ్డలవలె పాలించవలసిన రాజులో రా సత్వము ప్రకోపించినప్పుడు, పాపభీతి కూడా అతని పంచన చేర కంచే చేనుమేసినప్పుడు కాదనేవారు ఎవరుంటారు! కాని కా మారుతున్నది. అధర్మాన్ని ఆత్మస్థైర్యముతో ఎదుర్కొని ధ సంస్థాపన చేయటానికి దీక్షవహించవలసిన కాలము దగ్గరకివస్తున్న ఈ సత్యాన్నే 'రక్తగంధం, రక్తమాల్యం దాల్చి ధర్మస్వరూపి లాగా మంటి మింటిని ముట్టియాడగా, మండు గుండం ముందు నిల అధర్మాన్ని ధిక్కరించి పల్కిన' కన్యక మాటలలో గురజాడవా ప్రజల కిలా సందేశాన్ని అందించారు.

"విద్య నేర్చిన వాడు విప్రుడు
వీర్యముండిన వాడు క్షత్రియు
డన్న పెద్దల ధర్మపద్ధతి
మరచి, పడువులకై"

"ఆశ చేయక, కాసువీసం
కలిగివుండే చాలుననుకొని,
వీర్య మెరగక, విద్య నేర్వక,
బుద్ధిమాలినచో,"

"కలగవా యిక్కట్లు? మేల్కొని,
బుద్ధిబలమును బాహుబలమును
పెంచి, దైవమునందు భారం
వుంచి, రాజులలో" రాజులై మనుడని ఆనాటి వైశ్ కులంలోని స్థితిగతులను మనస్సులో పెట్టుకొని కవి తన కన్యకచే పలికించినాడు.

అంతే కాదు న్యాయా న్యాయవిచారణము కావించి ధర్మమును నిలబెట్టవలసిన రాజు నీతి మార్గదూరుడై కండ్లకావర మెక్కి దుండ గము తలపెట్టినప్పుడు దైవమంటు ఒకడు ఉండేనాడనియు అతడు ఈ న్యాయాతిక్రమణమును సహింపడనియు కన్యక తీవ్రతరముగా హెచ్చరించి అగ్నిలో దూకి ఆత్మాహుతి కావించుకొనుటతో కరుణ రసము పరాకాష్ఠనందినది.

ఆ తరువాత ఎప్పుడైతే కన్యమానం మంట కలసినదో అప్పుడే పట్టమేలే రాజు గర్వం మట్టి కలసినది. అతడు శాశ్వతములనుకొని విఱ్ఱవీగిన కోటపేటలు కూలి నక్కల కాటపట్లై అమరినవి.

మాన సంరక్షణార్థము ప్రాణ త్యాగము చేసిన ఒక ఉజ్జ్వల ఆదర్శమును స్థాపించి పోయిన కన్యక కలకాలము మానవ మనోఫల

కాలంపై మనుగడను సాగిస్తూనే యుంది అని చెప్పుచు గురజాడవారు చివరకు వ్రాసిన

"పట్టమేలే రాజు పోయెను
మట్టికలిసెను కోటపేటలు
పదం పద్యం పట్టినిలిచెను
కీర్తు లపకీర్తుల్" అను గేయమున

'కారే రాజులు రాజ్యముల్ గలుగవే' అన్న పోతన్నగారి భావాన్ని పొందుపరచినారు.

మొత్తముమీద 'కన్యక' ఖండికలో గురజాడవారు చూపిన రచనా శిల్పము గురుతరమైనది. ప్రతి క్షణము పెరుగుచున్న అధర్మమును ఆత్మస్థైర్యముతో ఎదుర్కొనలేని అల్పులను వెన్నుతట్టి హెచ్చరించిన గురజాడవారు నవయుగ వైతాళికులలో మిన్నగా నెన్నదగిన మహనీయులు.

శ్రీ వెల్లంకి వేంకట నరసయ్య

# కర్మ వీరుడు - శ్రీ కె. ఎస్. కోదండరామయ్య

తమిళనాడు, ధర్మపురి జిల్లాలోని హోసూరు, డెంకణీకోట తాలూకాలలో తెలుగు ఇంతో అంతో ఊపిరిపీల్చుకొంటు ప్రాణంతో ఉందంటే దానికి కీర్తిశేషులు శ్రీ కె. ఎస్. కోదండరామయ్యా గారి అనిర్వచనీయ త్యాగమే కారణము.

తెలుగుభాషా సేవకోసమే అంకితమైన ఆ మహనీయుని ఒక జీవితము ఒక మహాగాథ.

చిన్న గ్రామములో పుట్టి విద్యపై గల అపరిమితమైన ఆసక్తి చేత ఎన్నో కష్టములను సహించి, బాధలకు ఓర్చి చర్మము ఎండి పోయే వరకు, ఎముకలు రాలిపోయే వరకు నిరంతర కృషి సలిపి అపార పాండిత్యమును ఘటించిన కర్మ వీరుడు ఆయన.

దారిద్ర్యంలో నలిగిపోయిన కాలంలోను పెట్టుకొన్న లక్ష్యాన్ని జారవిడవక సాధించిన మహానుభావులు కీ. శే. కోదండరామయ్యగారు.

సూక్ష్మమైన బుద్ధి, సూటిగా చెప్పేశక్తి, అధర్మాన్ని తీవ్రంగా ఎదిరించే ధైర్యం, సత్యాన్ని నిర్భయంగా చాటి, అసత్యాన్ని కూల ద్రోసే సామర్థ్యం కోదండరామయ్యా గారి జన్మ గుణాలు.

ఆయన జీవితంలో రాజకీయం సహజంగా ప్రవేశమైనది. తెలుగు భాషా, మైనారిటీ తెలుగువారి క్షేమం వీటికోసం కృషి ప్రారంభించినప్పుడు, రాజకీయ ప్రభావం, అనుభవం, ఆయన జీవితంలో బాగా చోటుచేసుకున్నాయి.

పదవిని పట్టుకొనేందుకు పాపాలు చేసే ఈ కాలంలో, భాషా సేవ కోసం పదవిని త్యాగం చేయడం ఎంత పెద్దపనో, ఎంత సాహసమైన పనో కొంచెం ఆలోచిస్తే గోచరమవుతుంది.

పెద్ద కుటుంబమును పోషణ చేసే బాధ్యత నెత్తిపైనన్నా, ఉద్యోగం వదలితే కుటుంబం అధోగతిపట్టిపోతుందన్న భయంకర మైన సందర్భంలో తెలుగు భాష కోసం పదవిని కాలదన్ని స్వేచ్ఛగా బయటకు వచ్చిన త్యాగజీవి శ్రీ కోదండరామయ్యగారు.

రాష్ట్రేతర ఆంధ్రులకోసం ఆయన చేసిన కృషి అపారమైనది, అమూల్యమైనది. కొండలు కోనలు తిరిగి తిరిగి ఆయన వారిని గురించి సేకరించిన వివరములు, వారి హక్కుల కోసం, మైనారిటీ కమీషన్ వారి వద్ద ఆయన వాదించిన విషయములు ఆయన త్యాగమునకు మరియు తెలుగు భాషా, తెలుగు జాతి పట్ల ఆయనకు ఉండిన అపరిమితమైన అభిమానాన్ని స్పష్టపరుస్తుంది.

తమిళనాడులోని హోసూరు మరియు చుట్టుప్రక్కల ప్రాంతాల లోను, రాజపాళ్యం మున్నగు దక్షిణ ప్రాంతాలలోని తెలుగువారిలో తెలుగు సంస్కృతి అస్తమించకుండా ఉండాలని ఆయన చేసిన కృషి అపారమైనది.

అంతర్జాతీయ తెలుగు సంస్థలోని డైరెక్టర్లలో ఒకరుగా ఉండిన శ్రీ కె. ఎస్. కోదండరామయ్యగారు, ఆ సంస్థ ద్వారా చక్కటి తెలుగు బోధించడం ఎలాగని బోధించే విషయంగా క్లాసులు ఏర్పాటు చేసి, తమిళనాడులోని అనేకమంది తెలుగు ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చారు. ఇలాంటి శిక్షణా శిబిరం బెంగుళూరులోను జరిపించారు శ్రీ కోదండరామయ్యగారు.

'ఆంధ్ర సాంస్కృతిక సమితి' అనే ఒక సంస్థను ప్రారంభించి, దానికొక బృహద్భవనమును నిర్మించే కృషిలో రాత్రింబవళ్లు నలిగిపోయ్యారు ఆయన. ఆ భవనం ఒక విద్యాకేంద్రంగా, ఆంధ్ర సాంస్కృతిక కేంద్రంగా ఘనం ఘటించాలని అవిరామ కృషి సలిపారు. కాని ఆ భవనం సగంలో ఆగిపోయింది.

హోసూరు, డెంకణీకోట తాలూకాలలోని తెలుగుభాషా విద్యా కేంద్రాలలో తెలుగు అడుగంటి పోతుందేమోనని విచారపడి ఆయన ప్రభుత్వంతో వ్రాత మూలంగాను, అసెంబ్లీలో వాదోపవాదాల

మూలంగాను చేసిన కృషి ఆయన భాషాభిమానాన్ని, ధైర్యమును వెల్లడిస్తుంది. తమిళనాడు మరియు కర్ణాటక రాష్ట్రాలలోని ఒక్కొక్క తెలుగువాడు ఆయనకు ఋణపడినవాడే. ఈనాడు తమిళనాడులో తెలుగు ఉపాధ్యాయులు కొంతమంది ఉద్యోగం ద్వారా తమ జీవనాన్ని గడుపుకొంటారంటే అది శ్రీ కోదండరామయ్యగారి కృషి ఫలితమే.

శ్రీకృష్ణదేవరాయల చరిత్రలో పెక్కు నూతనాంశములను వెలుగులోకి తీసుకురావడానికి ఆయన చేస్తుండిన కృషి ఆగిపోయింది. దక్షిణదేశ చరిత్రకు ఒక తీరని లోటైపోయింది. ఆయన రాయల విషయంగా వ్రాసిన గ్రంథం శ్రీ వేదం వెంకటరాయ శాస్త్రిగారి ముద్రణాలయంలో, సంపూర్ణమయ్యే స్థితిలో ఉన్నది. ఆ గ్రంథం వెలువడితే పెక్కు నూతన చరిత్రాంశములు వెలువడును.

ఆయన సేకరించిన తాళపత్ర గ్రంథములు, ఆయన సాంస్కృతిక భవనంలో చాలా వున్నాయి.

ఆయన కృషిలో మేధావిలాసము, భాషాభిమానము, ఆంధ్ర సాంస్కృతి పట్ల అపరిమిత అభిమానము, ఇవి మేళవించి ఉండేవి.

ఆయన మృతి మా ప్రాంతానికి ప్రత్యేకమైన నష్టము. ఆంధ్ర జాతికి తీరనిలోటు.

శ్రీ సి. వి. శివరామకృష్ణ శర్మ

# లేఖలు

## 'నవల' శబ్ద నిష్పత్తి

ఆచార్య శ్రీ రోణంకి 1983 నవంబరు 'భారతి' లో రాసిన ఈ క్రింది వాక్యాలపై 1984 ఫిబ్రవరి 'భారతి' లో శ్రీ 'తి' గారు చేసిన వ్యాఖ్య సమంజసంగా లేదు. వాక్యాలు : "నావెల్ అన్న ఇంగ్లీషు పదము తీసుకొని తెలుగువారు తెలుగుకు తగినట్లుగ మలిచారు. మను చరిత్రంలో 'నవలా...నౌకానౌక మరున్నారీ శిరోరత్నమున్' అని ఉంది. అందుచేత నవల అన్నమాట తెలుగులో అతుక్కుంది." ఈ వాక్యాల్లో ఎక్కడా శ్రీ రోణంకి అల్లసాని పెద్దన గారు నవల అనే మాటను మలచి వాడినట్లు వాచ్యంగా గాని వ్యంగ్యంగా గాని సూచించ లేదు. తెలుగువారి స్వభావాన్ని మాత్రమే స్మరించారు. పెద్దనను ఉట్టంకించడం కేవలం 'నావల్' అన్నమాటతో ధ్వని సామ్యం కలిగిన ఒక మాట ఆంగ్లపదం తెలుగులో చేరేటప్పటికే ప్రసిద్ధమై ఉండడం వల్ల, 'నవల' అనే మాట తెలుగులో స్థిరపడడం సులువై, సహజంగా భాసించిందని చెప్పడానికే. వారుద్దేశించింది శబ్ద సాదృశ్యమే కాని అర్థ సాదృశ్యం కాదు. ఇంతకూ 'నావెల్' అన్నది కూడా స్వచ్ఛమైన ఆంగ్లోచ్చారణ కాదు. భ్రష్టోచ్చారణ మాత్రమే. ఇంగ్లీషు మాటలో అకారంలేనే లేదు. తెలుగు మాట 'నవల' లోని అకారము, తెలుగులో ప్రచారంలో ఉన్న 'నవల' శబ్దంలోని అకార ప్రభావంవల్ల ఏర్పడింది. ఇంగ్లీషు మాట భ్రష్టోచ్చారణ తెలుగు మాటలోని అకారంచేత ప్రభావితం కావడమే తెలుగువారు తెలుగులోకి మలచుట. సంస్కృతమైన 'నవలా' అనే పదాన్ని 'నవల' అన్న హ్రస్వాంత రూపంగా మలచుకొన్నారు తెలుగువారు (పెద్దనకాదు). ఈ రూపం ఆంగ్లం నుంచి భ్రష్టోచ్చారణతో దిగుమతి చేసుకొన్న 'నవల' రూపంతో అతి సహజంగా సంవదించినందువల్ల, ఈ భ్రష్టాంగ్ల రూపం తెలుగులో 'అతుక్కుంది' అన్నారు శ్రీ రోణంకి. ఇది మొదటి నుండి లేదు. ఇక 'నోవల్' అనే సాహిత్య ప్రక్రియకు తెలుగులో 'నవల' అనే పేరు వచ్చుటకుగల చరిత్ర ఇంతకుముందే పలు పుస్తకాలలో (ఉదా : 'తెలుగు నవల' మొ. గ్రంథాలు) సుష్ఠుగా చర్చించ బడినందున చర్వితచర్వణ మౌతున్నా, ఒక ప్రయోజనం నెరవేరుతోంది. రోణంకి వారి అభిప్రాయం పూర్తిగ నిర్దుష్టంకాదని ఋజువౌతోంది. 'నవల' ఆంగ్లం నుంచి సంక్రమించినా, అది మిగతా ఆంగ్ల పదాలవలె జన వ్యవహారంలోంచి రాలేదు. కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు బుద్ధి పూర్వకంగా సృష్టించిన కృతకరూపమిది. మిగతా ఆంగ్ల పదాల వలె తెలుగు వారు వారి పద్ధతిలో మలచికొని ఉంటే, రోడ్డు, టికెట్టు, రూలు, బాలు మొ వాటి వలె 'నోవలు' అనే రూపమో, 'నావలు' అనే రూపమో సిద్ధించి ఉండేది. 'నవల' అన్న రూపం సిద్ధించేది కాదు. కాని శాస్త్రిగారు పండిత సంప్రదాయానుసారంగా ముందు 'సంస్కృతంలో కృతక రూపం కల్పించి, "నవాన్ విశేషాన్ లాతి గృహ్ణాతి ఇతి నవలా" అని వ్యుత్పత్తి చెప్పి, తరువాత తెలుగులో చేర్చారు. జరిగిన దానిని నోరి నరసింహ శాస్త్రిగారు ఇలా చెప్పారు. 'నవల అనేది ఆంధ్రులు ఆకారాంత స్త్రీ లింగంగా సంస్కృతీకరించిన ఆంగ్ల శబ్దం' ఆంగ్ల శబ్దం ఆంధ్రీకరింపబడలేదు. సంస్కృతీకరింపబడింది. ఇది చిత్రమైన విషయం. ఫలితంగా సంస్కృతంలో రెండు 'నవలా' రూపాలేర్పడ్డాయి. తదనుగుణంగా తెలుగులో కూడా శ్రీ 'తి' గారు గుర్తించినట్లు రెండు 'నవల' లున్నాయి. ఒకటి అందమైన స్త్రీ అని ప్రచారంలో ఉంటే, రెండవది ఒకానొక వచన సాహిత్య ప్రక్రియగా ప్రాచుర్యం పొందుతోంది. నైఘంటికులు ఈ రెండింటిని వేర్వేరు పదాలుగా గుర్తించి, అర్థ వివరణ చేయవలసి ఉంటుంది.

డా॥ గంటి శ్రీరామమూర్తి

అనకాపల్లి

# రచయిత ఎవరు ?

1. అనపర్తి భక్తి ప్రబోధ మండలివారు తమకడ నున్న తాళపత్ర గ్రంథములను పరిశీలించుచుండ "బాలబోధ" అను చిన్న పుస్తకము దొరికినది. అందు - పదార్థము త్వం - తత్ - అసి పదములు - వాచ్యార్థము - లక్ష్యార్థము - జహల్లక్షణ - అజహల్లక్షణ - జహదజహల్లక్షణ - ఉదాహరణలు - నాలుగు వేదముల లోని 4 మహావాక్యములు - ఋగ్వేదంలోని 'ప్రజ్ఞానం బ్రహ్మ' - యజుర్వేదములోని - 'అహం బ్రహ్మాస్మి' - సామవేదంలోని - 'తత్త్వమసి' - అధర్వణవేదంలోని - 'అయమాత్మా' అను వాక్యాలకు సరళమైన రీతిలో చక్కగా వివరణలు క్లుప్తముగా గలవు.

కాని రచయిత పేరు లేదు. చివర మాత్రము 'శ్రీ స్వయం ప్రకాశేంద్ర గురుభ్యో నమః' అని మాత్రము గలదు. మరే వివరములు తెలియవచ్చుట లేదు.

2. సప్తావరణము లని మరికొన్ని పత్రములు దొరికినవి. అందు - దుఃఖము, జన్మ, కర్మ, అభిమానము, అవిద్య, అజ్ఞానము, మాయ - అను ఆవరణములు ; యోగపాషండులు, కర్మ-వైరాగ్య-జ్ఞాన-మిథ్యా పాషండులను వివరించి ; కాలవంచన గురించి తెలుపు చుండ - పత్రములు పోయినవి. వీటి రచయిత తెలియవచ్చుట లేదు.

3. మరియొక పత్రములో - అల్లసాని పెద్దనగారి కవితా శైలిలో నీ పద్యము గలదు. కవి పేరు లేదు.

సీ. ఏ వర్తనంబున యింతకాలము మీరు
　　　సంచరించితిరయ్య జగములోన
యే తీర్థములు గంటి రెక్కడ నుంటిరి
　　　భావింప మీవంటి భాగవతులు
తీర్థ సంఘంబులం దీర్థీకరింతురు
　　　మీయందు కృష్ణుడు మెరయు కతన
మీర తీర్థంబులు మీకంటె మిక్కిలి
　　　తీర్థంబు లున్నవె ... చూడ

తే. వేర తీర్థంబు లవనిపై వెదకనేల
మిమ్ము బొడగని భాషించు ... ...
... ... ... ... లు వసుధలోన
మీరు సర్వంబు నెరిగిన మేర గలుగ.

ఒక్క పద్యమే గలదు. ఆయాచోట్ల అక్షరములు క్రిమిదష్టమైనవి. పై విషయములు తెలిసిన విజ్ఞులు - సాహితీవేత్తలు - పత్రికాముఖమునగాని, మాకుగాని తెలియజేయవలసినదిగా ప్రార్థించుచున్నాను.

గుండు విఘ్నేశ్వర శాస్త్రి,
అనపర్తి.

# "పెరవలి"

భారతి (అక్టోబరు 1984) లో శ్రీ ఎ. విజయ దత్తాత్రేయ శర్మ గారు గుంటూరు జిల్లా గ్రామనామ పరిశీలనలో "పెరవలి" అనే గ్రామనామం గురించి వ్రాసినది చదివి ఇది వ్రాయుచున్నాను.

కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలో ఒక "పెరవలి", అనంతపురం జిల్లా సింగనమల తాలూకాలో ఇంకొక "పెరవలి" నామం గల గ్రామములున్నవి.

గుంటూరులోని "పెరవలి"ని పై ప్రపంచంతో సంబంధం లేని ఏ ముసలవ్వలో తప్ప ఇప్పుడా గ్రామమును "పెరవలి" అని ఎవ్వరూ అనరు "పేర్వాలి" నామం స్థిరపడి పోయిందన్నారు శ్రీ శర్మ గారు.

కానీ కర్నూలు, అనంతపురం జిల్లాలలోని "పెరవలి" లను అదే పేరుతో పిల్చుచున్నారు. ఇవి ఇంకను స్థలనామ శాస్త్ర పరిశోధనకు గురికాలేదు.

"త్రి"

* * *

# సవరణ

1984 నవంబరు "భారతి" 66వ పేజీ నాల్గవ పేరాలోని "ముద్రిత ప్రతికి..." అని ప్రారంభమయే వాక్యమును ఈ క్రింది విధముగా చదువుకొన గలరు.

ముద్రిత ప్రతికి మూలాధార మనదగిన కాగితపు ప్రతిలో "పృథు కు కవిస్వాంత భీము" దని యుండగా, ముద్రిత ప్రతిలో "పృథుక కవిస్వాంత భీము" దని మార్చి ముద్రించ వలసిన అవసరమేల కలిగినదో ?

- సూర్యదేవర రవికుమార్



# గ్రంథ విమర్శలు

## మూర్తిత్రయోపాఖ్యానము

[దంతులూరి బాపకవి ప్రణీతము. డెమ్మీసైజు 8 + 31 + 307 పుటలు వెల. రూ. 6 లు. పరిష్కర్త : డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండరామయ్య గారు, ఎం. ఏ., పిహెచ్ డి. ప్రకాశకులు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఆకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు– 500 004.]

ఇది త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను గురించి తెలియజేసే ఆరాశ్వాసాల ప్రబంధం. ఇది ఏ పురాణానికీ అనువాదం కాదు. ఒక పురాణాన్ననుసరించి వ్రాసినదీ కాదు. దీనిని రచించిన బాపరాజకవి పురాణాలను చదివి, అక్కడక్కడి విషయాలను గ్రహించి దీనిని స్వతంత్రంగా రచించాడు.

దీని తొలిముద్రణ 1916లో జరిగింది. అప్పట్లో దీనిని పరిష్కరించిన విద్వాంసులు కాకినాడ కాలేజీ తెలుగు పండితులు శృంగార కవి సర్వారాయుడు గారు. ఆయన తమ ఉపోద్ఘాతంలో ఈ ప్రబంధాన్ని క్రొత్త లంక మృత్యుంజయ కవి రచించినట్లు తమకు తోచిన కొన్ని ఉపపత్తులను బట్టి నిర్ణయించారు. కాని యిందలి కృత్యాదిని బట్టి దీనిని దంతులూరి బాపకవియే రచించినట్లు సప్రమాణంగా, దీని సంపాదకులు, డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండ రామయ్య గారు నిశ్చయించారు.

ఈ ప్రబంధంలోని మొదటి ఆశ్వాసంలో కృత్యాద్యనంతరం సూతునికి, శౌనకాదులకు మధ్య జరిగిన సంభాషణలో కథ ప్రారంభమవుతుంది. జగదుత్పత్తి ప్రకారం చెప్పబడిన పిదప, సూతుడు పరబ్రహ్మను గురించి తెలుసుకోగల అధికారిని గురించి వివరిస్తాడు. ద్వితీయాశ్వాసంలో విరాట్ స్వరూపం, త్రిమూర్తుల కథ చెప్పిన తర్వాత బ్రహ్మను గూర్చి మిక్కిలి స్వల్పంగానే చెప్పబడింది. ఆ మీద యజ్ఞ వరాహావతరణను గురించి ఉన్నది. తర్వాతి రెండాశ్వాసాలలోను విష్ణుదేవుని గురించీ, చివరి రెండాశ్వాసాలలోను మహేశ్వరుని గురించి వివరించబడినది. తృతీయాశ్వాసంలో మధుకైటభాసురుల వధ, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామావతారముల సంగ్రహ కథలు చెప్పబడినవి. చతుర్థాశ్వాసం బలరామకృష్ణావతారాల కథతో ప్రారంభమయింది. ఇందులో కృష్ణావతార కథ చాలా విపులంగా ఉన్నది. ఇందులోని ఇతరములైన విష్ణుకథల కంటె ఈ కృష్ణావతార కథయే చాలా విపులంగా ఉన్నది. క శ్రీకృష్ణ భక్తుడై యుండుటయే దీనికి కారణమై యుండవచ్చున బుద్ధ, కలికి అవతారాల కథలు రెండు పుటలలో ముగించబడినవి.

పంచమాశ్వాసం శివపారమ్య కథనంతో ప్రారంభించబడిన సతీదేవి వృత్తాంత, దక్షాధ్వర ధ్వంసాలతోను, దేవతలు చేసిన శి స్తుతితోను ఆ ఆశ్వాసం ముగిసిపోతుంది. చివరి ఆశ్వాసంలో పార్వ జననం, శివశుశ్రూష, మన్మథభస్మీకరణ, పార్వతి తపస్సు, పార్వ వివాహం, కుమారోత్పత్తి, శివుని నీలకంఠత్వం, త్రిపురాసుర సంహార వర్ణించబడినవి. ఇంతటితో గ్రంథం సమాప్తమవుతుంది.

తన కవిత్వంలో తన పాండితీ ప్రకర్షను కూడా చూపవలెన కుతూహలపడే కవులలో ఈ బాపకవి ఒకడు. ఇతడు తన ప్రబ ధంలో వేర్వేరు వృత్తాలలో పద్యాలు చెప్పాడు. కొన్ని పద్యాల కేవలం సంస్కృతంలోనే రచించాడు. రచన సాధారణంగా సంస్కృ పద భూయిష్ఠమయినా సామాన్య జ్ఞానంకలవారు సులభంగా అర్థ చేసుకోనే వీలుగానూ, రసవంతంగానూ ఉంటుంది. శైలి కొక చిన ఉదాహరణ–

"క. మహి రాజ్యమునకు మాతా
మహు నభిషేకంబు చేసి, మధురాపురవా
స హిత జన బంధువరులకున్
బహుమాన మొనర్చె విపుల ప్రాజ్ఞుండగుచున్"

[చతుర్థాశ్వాసము, పుట 170

దీని సంపాదకులు డాక్టర్ కోదండరామయ్య గారు దీని చక్కగా పరిష్కరించి, ఉపయుక్త విషయాలతో నాతి విస్తరం పీఠికను వ్రాసి, సాహిత్యాభిమానులకు సంతృప్తి కలిగించార అలభ్యంగా ఉన్న ప్రాచీన గ్రంథాలను తిరిగి ముద్రించి ప్రకటిం ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ వారిని మనం ఎంతగానో అ నందించ వలసియున్నది.

## కకుత్స్థ విజయము

[గ్రంథకర్త : మట్ల అనంతరాజు. డెమ్మీసైజు 56 + 17 పుటలు. వెల : 5 రూ. సంపాదకులు డాక్టర్ జి. నాగయ్య గార

ఎం. ఏ., పి. హెచ్. డి. ప్రకాశకులు ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-4]

సూర్యవంశపు రాజులలో సుప్రసిద్ధుడూ, శ్రీరాముని పూర్వ పురుషుడూ అయిన కకుత్స్థుని విజయ వృత్తాంతం ఈ ప్రబంధంలో ప్రధాన కథ. ఆ రాజు, వృషభరూపం ధరించిన ఇంద్రుని మూపురంపై (కకుత్తుపయి) కూర్చుండి, దీపధ్వజునితో యుద్ధం చేసి, అతణ్ణి సంహరించిన వృత్తాంతం ఈ ప్రబంధంలోని ప్రధానాంశం. కర్పూర తిలకతో అతనికి వివాహం జరగడం అనుషంగికం. వృషభ కకుత్తు పయి కూర్చుండి యుద్ధం చెయ్యడంవల్లనే అతనికి కకుత్స్థుడనే పేరు స్థిరపడింది. ఇతడు ఇక్ష్వాకు మహారాజు మనుమడు. సుకుమారుని కుమారుడు.

ఈ ప్రబంధాన్ని రచించిన మట్ల అనంతరాజు, సాహితీ సమ రాంగణ చక్రవర్తి అయిన శ్రీకృష్ణ దేవరాయల వలెనే యుద్ధంలోనే కాకుండా కవిత్వ పాండిత్యాలలో కూడా మిక్కిలి సమర్థుడు. ఈ కవి గ్రామణి, అయిదాశ్వాసాల యీ ప్రబంధంలో సందర్భానుసారంగా క్షత్రియోచితంగా తన అనుభవాలను కూడా కథతో జోడించి తెలియ జేశాడు. తన పాండితీ ప్రకర్షకు దృష్టాంతంగా సర్వసాధారణమైన వృత్తాలనే కాక విశేషవృత్తాలను పెక్కింటిని సమకూర్చి తన కవిత్వా నికి వన్నెపెట్టాడు అపురూపంగా కానవస్తున్న ముద్రాద్యలంకారా లతో పద్యాలను రసవంతంగా రచించాడు.

ఈ ప్రబంధం రమారమి ఎనభైయేళ్ల క్రిందట తొలిసారిగా ముద్రితమయింది అప్పటి గుజివీ ప్రతిననుసరించి యిది యిప్పుడు సర్వాంగ సుందరంగా ముద్రితమయింది. అనుప లబ్ధంగా ఉన్న యీ ప్రబంధాన్ని, అలభ్యంగా ఉన్న ప్రాచీన గ్రంథాలను ప్రకటిస్తున్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమి వారు ప్రకటించారు. ఆకాడమివారు దేనిని ప్రకటించినా, సమర్థులైన విద్వాంసుల చేత పరిష్కరింపజేసి, అమూల్యాలయిన పీఠికలతో ప్రకటిస్తూ ఉన్నారు. సుప్రసిద్ధ విద్వ త్పరిశోధకులు డాక్టర్ జి. నాగయ్యగారు (ఎం. ఏ., పి. హెచ్. డి.) దీనికి సంపాదకులై. చక్కగా పరిష్కరించారు. ఆయన, తమ అమూల్యమైన పీఠికలో కవి, కవికాలం, కవిత్వపాండిత్యాలు, ప్రబంధ వైశిష్ట్యం, కథాసంగ్రహం, ఛందోఽలంకార విశేషాలు మున్నగు వాటిని వివరించారు. సాహిత్యాభిమానులకెంతో ఉపయోగకరమైన ఈ కకుత్స్థ విజయము ఆంధ్రులు ఆమోదాన్ని పొందగలదని భావిస్తున్నాను.

శ్రీ బులుసు వేంకట రమణయ్య

# చంద్రికా పరిణయము

[సురభి మాధవరాయ ప్రణీతము డెమ్మీసైజు 77 + 231 పేజీలు. వెల : 6-25. సంపాదకులు : శిరోమణి విద్వాన్, కేశవ పంతుల నరసింహ శాస్త్రిగారు, ప్రకాశకులు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు - 500 004]

సుప్రసిద్ధంగా ఉన్న ప్రౌఢ ప్రబంధాలలో చంద్రికాపరిణయం ఒకటి. ఇది రఘునాథభూషణుని వసుచరిత్ర వంటిది. అంతకంటె విశిష్టమైనదని కొందరి అభిప్రాయం. వసుచరిత్రను రాజాస్థాన కవి రచించగా. దీనిని (జటప్రోలు) సంస్థానాధీశ్వరులే రచించి ఆముక్త మాల్యదను రచించిన శ్రీకృష్ణ దేవరాయలతో తులతూగు తున్నారన్న మాట ! శ్లేషకవిత్వంలో వసుచరిత్రను తలపిస్తూ, కల్పనా ప్రౌఢిమలో ఆముక్తమాల్యదతో ఇది తులతూగుతూ ఉన్నది. ఆంధ్ర ప్రబంధ వాఙ్మయంలో ఇది ప్రసిద్ధి చెందినది.

ప్రౌఢ ప్రబంధాలు పండితులకే సులభంగా అర్థంకావు. ఇక సామాన్య పాఠకుల సంగతి చెప్పనక్కర్లేదు. వ్యాఖ్యానాలు ఉండబట్టే ఆముక్తమాల్యద, వసు, మను చరిత్రలు మున్నగు ప్రబంధాలను అర్థం చేసుకోగలుగుతున్నారు. అందువల్ల ఈ చంద్రికాపరిణయం ఎనభైఏళ్ల క్రిందట తొలుత ముద్రించబడినప్పుడు వ్యాఖ్యతో కూడా ముద్రించబడినది. వ్యాఖ్యాతలు సుప్రసిద్ధ విద్వాంసులు వెల్లాల సదాశివ శాస్త్రిగారూ, అవధానం శేషశాస్త్రిగారున్నూ, ఈ వ్యాఖ్య మూల గ్రంథంతోపాటు వేదం వేంకట రాయశాస్త్రిగారు, కందుకూరి వీరేశ లింగం పంతులుగారు మున్నగు మహావిద్వాంసుల ప్రశంసలను అందు కొన్నది. ఈ ప్రబంధం చాలా కాలం నుంచీ అలభ్యంగానే ఉన్నది. సుచంద్ర చంద్రికల వివాహమందలి కథ.

అలభ్యాలయి, స్మృతి పథం నుండి తప్పిపోతున్న ప్రాచీన ప్రబంధాలను, ఇతర గ్రంథాలతోపాటు ముద్రించడమే కాకుండా, వాటిని సమర్థులైన విద్వాంసులచేత పరిష్కరింపజేసి, విపులములైన పీఠికలతో కూడా చక్కగా అచ్చువేయించి తక్కువ ధరలకే అంది స్తున్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు దీనిని ముద్రించారు. వారు మూలగ్రంథాలనుమాత్రం ప్రకటించేనియమం పెట్టుకొన్నందున్న దీనిని వ్యాఖ్యతో కూడా ప్రచురించలేదని అనుకొంటున్నాను. అకాడమీ వారు, అనుభవజ్ఞులు. విద్వచ్ఛిరోమణులు, సద్విమర్శకులు అయిన కేశవపంతుల నరసింహశాస్త్రి గారిని దీని పరిష్కరణకు ఎన్ను కోవడం సమచితంగా ఉన్నది. నరసింహ శాస్త్రిగారు విపులమైన తమ పీఠికలో గ్రంథపాఠశస్త్యాన్ని విపులంగా తెలుపుతూ, కథాసంగ్రహాన్ని కూడా ఇచ్చారు. ఇది పాఠకులకు ఎంతో ఉపయోగకరం. ఈముద్రణ సాహిత్యాభిమానులందరి ఆదరణ పొందగలదని చెప్పవలసి ఉన్నది.

"ఆంగీరస"

శంకర గ్రంథరత్నావళి - నవమ సంపుటము

## స్తోత్రమంజరి (ద్వితీయము)

[అనువాదకులు : శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి. ప్రతులకు : సాధన గ్రంథమండలి, తెనాలి. వెల : రు. 12/-.]

భవబంధ విముక్తికి ప్రధాన సాధనం భక్తి. కలియుగములో యజ్ఞాలూ చయనాలూ చేసి అదేదో సంపాదిస్తామనో సాధిస్తామనో అనుకోడం అసాధ్యం. కేవలం భుక్తికే ప్రొద్దుదూరింది మొదలు ప్రొద్దు కూకేవరకు శ్రమించడమో భ్రమించడమో ముఖ్య కర్మాచరణముగా మానవజన్మ సతమతమవుతూండగా యజ్ఞాలూ యాగాలూ సాధించడం సాగించడమూ అయ్యే పనేనా ? అయితే కష్టాలు గడిచి గట్టెక్కడం ఎలాగ? దానికి సమాధానం ఒక్కటే. 'భక్తి' అనే ధనమును శ్రద్ధ అనే ఉత్తమ గుణముతో జోడించి సంపాదించుకుంచే గట్టెక్కడం అవుతుందని గీతాచార్యుడే చెప్పాడు. ఆ భక్తి ఎలా కుదురుతుంది ? స్తోత్రం వల్ల, ఆ స్తోత్రానికి ప్రాధాన్యం యిచ్చిన మన పురాణ గ్రంథాలు కేవలం కథా సందర్భముగానే వాటిని చెప్పాయి. ఆలాటి చిక్కులో 'ని రీతిగా స్తోత్రాలు పలికిన మహానుభావుడు శ్రీ శంకర భగవత్పా ు. ఆ మానవరూప శంకరుడు పలికిన స్తోత్రాలను సాధన గ్రంథ ండలి (తెనాలి) వారు మూడుభాగాలుగా సమకూర్చనెంచి ముద్రించ ములో బద్ధ కంకణులై కృతకృత్యులయారు. ఇది రెండవభాగం.

హనుమత్పంచ రత్నములతో ఆరంభించి శ్రీ దక్షిణామూర్తి స్తోత్రముతో పూర్తి అయిన యీ భాగమునందు ముప్పై స్తోత్రాలున్నాయి.

శ్రీరామాది పురుష దేవతాక స్తోత్రాలే కాక లోకపావన జీవనలైన గంగ, యమున మున్నగు నదీ మతల్లుల స్తోత్రాలు కూడా ఉన్నాయి.

చివరిది దక్షిణామూర్తి స్తోత్రం దక్షిణామూర్తి తత్వాన్ని బోధించే రచన తేట తెలుగులో ఉన్నది.

అన్నిటికీ రాఘవనారాయణ శాస్త్రిగారి తాత్పర్యం ఇంపైన నింపైన తెలుగు వెలుగుతో కళకళలాడుతూ వసంత వైభవాన్ని కోకిలలాగా వెల్లడిస్తు ంది.

సాధన గ్రంథమండలి వారి సంకల్పం శ్రీ శాస్త్రిగారి చేయూతతో ఆస్తిక జానానికి అర్థావ బోధతో అద్వితీయమైన సత్ఫలమును అందించిందని నిక్కచ్చిగా చెప్తున్నాను.

ఇందలి జగన్నాథాష్టకం శ్రీ నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రిగారు చెప్పినదని మా 'మండలము' లో పరంపరయా వినవచ్చే మాట. యత్తథాభవతు ! ఈ స్తోత్ర గ్రంథరత్నం ఇంటింటా ఉండ వలసేది.

## భారత నామానుక్రమణిక

[1 - 2/ 3, 4, 5 భాగాలు రెండు సంపుటాలు. రచన : శ్రీ పురాణపండ 'శ్రీచిత్ర'. ప్రతులకు : శ్రీమతి పురాణపండ కమలాదేవి, పురాణపండ వారి వీధి, ఆలమూరు-తూ॥ గో॥ జిల్లా. వెల : మొదటి సంపుటం రు. 12/- రెండవ సంపుటము రు. 18/-.]

మహాభారతం వైదిక లౌకిక విజ్ఞానానికి ఆచార్య పీఠం. అది చెప్పనిది లేదు. చెప్పినదంతా ఆచరణీయమే. దేవా నై గురువా నై అనే వారికి ఏది చెప్పినా ఫలితం సున్న. పాషండుడికి పరశ్వమేరుడు దిగివచ్చి చెప్పినా వృథాశ్రమ. కురు పాండవ కుటుంబకథకు సంబంధించిన మహాభారతానికి ధర్మబోధకై చిన్న చిన్న కథలు చేర్చి జీవన మార్గానికి మంచితోవ చూపించిన వ్యాస భగవానుని తారక మంత్ర గ్రంథం మహాభారతం, అర్థశాస్త్రము, న్యాయశాస్త్రము. ఇలా అన్ని శాస్త్రాల విషయమూ భారతంలో ఎడనెడ కనిపిస్తూఉంటుంది. అలాటి గ్రంథం తెలుగుజాతికి ప్రప్రథమ గ్రంథమయిందంటే ఆశ్చర్యపడాలి, ఆనందించాలి. వ్యాస గ్రంథగౌరవానికి మెరుగు పెట్టి తెలుగు సరస్వతికి అమూల్యాలంకారం సంతరించిన కవిత్రయం తెలుగుజాతికి త్రిసంధ్యోపాస్య దేవతాత్రయం అనే అందరూ అన్నారు, అంటారు.

ఆ మహాగ్రంథములో వచ్చే లోకాలూ, ద్వీపాలూ, దేశాలూ, నగరాలూ, జనపదాలూ నదులూ సముద్రాలూ సరస్సులూ తీర్థాలూ వనాలూ, పర్వతాలూ, దేవతలూ, మాతృకలూ, యక్షులూ, గంధర్వులూ నాగులూ, మునులూ, ఋషులూ, రాజులూ, మనుష్యులూ, స్త్రీలూ, స్థానములూ, వస్తువులూ వాటి పేర్లూ వాటికి సంబంధించి సంక్షిప్త వివరణ అకారానుక్రమణికతో యీ రెండు సంపుటాల్లో కనిపిస్తాయి.

'అశ్వనది :- కుంతిభోజ దేశమందలి ఒక నది. ఈ నదియందు కుంతి కర్ణుని పెట్టెలో పెట్టి వదలినది.

'కంకణ :- స్కందుని అనుచరియగు మాతృక.

'పురుమిత్ర :- ధృతరాష్ట్రుని వందమంది పుత్రులలో ఒకడు.

ఉదాహరణకు ఇచ్చాసీ మూడున్నూ. విశేషించి తెలుసుకోవలసేవి చాలా ఉన్నాయి. భారత మహాసముద్రమునందలి యీ విషయరత్నాల నింత శ్రద్ధగా ఒక చోట సమకూర్చిన శ్రీచిత్రను అందరూ అభినందించాలి.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సాహాయ్యమిచ్చిన తిరుపతి దేవస్థానం యాజమాన్యం ప్రశంసార్హం.

# స ప్త శ తి

[రచన : డా॥ కొమరవోలు వెంకట సుబ్బారావు. 18/87- ఆఫీసర్స్ కాలనీ, రామకృష్ణాపురం, సికిందరాబాదు - 500 556 మూల్యము : 12 రూపాయలు.

'సప్తశతి' అనగానే వినగానే హాల సంకలితం గాథాసప్తశతి చట్టున మదికి స్ఫురిస్తుంది. దానికి తెలుగు సేత అనే అనుకున్నాను. పుటలు తిరగవేశాను. ఓ! అది కాదిది అని పద్ధతి ననుసరించి ఒక పద్ధతిగా చదివాను,

దీనియందు 'ప్రకృతి పద్ధతి' ఆరంభించి 'ప్రగతి పద్ధతి'తో ముగిసే పద్ధతులు నలభై యారున్నాయి.

అన్నీ ఆట వెలదులే, చివరి 'ఉపసంహార' పద్యాలు కాక మొత్తం 702 ఉన్నాయి.

దీనిని 'పరిచయం' చేసిన వారు శ్రీ చీమకుర్తి శేషగిరిరావు.

ప్రస్తావించిన వారు శ్రీ పేరాల భరతశర్మ. తన కవితా పద్ధతినీ ఆంతర్యాన్నీ విజ్ఞప్తిగా వివరించిన వారు గ్రంథకర్త.

ఇంతకుముందు సుబ్బారావుగారి గ్రంథం 'యామాసా' చదివి నప్పుడే అనుకున్నాను. 'ఈయన యీనాటి గృహస్థాశ్రమ జనకుడు' అని.

ఈ 'సప్తశతి' లోని పద్యాలు బాహ్యజగత్తుకి ప్రతిబింబాలు. అంతర జగత్తుకి నిద్దపుటద్దాలు. కావ్యజగత్తుకి యీ సప్తశతి తావి వీడని తేకులూడని పారిజాత కుసుమ మంజరి.

భ్రాంతికీ భయానికీ లొంగక చదివి అర్థం చేసుకుని కావ్య ప్రయోజనమును పొందవలసే కావ్యం ఇది.

నవరసాలూ దీనిలో తొంగి చూస్తూ ఉన్నాయి. అన్ని పద్ధతుల్లోనూ నైసర్గికమైన ప్రకృతిబోధ వినిపిస్తూఉంటుంది. తాత్విక గ్రంథాలవల్ల పొందే ఎఱుక, ఆధునిక కావ్యాలవల్ల తెలుసుకోవలసే నడతా గంగా యమునా సంగమం లాగా యీ 'సప్తశతి' యందు చక్కని సాంగత్యం సంఘటించుకున్నాయి.

'మానవత్వ మనగ మనిషి రూపముగాదు,
మనసు రూతమందె మానవతయు
దానవతయు కలవు; మానదంభపు శిల
దానవతయు, సమత మానవతయు'-

ఈ క్రింది పద్యం వ్యాసోక్తికి అనుసరణ :

'ఒరులె యెట్టి పనుల నొనరించినఁ దనకు
అప్రియంబు తనకు నగునో, అట్టి
పనులనెల్ల పరుల కొనరింపకుంట ప్ర
త్యక్షమైన దైవలక్షణంబు'-

'యద్యదన్యై ర్విహితం నేచ్ఛేత్ ఆత్మనః కర్మ పూరుషః
న తత్పరేషు కుర్వీత జానన్నప్రియ మాత్మనః' -

(మహాభారతం, శాంతి పర్వం)

ఈ పద్ధతిలో ఉన్న యీ గ్రంథం నేటి స్త్రీలూ, పురుషులూ, విద్యార్థులూ, ఉపాధ్యాయులూ, పాలకులూ అందరూ ఓర్పుగా చదివి ఆంతర్యం గ్రహించి ఆనందించదగినది. చివరిదైన 'ప్రగతి పద్ధతి' మరీ ముఖ్యమైనదిగా నాకు తోచింది.

ముఖపత్ర చిత్రసుందరి ఎవరోకాదు 'ప్రకృతిమాత' ఆ తల్లి ఆడిస్తూన్న నాటకం ఇదంతా.

# క ల్హ ణు డు

[మూలం : శ్రీ సోమనాథ్‌ధర్. అనువాదం : శ్రీ కోవెల సంపత్కుమారాచార్య. ప్రాప్తిస్థానం: సాహిత్య అకాడమీ, న్యూ ఢిల్లీ. ప్రాంతీయ కార్యాలయం : 29, ఎల్డామ్ రోడ్, తేనాంపేట, మద్రాసు-18. వెల : రూ. 4/-.]

కల్హణుడనగానే బిల్హణుడు జ్ఞాపకం వస్తాడు. ఈ మహాకవి కూడా కాశ్మీరీయుడే. కాని బిల్హణుని కన్నా సుమారు నూరేళ్ల క్రితం వాడు.

కాశ్మీరదేశ ప్రకృతినీ, ప్రభువులనూ, భౌగోళిక విషయాలనూ, ఆచార వ్యవహారాలనూ, మతతత్వాన్నీ ప్రస్ఫుటమైన అద్దమునందు చూపించినట్లు 'రాజ తరంగిణి' అనే చారిత్రిక గ్రంథాన్ని వ్రాసి భారతదేశీయ సంస్కృత వాఙ్మయములో ఒక అమూల్య కృతిరత్నాన్ని చేర్చిన మహాకవి కల్హణుడు.

ఆలాటి చారిత్రిక కవిరాజును గూర్చి శ్రీ సోమనాథ్‌ధర్ ఆంగ్లములో వ్రాసిన గ్రంథానికి శ్రీ కోవెల సంపత్కుమారాచార్య అనువాదం ఇది.

కల్హణుడు : ఆయన కుటుంబం అనే శీర్షికతో ఆరంభించి పది శీర్షికల్లో రూపొందినదీ గ్రంథం.

పరిశుద్ధమైన బ్రాహ్మణ వంశములో పుట్టి సీమారక్షక దళాధిపతియైన శ్రీ చంపకుని కుమారుడు కల్హణుడు. కల్హణుని వ్యక్తిత్వానికి పరస్వతంగానూ లౌకికంగానూ ఆదర్శం 'రాజతరంగిణి'. పొగడ్తలూ తెగడ్తలూ లక్ష్యపెట్టని గంభీర హృదయుడు కల్హణుడని అతని కృతి చెప్తుంది. ద్విజధర్మానికి జోహారులర్పిస్తూ బౌద్ధమతానికి కూడా మన్నన నిచ్చినవాడు కల్హణుడు.

'లౌకిక వైభవమంతా అశాశ్వతం. వారి వారి కర్మఫలం ఆయా వ్యక్తుల ననుసరిస్తూనే ఉంటుంది.

'నీడ స్వయంగా నిరంకుశ ప్రవృత్తి గలది. నీడచే అనుసరింపబడిన యెండ మాత్రం సంబంధంవల్ల వందల విధాలుగా ఉంటుంది. ఆదే విధంగా దుఃఖం సుఖం కన్నా భిన్నమైనదే అయినా సుఖం యొక్క స్థితి అనంతమైన దుఃఖం కలిగించే బాధలతో వేధలతో విశీర్ణమైపోతూ ఉంటుంది.' — ఇవి కల్హణుని సూక్తులు.

కల్హణుని రచనమబట్టి కాశ్మీరంలో అస్పృశ్యతకు స్వస్తి చెప్పినట్లు కనివిస్తుంది.

'రాజ తరంగిణి' ప్రాచ్య పాశ్చాత్యులు ఎందరో అనువదించి ఆనందించిన విషయం ఎలా ఉన్నా ఆ గ్రంథం కాలగర్భంలో లీనం కాకుండా కాపాడేరని అందర్నీ అభినందించాలి.

ఈ గ్రంథం వల్ల ఇంకా చాలా విషయాలు తెలుస్తున్నాయి. ఆచార్యుల వారి అనువాదం ఆహ్లాదజనకంగా ఉంది. అందరూ చదివి ఆప్యాయంగా దాచుకోవలసే గ్రంథం ఇది.

పరమోపయోగియైన గ్రంథాన్ని తెలుగు చేయించి చక్కగా అచ్చువేయించిన కేంద్ర సాహిత్య అకాడమీని అభినందించవచ్చు

**శ్రీ యామిజాల పద్మనాభస్వామి**

## వెలుగు బాటలో సోవియట్ మహిళ

[రచన : శ్రీ రాజ్యం సిన్హా. అనువాదకులు : వాణీ రంగారావు. వెల : రు. 10-00. ప్రచురణ : ఎమ్. వెంకట రంగయ్య ఫౌండేషన్, 80, రోడ్ 3, స్నేహపురి నగర్ (పడమర) సికిందరాబాద్-500 028.]

విప్లవం సాధించిన విముక్తి, మహిళల సహకారం, పటిష్టమైన పునాదులు, ప్రణాళికల ద్వారా అమలు, సంస్కృతి, సవాలుచేసే శక్తి నాజీల దాడి, ఉజ్బెకిస్తాన్, లెనిన్‌గ్రాడ్ పర్యటన, రాజధానిలో, కుటుంబం, సర్వతోముఖాభివృద్ధి అనే పన్నెండు అధ్యాయాలు ఈ 122 పుటల పుస్తకంలో ఉన్నాయి. సామ్యవాద వ్యవస్థ ఏర్పడితేనే స్త్రీలకు సర్వతోముఖ వికాసం అనే అనుబంధం ఒకటి వున్నది.

మహిళల స్థానాన్ని బట్టి ఒక సమాజం సాధించిన అభివృద్ధిని లెక్కకట్టి వచ్చుననే సూత్రాన్ని ఆధునిక సాంఘిక శాస్త్రవేత్తలందరు అంగీకరించుతారు. అయితే ఆయా దేశాలలో ఆర్థిక, భౌగోళిక అంశాలను బట్టి మహిళలు సాధించదగు అభివృద్ధి నిర్ణయమవుతుందనే సూత్రాన్ని కూడా ఆధునికులలో అధికులంగీకరించుతారు. ఇటువంటి మదింపులు వస్తునిష్ఠంగా జరగాలి కాని అభిమానం వంటి అంశాల ప్రాతిపదికన కాదు, నిరంతరం యుద్ధప్రమాదాల నెదుర్కొనే దేశంలోని స్త్రీల కర్తవ్యమూ, "సర్వే జనాః సుఖినో భవన్తు" అనే ధ్యేయంతో విలసిల్లే దేశంలోని స్త్రీల పాత్ర ఒకటి కాజాలదు. ఆ మాటకొస్తే స్త్రీలు సుఖపడని దేశంలో పురుషులు కూడా సుఖపడజాలరు. మానవులందరి సమస్యలు ఒకటిగా ఉంటాయి. కాకపోతే తరతమ భేదాలు.

ఈ దృష్టితో పరిశీలించితే యీ రచయిత్రి ఈ పుస్తకం వ్రాయడంలో ఉద్దేశమేమిటో అర్థం కావడంలేదు. సోవియట్ రష్యాలో మహిళలు చాలా చాలా అభివృద్ధిని సాధించారు. రకరకాల ఉద్యోగాలలో పనిచేస్తున్నారు. ఇవన్నీ ప్రశంసించదగిన అంశాలే కానీ భారతదేశం వంటి దేశంలోని మహిళలకు సోవియట్ మహిళ ఆదర్శప్రాయమవుతుందా? ఆ దేశంలోని పురుషుల హోదాకూ మన దేశంలోని పురుషుల హోదాకు పోలిక ఉన్నదా? రాజరికం నుంచి విముక్తి పొందిన దేశంలోని సాంఘిక పరిస్థితులను పెట్టుబడుదారుల భూస్వాముల కబంధహస్తాలలో ఇరుక్కుపోయిన దేశంలోని సాంఘిక స్థితులకు పోలిక — సామ్యం వుంటుందా? ఉండదు. పోనీ వారిని ఆదర్శంగా పెట్టుకుని మన మహిళలు ప్రగతిని సాధించే అవకాశం వున్నదా? ఇదుగో యీ సందర్భంలోనే ఒక దేశంయొక్క భౌగోళిక వాతావరణాది అంశాల ప్రసక్తి వచ్చేది. ఎవరి అభిప్రాయాలు వారివి అనే వాదనకు శాస్త్రీయ దృష్టిలో ఆస్కారం లేదు గదా?

"సామ్యవాదం" అనే పదాన్ని ఈనాడు రచయితలు కూడా తరచు వాడుతున్నారు. ఏ అర్థంలో యీ మాటను ప్రయోగిస్తున్నారని అడగటం తప్పుకాదు. మన దేశంలో గ్రామిక జన జీవితాన్ని శ్రద్ధగా అనుశీలించే ఆ జీవన విధానంలో ఒక రకమైన సామ్యవాదం ద్యోతకం కాదా? వారి మనస్సులకు కూడా భరోసా వుండదు. వారి శిరస్సులు కూడా నిలబడతాయి. అయితే గర్వోన్నతం కాక పోవచ్చు. జ్ఞానం ఉచితంగా దొరకడం అంటే ఏమిటి?

అన్యదేశాలను చూచి ఆధునిక సాంకేతిక పద్ధతులను, సాంఘికాభివృద్ధి పద్ధతులను నేర్చుకొనడంలో తప్పు లేదు. కానీ ఆ నేర్చుకునే పద్ధతులవల్ల మన నైతిక ధృతికి చెరుపు జరగ రాదు. ఆ దృష్టితో యీ పుస్తకం గురించి ఇంత వ్రాయవలసి వచ్చింది.

## సోషలిస్ట్ ఉద్యమ స్వర్ణోత్సవాలు

(వి శే ష సం చి క)

[సంపాదకుడు : సురమౌళి. వెల: రు. 20-00. ప్రతులకు : ఐనంపూడి చక్రధర్, 31-ఎ, సైదాబాద్ కాలనీ, హైదరాబాద్.]

భారతదేశంలో సోషలిస్ట్ ఉద్యమం గురించిన వ్యాసాలు యీ విశేషసంచికలో వున్నాయి. 1984 అగష్టు 8, 9 తేదీలలో సోషలిస్ట్ ఉద్యమ స్వర్ణోత్సవాలు జరిగాయి. ఆ సందర్భంలో వెలువడిన యీ విశేష సంచిక సంపాదకుడుగా సురమౌళి. సంపాదకవర్గం కన్వీనర్‌గా శ్రీ ఐనంపూడి చక్రధర్ వ్యవహరించారు.

ఈ సంచికలోని వ్యాసాలలో (1) భారతదేశంలో సోషలిస్ట్ ఉద్యమం; సంక్షిప్త చరిత్ర. (2) నాసిక్ జైలునుంచి జారీ అయిన పత్రం, (3) సంఘటనా కార్యదర్శి నివేదిక, (4) రాజ్యాంగ పరిషత్తులు, (5) మొదటి మానిఫెస్టో, (6) ప్రజా సోషలిస్ట్ పార్టీ విధాన ప్రకటన, (7) 1955 డిసెంబరు 1956 జనవరిలో హైదరాబాద్‌లో జరిగిన సోషలిస్ట్ పార్టీ స్థాపన మహాసభ నివేదిక, (8) ఆంధ్ర ప్రదేశ్ సోషలిస్ట్ ఉద్యమ సంక్షిప్త చరిత్ర, (9) దివంగత మద్దూరి అన్నపూర్ణయ్య గారు వ్రాసిన చిలుక, కాకి సంవాదము. (10) మన జాతీయ నాయకులు అనే శీర్షికన డాక్టర్ మనోహరలోహియా, జయప్రకాశ నారాయణ్, సానెగూరూజీ వంటి జాతీయ నాయకుల పరిచయాలు, (11) క్విట్ ఇండియా (1942) ఉద్యమ చరిత్రయందలి విస్మృతాధ్యాయం, (12) భారతదేశ చరిత్రలో, రాజకీయాలలో సోషలిస్టు ఉద్యమ ప్రాధాన్యత వంటివి ముఖ్యమయినవి.

సోషలిస్టు ఉద్యమంలో దొర్లిన చారిత్రక తప్పిదాలు అనే వ్యాసంలో ఆలోచించవలసిన అంశాలు చాలా వున్నాయి. సురమౌళి వ్రాసిన వ్యాసంలో సోషలిజం మళ్ళీ చిగురించేనా ! అని ప్రశ్నించుకున్నారు. అంటే ఇప్పుడు సోషలిజం వాడిపోయినదని అర్థమా ? శ్రీ తుమ్మల చౌదరి వ్రాసిన తనను తాను తెలుసుకోవడానికి సాగిన యాత్ర భావ స్ఫోరకంగా వున్నది.

ఇంతకూ సోషలిజం అంటే ఎటువంటి వ్యవస్థయో యీ వ్యాసాలన్నింటినీ ఎంత శ్రద్ధగా చదివినా విశదం కాదు. అయినప్పటికీ యువకులందరూ శ్రద్ధగా చదివి ఆలోచించవలసిన పెక్కు అంశాలు యీ వ్యాసాలలో వున్నాయి. అభివృద్ధి చెందుతున్న సాంకేతిక విజ్ఞానం వెలుగులో పాత మాటల అర్థం మారడం లేదనగలమా ? అందునా రాజకీయ పరిభాష విషయంలో ఇది మరింత వాస్తవం కాదా ?

**వి. ఎస్. అవధాని**

## జ్వా ల న మ్

[రాధేయ వెల : రు. 5-00లు ప్రతులకు : 1) రాధేయ, అధ్యక్షుడు, సాంస్కృతీ సమాఖ్య; కడపజిల్లా విభాగం; పందిళ్ళపల్లి 516 291; కమలాపురం తాలూకా; కడప జిల్లా. 2) ఉమ్మడిశెట్టి సుబ్బారాయుడు; ఉమ్మడిశెట్టి సిల్కు సెంటర్; ముద్దనూరు-516380]

రాధేయ యువకవి. గతంలో కొన్ని కవితా సంకలనాలను వెలయించాడు. ఈ జ్వాలనమ్ అనే కవితా సంకలనాన్ని శ్రీ శ్రీ అంకితం చేస్తూ సంకలనం చివరలో శ్రీ శ్రీ పై ఒక స్మృతి గీతం కూడా రాశాడు. కవిగా అతనిలో వచ్చె భావ పరిణామం ఈ సంకలనంలో చూస్తాం. భావాలను శక్తివంతంగానూ, సరళంగానూ కవితాత్మకంగానూ చెప్పటం ఈ సంకలనంలోని ప్రత్యేకత. విప్లవ భావం అనే శబ్దం ఈనాడు చాలామంది వాడుతున్నారు ; శ్రీ రాధేయ వాడారు. విప్లవ శబ్దానికి వి. ర. సం. పుట్టుకతో ఒక రూఢి అర్థం ఏర్పడింది. సంపూర్ణంగా ఆ అర్థ బలంతోనే ఈ శబ్దాన్ని ఈ కవి ఉపయోగించాడని నేననుకోను. ఈ వ్యవస్థ పోవాలి ; మరో వ్యవస్థ రావాలి ; దానికే ప్రజలు సంఘటితులు కావాలి అనే మాటలు చాలా మంది చెప్పారు. ఆ చెప్పటంలో దృక్పథాలు భేదిస్తున్నాయి. సాంస్కృతీ సమాఖ్యగాని, దాంట్లో ఉన్న కవులుగాని, వి. ర. సం. దృక్పథాన్ని అంగీకరించారనటానికి సాక్ష్యాలు లేవు కనక రాధేయ గారి కవిత్వంలో కనిపించే విప్లవ భావం అభ్యుదయ కవితావిర్భావ కాలం నాటిదే అని అనుకోవాల్సి వస్తుంది.

ఇదీ శ్రీ రాధేయ కవిత్వం చేయి తిరిగిన కవిత్వం అని చెప్పటానికి ఒక కొన్ని ఉదాహరణలు.

"సైతసోకపులతో ఆడుకుంటున్న చేతులు
నల్ల కోట్లతో గంతలు కట్టుకున్న కళ్ళు,
పిచ్చుకలను ప్రేలుస్తున్న పిస్తోళ్ళు
ఈ వ్యవస్థ దౌర్భాగ్యాన్ని సంరక్షిస్తుంటే
దేవుళ్ళ పేరుమీద దేహాలు బలుస్తున్నాయి."

"ఔదార్యాన్ని చూపించే వాళ్ళు
గుళ్ళు, గోపురాలు నిర్మించుకోండి !
సానుభూతి ప్రకటించే వాళ్ళు
సత్రాలు, సావిళ్ళు కట్టించుకోండి
కానీ ... ... ఈ మనుషుల కోసం
హక్కుల కోసం
ఆలోచించే వాళ్ళు
పోరాటానికి సిద్ధం కండి !"

ఇలా చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగానూ, స్పష్టంగానే కాకుండా మనస్సుకు పట్టేటట్లు చెప్పటం ఈ కవితా సంకలనం ప్రత్యేకత !

**శ్రీ టి. ఎల్. కాంతారావు**



*Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247*